# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

జులై 1977

సంపుటము : 54 సంచిక : 7

విడిపత్రిక వెల రూపాయిన్నర



# చంద్రుడిలో మచ్చల్లాగా యీ వ్రేలిముద్ర లేమిటి?

తమ ఊరి చెరువుకు పడిన గండి పూడ్చడంలో మైనర్ యిరిగేషన్‌శాఖ అధికారులు జాప్యం చేస్తున్నారని మంత్రిగారికి మహాజరు సమర్పించారు కోటపర్రు గ్రామస్థులు.

ఆ వూరి జనాభా 2 వేలు... మహాజర్లో సంతకాలూ దాదాపు రెండువేలు. నాలుగో అయిదో వ్రేలి ముద్రలున్నాయి. మంత్రిగారు ఆశ్చర్యపోయారు.

అనేక గ్రామాల ప్రజలు యిచ్చే మహజర్లలో అన్నీ నిశానీలే వుంటాయి. "నిరక్షరాస్యతా నిర్మూలన పథకం క్రింద వున్న గ్రామాల్లో యీ ఊరు వుందా?"

"లేదండీ" అనే సమాధానం వచ్చింది మంత్రిగారికి.

అసలు జరిగిందేమిటంటే ఆవూరి సర్పంచ్ బి.ఏ. ప్యాసయ్యాడు. అందరినీ అక్షరాస్యులు చెయాలని ఆయన లక్ష్యం.

ఊళ్లో యువతీ యువకుల నందరినీ ప్రోగుచేసి ఒక్కొక్కరికి యిన్ని యిండ్లని నిర్ణయించి అందరికి రాత్రిపూట చదువు నేర్పించాడు.

ప్రజలు స్వయంగా పూనుకుంటే పథకాలు అవే పుట్టుకు వస్తాయి. అవే అమలు జరుగుతాయి.

చంద్రుడిలో మచ్చలాగా వున్న యీ నాలుగైదు నిశానీలు కూడా పది పన్నెండు రోజుల్లో సంతకాలుగా మారుతాయని సర్పంచ్ మంత్రిగారికి హామీ యిచ్చాడు.

---

*ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము*

5/77-78

# విషయానుక్రమణిక

## జూలై 1977





# అమృత మథనం!!

## శ్రీ వి. సంపత్కుమారాచార్య

కాలం ఒక కవ్వం అయితే
సామాజిక జీవనమనే
ఉదధిలోన జరుగుతోంది
అంతులేని ఒక మథనం !...

నిన్నటిదాకా పొంగిన
గరళం కాడ్పడిపోయి
సుధల ఉల్లోలాలిప్పుడు
తలలెత్తుకు చూస్తున్నాయ్ !...
కాలమనే కవ్వమింక
అమృతాన్ని చిలుకుతుంది ! ...

మొన్నటివరకూ పాత్తపు
పుటలలోన ఆశయాలు
వట్టి అక్షరాలమధ్య
నలిగిపోయి చేసినట్టి
మూగ...వెట్టిచాకిరీకి
లభించింది విముక్తి !! ...

ఆశయాలను చేతలలో
చదువుకునే విద్యార్థి ...
అభ్యున్నత ఫలకంపై
అందరిగా ఓనమాలు
దిద్దుకునే విద్యార్థి ...
నేటి నవ్య సమాజం !! ...

సౌహృద్యరాగాన
బ్రతుకులోన కలిమిపాట
మనిషి హృదయస్పందనలో
మానవతకు ప్రతిధ్వని
వినిపించే శుభతరుణం —

శాశ్వతమౌ అందాలను
మానవతా దర్పణంలో
చూచి...మురిసే సమయం—
ఆసన్నమైంది...రండి !! ...

ముచ్చువిషం మృగ్యమై
త్రచ్చబడిన దమృతం !! ...

తనివితీర త్రాగుదామిక
లెండి ! ... రండి ! ... పదండి !! ...

---

# స్పర్శ

## శ్రీ నందిని సిధారెడ్డి

కొన్ని కళ్ల జీవితాలు
చదివితే చాలు —
కొన్ని జీవితాలు
కళ్లు తెరుస్తాయి !!
కాని —
మేధస్సొక్కటే కాదురా,
పిచ్చివాడా !
ఆ కళ్లను చదవాలంటే ...
ముందు —
ఈ కళ్లకి హృదయ ముండాలి మరి.

# పునరపి జననం - పునరపి మరణం

## శ్రీ పి. యస్. శాస్త్రి

అప్పుడు
ఇంకా వయస్సు
మనస్సునీ, మనిషినీ పెంచనప్పుడు,
ఆకాశపు రంగుల్నీ
చెట్లు చేమల పచ్చదనాన్నీ
చూసి మురిసిపోయేటప్పుడు,
తెలుపు ఎరుపు రంగుల తామరపువ్వుల్ని
గుండెలోతు బురదలోకి దిగి
కోసుకురావటం సిగ్గు కలిగించనప్పుడు,
అలాగే అనుకున్నాను!
ఎవర్నిగురించి, దేన్ని గురించి
భయపడటం ఎరగనప్పుడు,
మనిషి ప్రవర్తనని, బెదిరించి
శాసించే లోకం వొకటుందని
తెలియనప్పుడు,
చింపిరి జుట్టుతో, చిన్నలాగూతో,
దుమ్ముకొట్టిన కాళ్ళతో,
మాసిపోయిన బట్టల్తో,
స్వేచ్ఛగా, నిర్భయంగా గంతులువేస్తూ,
మనసు కల్పించే సుందరలోకాల్లో విహరిస్తూ,
అలాగే అనుకున్నాను!
ఆకాశంలోని ఇంద్రధనుస్సు దగ్గరకు
మాంత్రికుని కీలుగుర్రంపై వెళ్ళటం,
అందాల రాకుమారిని రక్షించటం కోసం,
సప్త సముద్రాలను దాటడం,
అతి సహజాలుగా భావించినప్పుడు,
కోరుకున్నవి సాధించటం కోసం,
తొందరగా పెద్దవాణ్ణి కావాలని కోరుకున్నాను!
ఔను! అలాగే అనుకున్నాను!
ఇప్పుడు
ఇన్నేళ్ళు గడిచాక
వాస్తవానికి వూహలకూ మధ్యవున్న
దూరం తెలిసాక,
ఊహల్ని నిజం చెయ్యటం ఎంత కష్టమో,
తెలిసాక,
మళ్ళీ చిన్నతనంలోకి
లోకాన్ని నిర్లక్ష్యంచేసి తిరిగిన ఆకాలంలోకి,
ఊహలూ, నిజాలూ వొకటేగా మెలిగిన ఆకాలంలోకి,
మనస్సు కల్పించే మంత్రలోక విహారాలలోకి,
వెళ్ళాలని ఆత్రపడతాను!
చిన్నతనంలో కన్నకలలు
పెద్దయ్యాక సాధించటం ఎంతకష్టమో,
పెద్దయ్యాక చిన్నతనాన్ని సాధించటం
అంతకు రెండింతలు కష్టమని,
గ్రహించానో, లేదో,
మిత్రుడు మృత్యువు
గుమ్మంలో నిలబడివున్నాడు నవ్వుతూ!

# "అక్కా! నువ్వు లేవు - కాని నీ స్మృతి నాతోనే వుంది"

శ్రీ పి. యస్. శాస్త్రి

అక్కా ! ఇంకా గుర్తుంది నాకు !
ఆ రోజు,
నేను పుట్టిన నాలుగేళ్ళకో, అయిదేళ్ళకో,
మన పల్లెటూళ్ళో
నూతి చపటాలో
నేను బొందులాగ్గా బిగించుకుని కూర్చుని
తలంటుపోసుకుంటున్నప్పుడు,
బాల్చీతో నీళ్ళుతోడి
నా నెత్తిమీదపోస్తూ
"పెద్దవాడివయ్యాక ఏం చేస్తావురా అబ్బీసూ?"
అన్న నీ ప్రశ్నకు
"ఆకాశంలో విమానాలు తోలుతా !"
అన్న నా జవాబును విని,
"అమ్మో ! వద్దురా !"
అని నువ్వు భయంతో వొణుకుతూ,
నన్ను దగ్గరకు తీసుకోవటం,
అక్కా ! ఇంకా గుర్తుంది నాకు !
ఇంకో అయిదేళ్ళకు
నీకో చిన్న బుజ్జిబాబు కలిగినప్పుడు
వాడి బుల్లి బుల్లి చేతుల్ని నిమురుతూ
లేత బుగ్గల్ని ముద్దుపెట్టుకుంటూ
"అక్కా! వీణ్ణి పెద్దవాడయ్యాక ఏం చేయిస్తావ్?"
అని నే నడిగినప్పుడు,
చల్లగా, వెన్నెల కురిసినట్టుగా,
మెత్తని చిరునవ్వు నవ్వుతూ
అమ్మకంటే ఆప్యాయంగాచూస్తూ,
"నీలా బాగా చదువుకునేలా
చేస్తానురా అబ్బీసూ !"
అని నీవన్నప్పుడు,
సంతోషంతో, సిగ్గుతో, ఉక్కిరి బిక్కిరౌతూ,
నీ వొడిలో తలదాచుకోవడం

అక్కా ! ఇంకా గుర్తుందినాకు !
ఇంకో సంవత్సరానికి
అందరినీ చల్లగా ఆదరించే అమ్మవారు
ఎందుకో మామీద అలిగి, మన అనుబంధాల్ని
మంటగలిపి,
నిన్ను తనలో కలిపేసుకుందని తెలిసినప్పుడు
గుండెలు పగిలేలా ఏడుస్తూ
"అక్కా ! ఎక్కడున్నావు నువ్వు ?"
అని దిక్కుల్ని వెర్రిగా ప్రశ్నించి నప్పుడు
"నీ మనసులోనే వున్నానురా అబ్బీసూ !"
అన్న నీ గొంతు నా చెవిలో వినిపించడం,
అక్కా ! ఇంకా గుర్తుంది నాకు !
ఇప్పుడు, నువ్వులేని యిరవయ్యేళ్ళకు,
ఆకాశంలో విమానాలను కాకుండా,
నేను, ఆఫీసులో కాగితాలు తోలుతున్నప్పుడు,
నా ఆశల ఉయ్యాలల త్రాళ్ళు తెగి,
కోరికలు ఆకాశంమీదనుంచి నేలకు దిగజారి,
బ్రతుకులో పైకెదగడం చేతకాక,
ధైర్యం, సాహసం, ఆవిరైపోయి,
అవ్యక్త వ్యథ కన్నీరు తెప్పించినప్పుడు,
ఎక్కడనుంచో నీ రూపం తళుక్కున
నా కళ్ళముందు మెరిసి,
నీ వాణి వినిపిస్తుంది !
"అబ్బీసూ, భయపడకురా !
కష్టాల్నీ, నిరాశనీ, ధైర్యంగా ఎదుర్కో !
జీవితం నడిపినట్టు నడవటం కాక
నువ్వు జీవితాన్ని నడపటం నేర్చుకో !"
అన్న నీ మాటలు ఓదార్పు నిస్తాయి !
భవిష్యత్తుమీద ఆశ చిగురింపచేస్తాయి !
అక్కా ! నువ్వులేవు కాని
నీ స్మృతి మాత్రం నాతోనేవుంది !

డాక్టర్ దాశరథి

# మలయు భాషా స్వరూప స్వభావాలు

మలయు ద్వీపకల్పం మలేషియాగా మారింది 1963 లో. అప్పటి వరకు ఆ ప్రాంతాన్ని ఫెడరేషన్ ఆఫ్ మలయా అనే వారు. ఇప్పటికీ యూనివర్శిటీ ఆఫ్ మలయా అనే పేరుతో ఒక విశ్వవిద్యాలయం వున్నది. ఇది 1949లో స్థాపితం.

సింగపూరు, సారవాక్, ఉత్తర బోర్నియో, మలయా ద్వీపకల్పం కలిసి మలేషియా అయింది. అయితే అభిప్రాయ భేదాలవల్ల 1965లో సింగపూరు రాష్ట్రం విడిపోయి స్వతంత్ర రాజ్యం అయింది.

ఇప్పటి మలయు ద్వీపకల్పంలోని అధికార భాషను మలయు భాష, లేదా మలే, లేదా 'బహాసా మలేషియా' అనవచ్చును.

మలేషియాలో మలే భూమి పుత్రులు, చైనీయులు, భారతీయులు ఉన్ననూ, నూటికి యాభై మంది మలేలే గనుక వారి భాషే అధికారభాష అయింది.

## మలేషియాలో విద్యావిధానం

మలేషియాలో రెండు రకాల పాఠశాలలున్నాయి. జాతీయ పాఠశాలలలో(National Schools)బోధనాభాష బహాసా మలేషియా. జాతీయపద్ధతి పాఠశాలలలో (National Type Schools) బోధనా భాష ఇంగ్లీషు, చైనీస్ లేదా తమిళంగా వుంటుంది. అయితే అన్ని పాఠశాలలలో ఇంగ్లీషూ, బహాసా మలేషియా విధిగా అధ్యయనం చేయవలసిన విషయాలుగా వుంటాయి.

ప్రాథమిక స్థాయినుంచి విశ్వవిద్యాలయ స్థాయివరకు ముఖ్య బోధనా భాష 'బహాసా మలేషియా' యే.

మలేలు కాని వారికి 'బహాసా మలేషియా' నేర్పడానికి ప్రభుత్వం ఏర్పాట్లు చేసింది. జాతీయ భాషా పరీక్షలు నిర్వహిస్తున్నది.

1970 లో స్థాపించబడిన మలేషియా జాతీయ విశ్వవిద్యాలయం (National University of Malaysia)లో అన్ని విషయాలు డిగ్రీస్థాయిలో సైతం బహాసా మలేషియాలోనే బోధించబడుతున్నవి.

## మలే భాషకు సొంత లిపిలేదు

మలే భాషను రోమన్ లిపిలోనే వ్రాస్తున్నారు. క్రమంగా అరబ్బీ లిపిని ఉపయోగించడానికి ప్రయత్నం జరుగుతున్నది. నిజానికి ప్రపంచంలో చాలా భాషలకు సొంత లిపి లేదు. మన దేశంలో ఉర్దూకు ఫారసీ లిపి వాడుతున్నారు. రోమన్ లిపిని "రూమి" అని, అరబ్బీ లిపిని 'జావీ' అంటారు.

మలే భాష ఆటవిక భాషవంటిది కావడం వల్ల కావచ్చు లిపి లేదు. మనవద్ద, చెంచు, కోయ, ఎరుకల, లంబాడీ భాషలకు లిపి లేదు కదా! ఈ భాషలోకి రాజకీయ, చారిత్రక కారణాలవల్ల సంస్కృత, ఆంగ్ల, అరబ్బీ పదాలు ప్రవేశించాయి. సంస్కృతి వల్ల సంస్కృత పదాలు, పరిపాలకులవల్ల ఆంగ్లపదాలు, మతంవల్ల అరబ్బీ పదాలు చేరివుంటాయి. మలేషియా దేశంలోని అధిక సంఖ్యాకులైన భూమిపుత్రులు మహమ్మదీయులు. వారి మత గ్రంథం కురాన్. కురాన్ అరబ్బీ భాషా గ్రంథం కదా!

ఇండోనీషియావంటి ఆగ్నేయాసియాదేశాలలో 'మలే' వంటి భాషనే మాట్లాడుతారు. కనుకనే ఇటీవల ఆధునిక పరిభాషా పదాలను సిద్ధం చేయడానికీ, భాషను ఆధునికం చేయడానికీ, గుణితములో సమరూపతను సాధించడానికీ, మలేషియన్ — ఇండోనీషియన్ కౌన్సిల్ ఏర్పరచారు. ఈ కౌన్సిలు మలేభాషలో నూతన వర్ణక్రమమును, నూతన పద కల్పనను క్రమబద్ధం చేస్తున్నది.

ఈ కార్యక్రమం ఒక భాషా సాహిత్య సంస్థ (దెవాన్ బహాసాదాన్ పుస్తక) పక్షాన జరుగుతున్నది. మలే నిఘంటువులను ఈ సంస్థ ప్రచురించింది.

## మలే శబ్దోచ్చారణ : అచ్చులు (ప్రాణములు)

**(1) ఆ : వివృత జిహ్వాగ్ర స్వరము (Open front vowel) అచ్చు**

| | |
|---|---|
| పాద—చాలును | (Pada) |
| మాస—సమయం | (Masa) |
| సాయ—నేను | (Saya) |

మనం ఉచ్చరించినంత దీర్ఘంగా మలే భాషలో "పాద" ఆది శబ్దాలు ఉచ్చరించరు. కొంచెం హ్రస్వంగా ఉచ్చరిస్తారు. ఈ 'ఆ' అనే అచ్చును (ప్రాణం) 'అ' కంటే దీర్ఘంగా మన 'ఆ' కంటె హ్రస్వంగా ఉచ్చరిస్తారు.

మలే భాషలో తాటాకువంటి ఉచ్చారణగల మాటలుగానీ, ఆంగ్లంలోని 'MAT' వంటి ఉచ్చారణగానీ లేదు.

## (2) ఎ: జిహ్వా మధ్య స్వరము (Central Vowel)

పెటా (Peta) పటం—పథకం
సెముట్ (Semut) చీమ

ఈ శబ్దాలలో 'ఇ' కారం మన 'ఎ' కారానికి దగ్గరగా ఉచ్చరించబడుతుంది. మలేలో టెలివిషన్‌ను టెలివిషెన్ అని ఉచ్చరిస్తారు. Fashion అనే ఆంగ్లపదాన్ని Feshen అని ఉచ్చరిస్తారు. 'ఇ', 'ఎ' లా వినపడుతుంది.

## (3) ఏ : అర్థసంవృత జిహ్వాగ్ర స్వరము (Half closed front Vowel)

ఏకోర్ (Ekor) తోక
ఏసోక్ (Esok) రేపు

వీటిలోని "ఏ" తెలుగులో ఉన్నంత దీర్ఘముగా ఉచ్చరించబడదు.

# హల్లులు (ప్రాణులు)

సంవృత శబ్దము (closed syllable) పిపిట్ : పిచ్చుక
వివృత శబ్దము (Open syllable) జంపి : జపించు

# స్వరద్వయసంధి (Diphthong)

ఔ (au) ఐ (ai) ఓయ్ (oi)

ఔ : కెర్బౌ (Kerbau) : గేదె
ఐ : నైక్ (Naik) : అధిరోహించు
ఓయ్ : అంబోయ్ (Amboi) అల్లిన సంచి

# వాక్యనిర్మాణము

ఇని =ఇది
సాయా=నాది
సురత్=లేఖ
ఇని సురత్ సాయా=ఇది నా లేఖ
ఇని కెరుసి సాయా=ఇది నా కుర్చీ
ఇని బుకు సాయా=ఇది నా పుస్తకం

'బుకు' బుక్ అనే ఆంగ్ల శబ్దభవము : **Buku** అని వ్రాయుదురు.

ఆంగ్ల శబ్దాల గుణితము మలే భాషలో ఏ విధంగా మారుతుందో కొన్ని ఉదాహరణలద్వారా తెలిసికొనవచ్చును:—

ఇంగ్లీషు : Glass
మలే : Gelas
ఇంగ్లీషు : Lamp
మలే : Lampu
ఇంగ్లీషు : Pencil
మలే : Pensel
ఇంగ్లీషు : Book
మలే : Buku
ఇంగ్లీషు : Television
మలే : Talivishen
ఇంగ్లీషు : Post
మలే : Pos (T లుప్తము)
ఇంగ్లీషు : Science
మలే : Sains
ఇంగ్లీషు : University
మలే : Universiti (y, iగా మారింది)

# మలే భాషలోని అరబ్బీ, ఫారసీ, సంస్కృత పదాలు

| | | | |
|---|---|---|---|
| (Salamat) | సలామత్ | (అరబ్బీ) | క్షేమం |
| (Waktu) | వక్తు | (అరబ్బీ) | సమయం (వక్త్ అనాలి) |
| (Juang) | జంగ్ | (ఫారసీ) | యుద్ధం |
| (Jumlah) | జుంలా | (అరబ్బీ:పుంలింగపదం) | మొత్తము |
| (Jesim) | జిసిం | (అరబ్బీ : పుంలింగపదం) | శరీరం (జిస్మ్ అనాలి) |
| (Jin) | జిన్ | (అరబ్బీ) | దయ్యము |
| (Khairat) | ఖైరాత్ | (అరబ్బీ:స్త్రీలింగపదం) | దానము |
| (Khas) | ఖాస్ | (అరబ్బీ) | ప్రత్యేకమైన |
| (Alam) | ఆలం | (అరబ్బీ) | ప్రపంచం |
| (Duta) | దూత | (సంస్కృతం) | రాయబారి |
| [Jiwa] | జీవ | (సంస్కృతం) | ఆత్మ |
| [Adipati] | అధిపతి | (సంస్కృతం) | పరిపాలకుడు |

[Agama] ఆగమ (సంస్కృతం) మతం
(Alpa) అల్ప (సంస్కృతం) కొద్ది
Bahaya (బహయ) (తద్భవం) భయం
Bangsa (బంగ్స) ,, జాతి
Bahasa (బహాసా) ,, భాష
Siswa (సిస్వ) ,, (విశ్వవిద్యాలయ విద్యార్థి)
Siswi (సిస్వి) ,, ( ,, విద్యార్థిని)
Mentera (మెంతెర) ,, (మంత్రం)
Menteri (మెంతెరి) ,, (మంత్రి)
Melati (మెలతి) ,, మాలతి
Muka (ముక) ,, ముఖ
Nada (నాద) తత్సమం ధ్వని
Nadi (నాడి) ,, నాడి
Naga (నాగ) ,, సర్పం
Nama (నామ) ,, పేరు
Nirmala(నిర్మల) ,, పరిశుద్ధమైన
Paramasastra (పరమశాస్త్ర) తత్సమం వ్యాకరణం
Istri (ఇస్త్రీ) తద్భవం భార్య
Vanita (వనిత) తత్సమం స్త్రీ
Periksa (పెరీక్సా) తద్భవం తనిఖీ
Rahsia (రహ్సియ) ,, రహస్యం
Ratna (రత్న) తత్సమం రత్నం

ఇవి గాక సమాధి, సామి (స్వామి) సమ, సమరత, సర్జన (సజ్జన) సారి (సార) సువర (స్వర) సుచి (శుచి) సుక (సుఖ) స్వతంత్ర, స్వర్గ (స్వర్గ) తప (తపస్సు) గజ, లాభ వంటి పదాలు వందలాదిగా మలేభాషలో కనిపిస్తాయి. వీటిని అరువు తెచ్చుకున్న పదాలు (Loan words) అంటారు వారు.

కొన్నిపదాలు సంస్కృత భవాలైనా అట్లాఅనిపించనంతగా మారిపోయాయి. ఉదాహరణకు : మెర్డెకా (స్వాతంత్ర్యం) — ఇది మహారిద్ధిక—మహావృద్ధిక యొక్క అపభ్రంశం.

మలేభాషలోని మరో ప్రత్యేకత ఏమిటంటే—బహు వచనానికి ఏకవచన శబ్దాన్నే రెండుసార్లు అంటారు. పుస్తకాలు అనటానికి "బుకు, బుకు" అంటారు.

"చిత" అనగా మలే భాషలో కోరిక. కోరికలు అనడానికి 'చిత చిత' అంటారు. ఎన్నో కోరికలు—అనాలంటే "బాన్యక్ చిత చిత" అంటారు. ఎన్నో అంటే "బాన్యక్." అన్నీ అంటే "సెమువా."

ఇంటిని మలేలో "రుమా" అంటారు.

"ఈ ఇండ్లు" అనడానికి "రుమా రుమా ఇని" అనాలి. 'ఈ' అనే సర్వనామం ఆఖరులో వస్తుంది.

"ఆ ఇండ్లు అనడానికి" "రుమా రుమా ఇటు" అనాలి. "ఇటు" అనగా ఆ. "ఇని" అనగా "ఈ."

పలచని పుస్తకము : బుకు నిపిస్.

నిపిస్ (పలచని) అనే విశేషణము మలేలో నామవాచకము తరువాత వస్తుంది. "పుస్తకము పలచని" అని తెలుగు రూపం. ప్రధాన వార్త అనటానికి "బెరితా పెద్దాన" వార్త ప్రధాన (ముఖ్య వార్త) అంటారు. నామవాచకం తరువాత విశేషణం రావడం సర్వేసర్వత్రా కనిపిస్తుంది మలే భాషలో.

## క్రియాపదాల ప్రత్యేకత

మలే భాషలో క్రియాపదాలు భూత, వర్తమాన, భవిష్యత్ కాలములను తెలియజేయడాకిని మారవు.

"వెళ్ళు" అనే క్రియాపదం వెళ్ళెను, వెళ్ళుచున్నాను, వెళ్ళగలదు, గా తెలుగులో ఉన్నను మలే భాషలో "పెర్గి" (వెళ్ళు) ఈ రకంగా మారదు.

"డియా పెర్గి సెమలం" : అతడు వెళ్ళెను నిన్న.

"నిన్న" ఉండడం వల్ల "పెర్గి" అంటే వెళ్ళెను అనే అర్థాన్ని ఇస్తున్నది.

కర్త ఏకవచనమైనా, బహువచనమైనా క్రియాపదం మారదు.

అతడు వెళ్ళెను ➔ డియా పెర్గి
వారు వెళ్ళిరి ➔ మెరెకా పెర్గి

"డియా" అను శబ్దాన్ని అతడు, ఆమె, అది, అనే మూడు లింగార్థములలో వాడ వచ్చును. సందర్భమునుబట్టి అర్థం చేసుకోవలెను.

## మలే భాషలో ఇంగ్లీషుమాటల గుణింతాలు

మలే భాషకు రోమన్ (రూమి) లిపి బహుళంగా వాడడమే గాక ఆ భాషలో విరివిగా వాడుకలో ఉన్న ఆంగ్ల పదాల గుణితాలను ఉచ్చారణను బట్టి మార్చి వేశారు. బ్రిటిషువారి ఆంగ్ల గుణితానికి, అమెరికావారి ఆంగ్ల గుణితానికి కొంత తేడా ఉన్నది. ఉదాహరణకు అమెరికన్లు Color అని వ్రాస్తే ఆంగ్లేయులు Colour వ్రాస్తారు. అలాగే అమెరికన్లు Center అని స్పెల్‌చేస్తే

ఇంగ్లీషువారు Centre అని వ్రాస్తారు. అమెరికన్లు Programను ఆంగ్లేయులి Programme గా వ్రాస్తారు.

కాని మలేవారు స్పెల్లింగులో చాలా మార్పులు చేశారు. స్కూలును Sekolah అని వ్రాస్తారు. బస్సును Bas (బాస్) అని వ్రాస్తారు, ఉచ్చరిస్తారు. టెక్నాలజీని Teknoloji అని స్పెల్ చేస్తారు. వారు వ్రాసే Institut లో ఆఖరున E వుండదు. Film ను Filem అని వ్రాస్తారు. స్పెల్లింగు విషయంలో ఉచ్చారణయే వారికి ఆధారం. వీరి ఉచ్చారణ రీతినిబట్టి గుణితం ఉంటుంది.

## సాహిత్యాభివృద్ధి

బహాసా మలేషియాలో ఆధునిక సాహిత్యాన్ని అభివృద్ధి చేయ డానికి గాను అక్కడి భాషా, సాహిత్య సంస్థయైన "దెవాన్ బహాసా దాన్ పుస్తక" ప్రయత్నిస్తున్నది. భాషా విషయంలో పరిశోధన సాగుతున్నది. మలే భాషలోని రచనలను ఆంగ్లములోనికీ, ఆంగ్ల భాషలోని రచనలను మలే భాషలోకి అనువదిస్తున్నారు. కవితలు, నవలలు, కథానికలు, నాటికలు మరి ఇతర గ్రంథాలు సంపుటాలుగా వెలువడుతున్నవి. పిల్లలకోసం కథల సంపుటాలు మలే భాషలో ప్రచురించారు. జానవ కథాసంపుటులు వెలువడినవి.

## మాసపత్రికలు

దెవాన్ బహాసా, దెవాన్ మస్యరకత్, దెవాన్ శాస్త్ర (ఇది సైన్సు మాసిక) దెవాన్ పెలజర్, మలేషియాలోని ప్రముఖ మాస పత్రికలు. వీటిలో పరిశోధన వ్యాసములు చాలా ప్రచురించబడు తున్నాయి. విదేశీ సంస్థలుకూడా ఈ పత్రికలకు పరిశోధన వ్యాసాలు పంపుతుంటాయి.

## అనువాద పథకం

మలే భాషా కథలను ఆంగ్లంలోకి అనువదించడం వీరి ముఖ్యోద్దేశం. అట్లాగే ఆస్ట్రేలియా దేశపు పిల్లల కథలను బహాసా మలేషియాలోకి అనువదించటంకూడా జరుగుతున్నది. ఆస్ట్రేలియన్ హై కమిషన్, మలే సాహిత్య సంస్థ సహకారంలో ఆంగ్లంలో నుండి మలే భాషలోకి, మలే నుండి ఆంగ్లంలోనికి అనువాద పథకం సాగిస్తున్నది.

మలేషియన్ రచయితల సంగ్రహజీవిత చరిత్ర ఇటీవలే వెలు వడింది. ప్రధాన మంత్రి ఏటేటా ఉత్తమ రచనను ఎన్నిక చేసి బహుమతులు ఇస్తున్నారు.

వారానికొకసారి 15 నిమిషాలపాటు భాషా, సాహిత్యాలమీద చర్చ "దివాన్ బహాసా ది రేడియో" అనే పేరిట రేడియో మలేషియా నుంచి ప్రసారమవుతున్నది.

మైక్రోఫిలింమీద, టేపులమీద వ్రాత ప్రతులు, ఇతర రచ నలు పరిశోధనకు లభ్యమవుతున్నవి.

## నాటకాలు

ఉత్తమ నాటకం, అది రంగస్థల నాటకం కానివ్వండి, టి. వి. నాటకం కానివ్వండి ఏటేటా బహుమతి పొందుతుంది. ఆ బహుమతిని "శ్రీ పంగుంగ్" అని పిలుస్తారు. "పంగుంగ్" అనగా రంగస్థలం.

"పెంటారమా" పేరిట రంగస్థల ప్రదర్శనలు జరు గుతూ వుంటాయి.

మలేషియా ద్వీపకల్పంలో మలే భాషా పత్రికలు ఆరు ఉన్నవి. వీటిలో నాలుగు (రుమి) రోమన్ లిపిలోను, రెండు (జావి) అరబ్బీ లిపిలోను వెలువడతాయి. ఎనిమిది ఆంగ్లపత్రికలు, పది చైనా భాషాపత్రికలు, మూడు తమిళ పత్రికలు, "తెలుగుతల్లి" అనే ఒక తెలుగు మాసపత్రిక, రెండు పంజాబీ పత్రికలు వెలువడుతున్నవి. అన్ని జాతులవారూ మలే భాష నేరుస్తున్నారు.

మలేషియా రాష్ట్రాలైన సారవాక్, సాబా—ద్వీపకల్పానికి దూరంగా వుంటాయి. అక్కడ కూడా స్థానిక పత్రికలున్నాయి.

టెలివిషన్‌మీద జావి (అరబ్బీ) లిపి పాఠాలునేర్పే కార్య క్రమం వుంది. వివిధ భాషల చిత్రాలను మలే భాషలోకి డబ్‌చేసి గాని, లేదా బహాసా మలేషియా సబ్—టైటిల్సుతో గాని వారం వారం ప్రదర్శిస్తారు.

ప్రభుత్వంవారు "మలేషియారమా" పేరిట 10 నిమిషాల సమాచార చిత్రాలను మలే భాషలో నిర్మించి ప్రదర్శిస్తున్నారు. మలే భాషలో సంస్కృత, ఆంగ్ల, అరబ్బీ మొదలైన భాషల పదాలు ప్రవేశించినా ఆ భాషా ప్రత్యేకత ఆ భాషకే వుంది. తత్సమ, తద్భవాలు మనకు పోల్చుకోడానికి దగ్గరగా వుంటాయి. కాని దేశ్యా లను మనం బొత్తిగా పోల్చుకోలేము. గజ (తత్సమం) కెసుంబ (తద్భవం—కుసుంభ) కెరుమున్ (దేశ్యము—గుంపు). ఇక మలే వాక్యాలు వింటే అరబ్బీ, సంస్కృత, ఆంగ్లచ్ఛాయలే కనపడవు :

ఉదా:—'నీ దగ్గర యేముంది అనడానికి "అవాక్ అద అప" అంటారు.

కూర్చో—దుదుక్

కూర్చోవద్దు—జంగన్ దుదుక్

నేనేం చేస్తున్నాను?—అప సాయా బు అట్

నీవు నవ్వుతున్నావు—అవాక్ కెటవా

నేను నవ్వుతున్నానా?—సాయా కెటవకహ్

ఈ వాక్యాలు వింటూవుంటే నామవాచకాలు, క్రియాపదాలు అన్నీ పూర్తిగా దేశ్యాలనిపిస్తాయి.

మలే భాషా దేశ్య స్వరూపం బాగా అవగాహన కావాలంటే కొన్ని క్రియా పదాలను గమనిస్తే చాలును.

ఇచ్చుట — మెంబెరికన్
సహాయపడుట — మెంబంటు
పరచుట — మెంబెంటాంగ్
కొనుట — మెంబెలి
తెచ్చుట — మెంబవా
నిద్రించుట — తిదుర్
నిలుచుట — తింగ్గల్
తెలిసికొనుట — కెనల్
నవ్వుట — కెటవా

ఇందులోనూ వ్యావహారిక స్వరూపాలు వేరు.

'ఇటు' (అది) గ్రాంధిక రూపం. వ్యావహారికంలో 'టు' అంటారు. అలాగే 'ఇని' (ఇది) గ్రాంధికరూపం. వ్యావహారికంలో 'ని' అవుతుంది. మలేలో వంగభాషలోవలెనే వ కారాది శబ్దాలు బకారాదులవుతాయి.

ఉదా : వాయు : బాయు
వార్త : బెరిత
వంశ : బంగ్స (దేశం అనే అర్థంలో)
వంశి : బంగ్సి (వేణువు అనే అర్థంలోనే)

రూమి (రోమన్) లిపిలో మలే పదాలు సరియైన ఉచ్చారణను సూచించజాలవు. ఉదా : Datang అనే పదం (స్వాగతం అనే అర్థంలో) సరిగా ఉచ్చరించడానికి రోమన్ లిపి చాలదు. దతాంగ్, దాతంగ్ అని ఉచ్చరించే ప్రమాదం వుంది. నిజానికి దాని సరియైన ఉచ్చారణ "దాతాంగ్." మలే భాష తెలిసినవారు సరిగా ఉచ్చరించగలరు. తెలియనివారు 'రూమి' లిపితో చదివినప్పుడు ఉచ్చారణ లోపాలు వస్తాయి. అయితే 'జావీ' లిపి నేర్చుకుని మలే భాష పఠిస్తే ఉచ్చారణ లోపాలుండవు. జావీ లిపి ఇంకా బాగా ప్రాచుర్యంలోకి రాలేదు.

ఆటవికభాష అనదగిన మలే భాషను అతి నాగరిక భాషగా మార్చిన మలేషియనులు అభినందనీయులు.

బహాసా జీవా బంగ్సా
(జాతికి జీవం భాష)

# యుగస్థల

## శ్రీ జంధ్యాల బాలగంగాధర తిలక్

మేక్బత్ తన రక్తసిక్త హస్తాలను
సప్త సాగరాలలో
ఇంకా ప్రక్షాళనం చేస్తూనే ఉన్నాడు

చుట్టూరా ఆవరించుకొని ఉన్న
దుర్గంధాన్ని పారద్రోలాలని
కస్తూరీ — కర్పూరాలు
అత్తరులు — అగరొత్తులతో నరుడు
ఇంకా ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు

సైరంధ్రీ వస్త్రాపహరణ చేస్తున్న
దుశ్శాసనునకు ఇంకా అలుపు—సొలుపు రాలేదు

ల్యూక్రిసు శీలాపహరణ నిమిత్తం
టార్క్విన్ నెమ్మదిగా
ఇంకా నడుస్తూనే ఉన్నాడు

పౌను మాంసం కోసం షైలాక్
బాకుకు పదును ఇంకా పెడుతూనే ఉన్నాడు

గాడ్సే రైఫిల్ కోసం
అహమ్మదాబాద్—పూనాలు
ఇంకా తిరుగుతూనే ఉన్నాడు

డెస్ డెమోనా ఒథెల్లో కేష్యోల
మధ్యగల బంధాన్ని
ఇయాగో ఇంకా హత్య చేస్తూనే ఉన్నాడు

యుగ యుగాల నుండి పరిశోధిస్తున్న
డాక్టర్ జెకిల్ మిస్టర్ హైడ్‌ను
ఇంకా వదలించుకొనలేక పోతున్నాడు

# వైరభక్తి

## 'జమదగ్ని'

(గతసంచిక తరువాయి)

## షష్ఠాశ్వాసము

౬

పంచ ప్రాణములైన పాండవుల సర్వస్వమ్ము, తత్ప్రాణభృత్
పాంచాలీ పరమానురాగ భర సౌభాగ్యంబు, ధర్మైక ని
ష్ఠాంచద్విశ్వ శుభంకరంబయిన కృష్ణాఖ్యబ్రహ్మ మాలంబమై
మించెన్ ధర్మజ రాజసూయ మఖ మా మీఁదన్ మఱొండే దినాన్॥

'సమ్మదమంది చూచితి భృశమ్ముగ భూ జను లెల్ల బ్రహ్మ తే
జమ్మును రాజతేజమును సద్బహు భూషణ రత్నరాజి తే
జమ్మును విస్తరించుచు నిజద్యుతి యొప్పగ మూర్తమైన ధ
ర్మమ్మును బోలెనున్న గుణమండితు దీక్షితు ధర్మనందనున్'॥

దిక్పాలాదిక సత్ప్రభాధిక మహా తేజమ్ముతోఁ జంద్రమౌ
రు క్పూర్ణంబయి దివ్యమౌ మయసభన్ రోచిష్ణుఁడౌ ధర్మజున్
దృక్పర్వంబుగఁ జూచి ధన్యతమ బుద్ధిన్ సర్వు లత్యంత స
మ్యక్పూజన్ జరితార్థతన్ గనిరి జన్మంబుల్ పవిత్రమ్ములై॥

ఇంద్రప్రస్థ పురస్థమై సకల భూమీంద్రాళియున్, భూమి దే
వేంద్రౌఘమ్మును, వైశ్యశూద్ర జన రత్నేభ్య ప్రపంచమ్ము, నాఁ
డింద్రావాసమునందు నున్నటులె భూయిష్ఠార్చన ప్రాప్తమౌ
సాంద్రానందమునందె ధర్మజ మహాసత్రాత్మ్వ మగ్గించుచున్॥

ఆ మఖవైభవంబుగని యచ్చెరువం దని వారు, పాండవ
గ్రామణి యాజ్ఞ నర్చితులు గా ముదమందని వారు, ధర్మ ని
ష్ఠా మహనీయు ధర్మజుని సన్నుతిసేయని వారు, భక్తిమై
తాముగ శ్రేష్ఠ వస్తు సముదాయ మొసంగని వారు లేరటన్॥

కౌరవ యాదవాన్వయులె కారు, భువింగల క్షత్త్రవంశ భూ
దారులు సర్వులున్, ప్రభుత దాల్చిన ధర్మజుమెచ్చి గొల్చి, య
వ్వీరున కర్పితంబులుగ విస్తృత సంపద లిచ్చి, భక్త మం
దారుని కృష్ణుగాంచి, తమ తత్పరతన్ వెలయించి రచ్చటన్॥

తొలి దెస జైత్రయాత్రకని ధూర్వహుఁడౌ పవనాత్మజుండురాఁ,
బిలిచి సమాదరంబునకు పీటను గొన్ని దినంబు లుంచి, య
త్యలఘు సమర్చనంబుల మహాత్ముని తృప్తునొనర్చి, ధర్మ రా
జుల కని భక్తినిచ్చెఁ బలు సొమ్ములు చోద్యముగాగ చైద్యుఁడున్॥

అతఁడభిషిక్తుఁడైన మహితాత్ముని ధర్మజుగాంచి మస్తక
స్థిత మకుటంబు తీసి నత శీర్షత మ్రొక్కి తనంతభక్తిమై
నుతు లొనరించె, నిచ్చెను వినూతన భూషణ రత్నరాజి, స్వః
పతి యన గౌరవించెను సభాసదు లెల్లరు సంతసింపఁగన్॥

అందఱు మోదమందు నద నయ్యదిగాంచి పితామహుండు, సా
నంద మనస్కుఁడౌచు, యమనందను మోమున దృష్టినిల్పి, స
ల్పందగు నాయనా యిపుడు ప్రాజ్య సమర్చన, మిద్ది సేయుగా
వందిత సర్వలోకుఁడ వవశ్యము పొందెదు యజ్ఞ పూర్ణతన్॥

స్నాతక ఋత్విజుల్ సఖుఁడు సద్గురుఁడున్ మహనీయ వీరుఁడున్
భూతల నాథుఁడున్ మిగుల పూజ్యులు, వీరలలో గుణాధికుం
డై తగు వాని నెన్ని సభయందు సమర్చన సేయు టొప్పు, నీ
వీ తఱి నర్ఘ్య మిమ్ము సకలేప్సిత సిద్ధి లభించు దానిచే॥

అని కురు వృద్ధుఁడాడ, వినయమ్మున ధర్మజుఁ, డో మహాత్మ ! నీ
వనితర సాధ్య ధర్మ మహిమాతిశయుండవు, నిన్ను మించి యీ
జనతతి ధర్మసూక్ష్మముల జ్ఞానము కల్గిన వారు లేరు, నీ
వను మితఁ డర్హుఁడంచుఁ బ్రథమార్ఘ్యము నాతనికిచ్చి కొల్చెదన్॥

ఆ పలు కాలకించి వినయాన్వితు ధర్మజు మెచ్చి భీష్ముఁ డు
ద్దీపిత మానసుం డగుచుఁ దేర్చి వచించెను సర్వ సభ్యు ల
ద్దా! పరిపక్వ బుద్ధి ! పరమార్థ మెఱుంగగ నీవె నేర్తు వీ
రూపమునన్ యథార్థము నిరూపితమయ్యె నటంచు మెచ్చగన్॥

నీలాంబుదాకాశ నిభమైన మైచాయ
నేత్రమ్ములను దీప్తి నింపు వాఁడు
చిఱునవ్వు వెన్నెలల్ విరియు మోమున సర్వ
హృదయ వార్ధులను పొంగించువాఁడు
నరదేహ ధారియై నడయాడి మనతోడ
నిల నెట్లు మనుటయో తెలుపువాఁడు
పలుకు పల్కున తత్త్వ పరిమళమ్మొలికించు
సర్వజ్ఞమూర్తియై సాగు వాఁడు

సంస్మరించిన మాత్ర వాత్సల్య మొప్ప
ప్రతి పదంబునఁ బడనీక పట్టువాఁడు
మధుర మధురానుభావ సంపదలవాఁడు
ద్వారకావాసి సర్వ నిస్తారకుండు॥

చెఱసాలఁబుట్టి చెచ్చెర జన్మ బంధమ్ము
లూడ్చు తమోహరుం డూర్జితుండు

పాలు త్రావెడి పూప వయసున పూతనా
ప్రాణ హరణ కేళిఁ బరగు వాఁడు
వెల్లకిలంబండి పిల్ల చేష్టలతోనె
బండి రక్కసు గుండె పిండువాఁడు
గోవర్ధనం బెత్తి గో గోపికా రక్ష
నేఁదేండ్ల కింద్రు నాడించు వాఁడు
నలువ హరియింప సర్వ వత్సలును ధేను
వులును గోపకుల్ తానుగాఁ బలు తనువులు
తాల్చి సర్వులు చూచి యథాస్థితి యన
బమ్మ దిమ్మెర వోవగాఁ గ్రమ్మువాఁడు ॥

సకలారాధ్యుఁడు, సర్వరక్షకుఁడు, దుష్టప్రాణి హింసా వినా
శక రుద్రాకృతి, వేదవేద్యుఁడయి సాక్షాత్కార ధన్యత్వ మీ
నకలంకంబగు యాదవాన్వయమునం దావిర్భవంబైన తా
రకుఁడౌ కృష్ణుఁడు కాక యర్ఘ్యమున కర్హుండైన వాఁడుండునే !

అనుచున్ భీష్ముఁడు పల్కుచుండ, సహదేవానీత దివ్యార్ఘ్య వ
స్తుని కాయంబున, ధర్మజుండతని పూజ్యున్ భక్తి నర్చించెఁ, ద
ద్ఘన పూజన్ గను సర్వ మానవులు మోదంబంద, దివ్యాంత రి
క్ష నివాసుల్ సుమవర్షమున్ గురిసి హర్షంబున్ బ్రదర్శింపఁగన్ ॥

తన ప్రోలన్ దన వైరి యిట్టు లధికస్థానస్థుఁడై యగ్ర పూ
జను పొందన్, జనవత్రయాఖ్యసన దోషజ్ఞ ప్రభావంబుచేఁ
గినుకన్ దాల్చిన చైద్యుఁ, డగ్నివలె, నక్షిద్వంద్వ మారక్తమై
కణముల్ చిందగ లేచి, మండి పడుచున్ గంపించు గాత్రమ్ముతో॥

అవమానింతువె మమ్ము నీ పగిది ధర్మాపేత ! జన్మాదిగా
నవి నీతింబడి, వంచకుం డగుచు, మాయల్ పన్నుచున్, జెప్ప రా
నివి దుష్కర్మ లనేకముల్ సలిపి, దుర్నీతిన్ ప్రధానుండు గా
వివిధోర్వీజన నిందితుండయిన నచ్యుతున్ సమర్చించుచున్ ॥

ముది మది తప్పి, వీఁడొకఁడె పూజ్యుఁడు నీ కని, వంశనాశకో
న్మదుఁడగు భీష్ముఁ, డజ్ఞుఁడయి మాటను జార్చిన యంతమాత్ర, నీ
మదిని వివేకమున్ గనక, మాన్యుఁ డటంచును పూజ చేసెదే
గుదిగొని కాంతలన్ గదియు కూళను, సిగ్గిడి, వెఱ్ఱిగొల్లనిన్ ॥

పూజ్యుల లోన నెవ్వఁడని పూజ యొనర్చితి వీ దురాత్ము నీ
రాజ్యుని, నిర్గుణున్, నిఖిల రాజ విగర్హితు, లోక కంటకున్;
ప్రాజ్య గుణుల్ మహా మహులు వహ్నులఁబోలె వెలుంగుచుండ నీ
వాజ్యము గొంచుఁబోయి యణగారిన బూడిదఁ బోయుటయ్యెఁ బో!

ఇట్టుఁడటన్న బుద్ధి వహియించితి వన్నను, నీదుసొమ్ము నీ
యిష్టము వచ్చినంత కొన నిమ్ము; సభాస్థలి పెద్దలుండగా
గష్ట చరిత్రుఁ బూజ్యుఁడని గారవముం బొనరించి తెట్టు? లీ
దుష్కృత సైచు టెట్లు? సుదతుల్ బలెఁ జూచుచు
శూరులందరున్॥

కారాబద్ధుల దుష్టకామ ఫలమై కల్గెన్ బ్రణష్టాత్ముఁ, డా
ప్రారబ్ధంబున గామ రాక్షసుఁడు వీఁడయ్యెన్ జగద్ద్రోహి, యీ
చోరున్ జారుని పూజ నిల్పగల యిచ్చో నిల్వఁబోనింక, నా
తో రం డుత్తమ వంశజాతులని తోడ్తోఁబోవ నుంకించుచో॥

పురుషోత్తముని కార్యజాతములు తప్పుల్గాఁ దలంపూని, వై
ఖరికిం దెచ్చుట కాత్మలో జడిసి చిక్కంబట్టి కొన్వారు కొం
దఱు తన్మూర్ఖుని వెంటఁబోయెడి ప్రయత్నం బందునుండంగ, ని
ర్భరుఁడై ధర్మజుఁ, డా తనిం దరిసి, వాక్పారుష్య మిట్లొప్పునే?
ఎవ్వరికంటె భీష్ముఁడతి వృద్ధుఁడు జ్ఞానమునందుఁ, దాతతోఁ
జవ్వకు నేటికిన్ నిలువఁ జెల్లదు నీకును నాకు, బుద్ధికిన్
దవ్వగునే యతండు? బహుధర్మ విధిజ్ఞుఁడు మర్మవేత్తయై
యివ్విధి నిర్ణయింప, నిది యొగ్గని యెంచుట పాడియౌనొకో!
జీవితమెల్ల కాలమును చేసిన చింతనకున్ ఫలంబుగా
లో వివరం బెఱింగి, యెదలోఁ గడు లోతుగ త్రవ్వి త్రవ్వి మే
ధావి వచించె నిశ్చయము, దానిని తప్పని చెప్ప టంతయున్
నీ విపరీతతన్ దెలుపు, నీవు నెఱుంగవొ తన్మహత్త్వమున్॥

బాలుఁడ వీవు కావు శిశుపాల! మహత్త్వ మెఱుంగఁగల్గు భూ
పాలుఁడ, వింతమంది నర పాలురు, భీష్ముఁడొనర్చు నిర్ణయం
బేల మహోన్నతం బనుచు నెంచి నరోత్తము పూజ మెచ్చి, రీ
వేల వృధా విరోధమున నిట్టు లవాచ్యము లాడె దింతకున్!
నోటికి వచ్చినట్లనిన నొవ్వగు నంతియ, యంతకాక య
మ్మాటకు నెన్నఁడైన నొక మాన్యత కల్గునె? నీ వెఱుంగు దీ
చోట గలట్టి రాజు లరిసూదనుఁడౌ యదువీరుఁ దత్ప్రభా
పాటవ కృష్టులై మదుల వానిఁ దలంతురు దైవ మన్నటుల్॥

పావని వచ్చినప్పు డతి భక్తి సమర్చన చేసి, మన్మఖ
శ్రీ విభవంబు హెచ్చునటు చిత్త మెలర్పగ నెన్నొ కానుకల్
నీ వయి పంపి, వచ్చి యిట, నీవు విచిత్రముగాగ మాఱి, యా
శ్రీవిభునాడి పోసెదవు, చెల్లునె నీ కిది నీవు నీవయై॥

ఏ విధి నెన్నినన్ యదు కువేంద్రుఁడు తన్ను స్మరించు వారలన్
దేవునివోలెఁ గాచునని దివ్యగుణాకరుఁ డిట్టులేల? సం
భావన సేయు మాతనిని భక్తి పురస్సర చిత్త వృత్తి మై,
శేవధి యాతఁడీ జగతి జీవుల కెల్లర కాత్మరూపుఁడై॥

మెత్తని మందలింపులను మెల్లగ దువ్వుచు ధర్మనందనుం
డత్తఱి వాని చిత్తము రహస్య మెఱింగిన వానివోలె దు
ర్వృత్తిని మాన్పఁజూచునెడ, వీరుఁడు చైద్యుఁడు కంటగించుచున్
బొత్తిగఁ బట్టనట్లె విడుపుంగని పోవగ నెంచు చుండగన్॥

భీముఁడు కోపమూని తన భీకర మా ముఖ మందు భ్రూకుటిన్
భీమముగా నొనర్చి యదవీయసు వానిని బట్టి యప్పుడే
భూమి నడంగఁజేయు నను పొల్పున తోపగ నెల్ల రాజు లు
ద్దామ భయంబునంది తమ తావుల నుండిరి ఱాతిబొమ్మలై॥

చైద్యుఁడు మాత్ర మట్టియెడ సౌమ్యత నూనక చేయి లాగి కొం
చుద్యతుఁడయ్యెఁ బోవుటకు, నూపున కించుక సంచలించి య
య్యాద్య పృథాతనూజుఁడవురా యిది యేమని వెల్లబాటుతోఁ
జోద్యముగాగ నిల్చె మనసున్ దనువున్ గదలాడ నట్టిఁడై॥

దిగ్గన లేచి నిల్చి సహదేవుఁడు 'దేవుఁడు కృష్ణుఁడంచు మే
మొగ్గిన యర్ఘ్య మొప్పని మదోద్ధతు నెత్తిన కాలు వెట్టి నే
నిగ్గఁ జేసెదన్ కనుఁడు, హీనుఁ డిటుల్ పదిమంది యున్నచో
సిగ్గరి యెగ్గటంచనక శ్రీపతిపైఁ గనలూని ప్రేలునే!'

అని యనుకోని చందమున నాగ్రహ మూనుచు కాలు నెత్తినన్
గణకణలాడు కన్నుగవఁ గాంచిన చైద్యుఁడు రెచ్చిపోయి, 'నీ
వును, మఱి నీదు నన్నలు, మహోత్తమ పూజను పొందు గొల్లఁడున్,
బనివడి యిట్టి వెఱ్ఱిపని పంచిన జాల్ముఁడు, రండు నాపయిన్॥

అని మొన నిల్చి యెవ్వ రధికాధికు లౌదురొ తేల్చుకొంద మీ
తనువునఁ బ్రాణముండగ, యథాస్థితి నుండక ప్రచ్యుత స్థితిన్
గని, నను పెండ్లియాడ నగు కన్యను దొంగిలి పోవు దుర్మదున్
వినుతి యొనర్తునే? తనువు వీడుటకైనను సిద్ధమయ్యెదన్॥

తల్లియై చనుబాలు త్రావనిచ్చిన పూత
నన్ మడియించు స్త్ర్యంతకుఁడు వీఁడు
తన తల్లితోఁ బుట్టి తనకుఁ బూజ్యుండైన
మాతులున్ఁ జంపు దుర్మదుఁడు వీఁడు
చెఱసాలలోఁ బుట్టి చెఱబెట్టి వేలాది
ముగుదలన్ గవియు కాముకుఁడువీఁడు
పెరవాఁడు తనవాఁడు భేదంబు కనఁబోక
మందుచున్ జంపు క్రూరుండు వీఁడు
బండి విఱుగ దన్ని ఒక ధేనులన్ జంపి
కొండ గొడుగు నెత్తి కొన్ని మాయ
పనులు చేసినంత బలవంతుఁడౌనొకో
చైద్యుఁడంత చచ్చు జనుఁడు కాఁడు॥

అంతటి దాక నోపికగ నన్నియు వించును చూచుచున్నదై
త్యాంతకుఁ డంతలేచి సభనంతటఁ జూచుచు నెట్టి సవ్వడిన్
సుంతయుఁ దోపనీక వినుచున్ గను లర్పణచేసి సర్వులున్
శాంత మహస్కమైన తన సర్వ మనోహర గాత్రముంగనన్॥

బావ యితండు నాకుఁ, బసివాఁడుగ నున్నపు డెత్తికొంటి వా
పోవుచు మేనయత్త కడుపుంబడి పుట్టి చతుర్భుజంబులై
యేవగ పెచ్చు కన్నుగల యీతని చేతికి నంది యీయ, నా
దైవ మహత్త్వమేమొ, యవి తామె యడంగెను సుందరుండుగాన్॥

అప్పుడు మేనయత్త యివి యన్న! కరంబులు కావు పాదముల్
తప్పడు బిడ్డ వీని గని తల్లడ మందెడి వేళ మిన్ను తా
నొప్పగఁ బల్కె నిట్లు బలియుండగు వీనికిఁ బెచ్చుచేతులున్
విప్పగు మీది కన్ను కనిపించక పోఁగల వొక్కఁడెత్తికోన్॥

వాఁడే వీనికి మృత్యు వౌ ననుచుఁ జెప్పన్ వీని జన్మాదిగా
వాఁడున్ నీఁడని యెంచ కందఱకు నీ బాలున్ భయంబందు, చే
వాఁడెత్తన్ మటుమాయమౌనొయని తప్పంబోక యందిచ్చుచో
నేఁడీ వెత్తికొనంగ మాయమయి తండ్రీ! తేలె మర్మంబిటుల్॥

వీఁడతి దుష్టుఁడౌననుచు విన్నది కన్నది తెల్పుచుండె, ని
వ్వాఁడు పొనర్చు ద్రోహములు బంధుత నెంచక నీకు నెన్నియో,
కీడు తలంపఁబోక బ్రతికించుము వీనిని కొన్ని నాళ్ళు, నిన్
వేడుచునుంటి తల్లినయి, వేచుము నూఱును నిండు నంతకున్॥

అత్త కుమారు ప్రాణముల కంతగ నేడ్చుచు వేడుకొన్నచోఁ
జిత్త మదెట్లు కాదనును చెమ్మగిలం గను మాట యిచ్చి యా
యత్తను బట్టి వీని కభయంబిడి సైచితి నిన్నినాళ్ళు నేఁ
డిత్తఱి నందఱుం గనగ నీతఁడు నింపెను నూఱు ద్రోహముల్॥

ఇంకను సైతునే? యనుచు నీశ్వరుఁడౌ యదునందనుండు బల్
కింకను చూడఁ, జైద్యుఁ డరికిన్ మునుముందుగఁబోయి నిల్చి తా
బింకముతోడఁ గృష్ణుపయి బిట్టుగ దూకు ప్రయత్నమన్నటుల్
జంకు దొలంగి బాహువులు చాచుచు ముడ్చుచు జబ్బ కొట్టుచున్॥

ఏ మగునో యటంచు తనునెల్లరు హెచ్చగు జాగరూకతన్
తామయి సాయుధుల్ దుమికి తన్ను వధింపగఁ జూచుచుండ న
ద్దా! మహనీయ దీక్ష మెయినాతఁడు మల్లునిబోలె కాళ్లతో
సా మొనరించి కూర్చొనుచు సాచి ముడుంగగఁజేసి నిల్చుచున్॥

'అవురా! నీ కృప నీదు కిన్క నొకఁడేలా కోర భీనంద? నే
నవుదున్ జైద్యుఁడ నన్ను చూడుమిఁక కృష్ణా!' యన్న యామాట త
ద్వివృతాస్యంబుననుండి వెల్వడిన దంతే, యంతలోఁ గృష్ణ మా
ధవ నిర్ముక్త సుదర్శనాయుధ హతిన్ దచ్ఛీర్ష ముర్విం బడెన్॥

కృష్ణా! యన్న పదమ్ము నోట ననుచోఁ గృత్తంబుగా నోట రో
చిష్ణు ప్రాంశు తదీయ దేహ జనితార్చి ష్మన్మహా తేజ మా
జిష్ణున్ విష్ణుని నేత్రకాంతులను జొచ్చెన్ సర్వులుం జూడ, వ
ర్ధిష్ణుం డాతని కింక జన్మ మది వేరే యుండునా లీనమై॥

సకిరీటంబు సకుండలం బయిన తచ్ఛేద్యోత్తమాంగంబు శి
ల్పి కృతంబౌ జతుకాష్ఠ విగ్రహముబోలెన్ జీవసౌభాగ్య మిం
చుకయైనం దఱుఁగంగఁబోక కనులచ్చో లక్ష్యమౌ కృష్ణుఁబా
యక చూచుం బలె నిల్చె, నందఱు నహో యంచున్ బ్రశంసింపఁగన్॥

వైరము వైరమే పయికి, భక్తి సమగ్రములోన, గావునన్
జేరెను జీవతేజమది శ్రీపతి తేజము, చైద్యుఁడెంతొ దీ
క్షా రమణీయ వర్తనుఁడు? చచ్చు క్షణంబున నొక్కమారు నో
రారగ దైవనామ మనె, నంతటితో హతమయ్యె వేదనల్॥

బ్రదికిన యన్నినాళ్లును బద్ధవిరోధముతో నెపైనఁ జం
పెదనని తీవ్రుఁడై మెలఁగి వచ్చిన యంతటఁ జచ్చువానికై
కదలిన గుండియన్ గరుణ కాల్వలు గట్టగ నేడ్చువారి నీ
బ్రదుకులఁ జూచుచుందు మపురా యిది యెంత విచిత్రలీలయో!

స్వామిని చంపుదేననుచుఁ జచ్చెడి దాకను పంతమూని యా
స్వామి పవిత్ర చక్రహతి చైద్యుఁడు చచ్చిన యంత స్వామికిన్
బ్రామిన దుఃఖపుం గుబులు పట్టగరానిది వాని దేహమా
స్వామి కృపా విశేషమున సంస్కృతి నందుట వాని పుణ్యమౌ॥

తల మొండెంబునఁ జేర్చి కూర్చినపుడా దైత్య స్వరూపంబు ది
వ్యులకున్ దర్శనయోగ్యమౌచు నెదలం దుద్వేగముం గూర్చె స
ర్వులు నవ్వాని యెడన్ ద్రవించిరి రసార్ద్రుల్ సర్వసత్కార ము
జ్జ్వలులై చేసిరి యజ్ఞవైభవము సర్వంబాతఁడందెన్ దుదిన్॥

సురభిళ చందనా వనిజ శుష్క విఖండిత కాష్ఠ సంచయం
బరుదుగఁ బేర్చినట్టి చితియందు స్వయంబుగ వీరభీమ సుం
దర సహదేవు లిర్వురును దద్వర దేహము తెచ్చిపెట్ట ని
ర్భర కరుణా మయుండయిన స్వామియె దానికిఁ జిచ్చుపెట్టెనన్॥

పరితో జ్వాలల మండుచున్న చితిపై పంచాగ్ని మధ్యోగ్ర దు
ర్భర దీర్ఘోరు తపస్వివోలె శయనింపన్ జైద్యుదేహంబు సం
స్కరణం బందెడివేళఁ బుట్టిన ధ్వనుల్ స్వస్వామి నామస్మృతి
స్ఫురణంబున్ గరిగించె సౌరభము యుప్పొంగన్ బ్రపంచంబునన్॥

హరి నరియంచు గొల్చుటయు నా హరిఁజేర్చును, తథ్యమిద్ది, యు
ర్వర నరజన్మమంది కనవచ్చు జగంబిది సత్యమంచుఁ ద
త్పరతఁ జపించుచున్ బ్రదుకు పట్టున పెక్కులు బాధలందుచున్
జిరచిరలాడుచున్ బ్రదికి చెందిన మృత్యువు, జన్మ వ్యర్థమౌ॥

హరి యొకఁడే కలం, డతఁడె యద్వయుఁడయ్యును స్వీయమాయచే
బరగును విశ్వమై, కనగ వచ్చు సమస్తము నాతఁడయ్యు నే
కరణము లంది వానిబడి కానక యా హరిఁ, గాంతు విశ్వమున్,
హరి హరి నేనునున్ హరినె యన్న మరేమియు లేక హాయియౌ॥

హరియును నేను నుంటిమని, యా హరి నందుటె లక్ష్యమంచుఁ ద
ద్వర పదయుగ్మభక్తి మెయి వాని భజించుటె కృత్యమంచు, నా
హరి నెటులైన దైవమని యమ్మని నాన్నని పుత్త్ర మిత్ర బం
ధురి బహురూప ధారియని ధూర్వహతన్ భజియించి కాంచనా॥

సర్వ రస స్వరూపుఁడయి స్వామి యెసంగుట నీ మనం బెటుల్
పర్వన నల్లె వాని తలఁపన్ బరమార్థము నందవచ్చు నీ
గర్వము వీడి వాని పతిగా సుతుగా ప్రియుగాగ తండ్రిగా
సర్వ మొసంగి ప్రోచు సరస ప్రసవిత్రిగ భక్తి గొల్వుమీ!

రసము లనంతముల్, బ్రదుకు రంజిలు చున్నది వానిబట్టి, యే
రసమయినన్ సరే హరియు రంజిలు తాను రసస్వరూపుఁడై;
రసములఁ గొన్ని స్వాదు మధురమ్ములు, నీ కవి నచ్చలేని యా
రసమొ విరోధమో యెదియొ ప్రాణము పట్టుగ దాల్చి కొల్వుమీ!

హరి యొకఁడున్న వాఁడనుట యర్థము కానిది, వాఁడులేఁడు, నా
కరణము లెవ్వియున్ హరిని కానగఁ జేయుటలేదు, కంటికిన్
దొరకని యా హరిన్ గొలుచుత్రోవ నిరర్థక మందులేని త
త్పరత తలంపు మల్లె హరిఁ దాను కృతార్థునిజేయు నిన్నునున్॥

ఉన్నాఁడంచును వాని యూహ మెఱుఁగకే యుర్విన్ నిమగ్నుండుగా
మన్నె జీవితమిద్దు నాస్తికుఁడు కొంపల్ ముంచు, నవ్వాని కం
టె న్నాస్తిక్యము పేర లేఁడనుచు వానిన్ నిత్య మూహించు వాఁ
డెన్నోరెట్లు మెఱుంగు, సిద్ధుఁడగుఁబో యేనాటికేన్ సత్యమై॥

కలఁడో లేఁడొ యదేల నాకు? కలదీ కన్పించు విశ్వమ్ము, నే
నిలనుంటిన్ గనుగొందు నా తెలివిచే నీ విశ్వ మర్మమ్ము, మి
న్నులపై నేగుదు, వార్ధులన్ దిగుదు, కందున్ భూమిగర్భంబు, త
త్ఫలమై మర్మ మెఱుంగు దే ననుట వ్యర్థం బౌ నహంకారమౌ!

ప్రకృతిని గెల్చు పొంటి పడుపాటు లివన్నియు మోసగించి త
త్ప్రకృతికి వశ్యుఁజేయు నిను, పాయని మోహముగొల్పి, లొంగె నా
కిఁక నని నీవు గర్వమున నేనె యధీశ్వరుఁ డంచునుండఁ,జె
ప్పకయె యడంచుఁ,దప్పదిది, ప్రాకృతుఁడెట్టు లెఱుంగు తత్త్వమున్॥

ప్రకృతి యనంగఁ దామయినవారు మహీజయు రుక్మిచెల్లెలున్,
ప్రకృతి జయింతు మేమనిన వారలె రావణచైద్యు లిర్వురున్,
వికట మతిన్ బ్రవర్తిలుచు విశ్వవిహార మొనర్చిగూడఁ ద
త్ప్రకృతికి వశ్యులై సుడువరాని యవస్థల గ్రుగ్గిరంతియే!

హరి పరమార్థమంచు, నెదయందె యతండు కలండటంచు, బా
హిరమున గోచరింపఁడని, యింద్రియ జేతృతనుంది, యాంతరం
బరసి, హరి స్వరూపులగు నాది మహర్షులె, విశ్వజేతలై
పరగిరి, నేటికిన్ బ్రకృతి పట్టువడున్ హరియైన వ్యక్తికిన్॥

కరణమయంబుగా నయిన కాయమె బంధనమౌచునుండఁ, ద
త్కరణ వినిర్మిత ప్రకృతి కార్య వశంవద చిత్తులౌచు సం
చరణ మొనర్చుటెల్ల మనసా బలహీనత మేటికట్టు లం
దురి బడు టౌను గాక, గెలుపొందుట యెట్లగు జీవకోటికిన్?

బుధవర్యా! రథివీవు, దేహరథమున్ పుష్టేంద్రియాశ్వమ్ములే
విధిగా నీడ్చిన నల్లెపోయి తుది తెల్వేన్ గాంతువో? పార్థసా
రథియౌ బుద్ధి వశంబులై చను హయగ్రామంబు స్వాధీనమౌ
రథ యాత్రన్ సుఖమందెదో? యెఱుఁగవో రారాజువై సృష్టిలో॥

[ అయిపోయింది ]

## శ్రీ కోడూరి శ్రీరామమూర్తి

# స్వాతంత్ర్యానంతర యుగంలో తెలుగు నవల - చైతన్య స్రవంతి

నవలా రచనలో మనస్తత్వ విశ్లేషణకు ప్రాధాన్యత లభించడం యిటీవలి కాలపు పరిణామమనే చెప్పాలి. అంతమాత్రాన— యిదివరకటి కాలంలో వెలువడిన రచనలకు మనుషుల మనస్తత్వానికి ఏ విధమైన సంబంధమూ లేదని అర్థంకాదు. ఏ కాలంలోని రచయిత అయినా—మనుషుల మనస్తత్వాన్ని మరచిపోయి కలం చేత పట్టలేదు. మనుషుల మనస్తత్వానికి విరుద్ధమైన రచనలు చేసిన రచయిత విశ్వకాలీనతను పొందలేదు. యింతవరకూ వాస్తవమే. అయితే—ఈ మనస్తత్వాన్ని స్థూలంగా దృష్టిలో వుంచుకోవడం వేరు. దానిని లోతుకుపోయి పరామర్శించడం వేరు. మనిషిలోని లోలోపలి కోరికలకూ, బాహ్య ప్రవర్తనకూ చాలా తేడా వుండ వచ్చు. వుంటుంది కూడాను. యిట్టి స్థితిలో మనిషిలోని మనిషిని చూడాలంటే రచయితకు ఎక్సురే కళ్లుండాలి. ఈ కళ్లను తను పెట్టుకుని మనకు కూడా యిస్తాడు రచయిత మనస్తత్వ విశ్లేషణ నవలల్లో. అనేక ఆధునిక రచనా ప్రక్రియల్లాగానే ఈ తరహా నవలా రచనా విధానాన్నికూడా మనం పాశ్చాత్యుల దగ్గిర్నించే అరువు తెచ్చుకున్నాం.

ఆంగ్లసాహిత్యంలో మనస్తత్వ విశ్లేషణ నవలలు ఏ విధంగా ఆవిర్భవించాయో తెలుసుకోనిదే మన తెలుగు మనస్తత్వ నవలల వెనుకవున్న కథ మనకు తెలియదు. అయితే—అక్కడవున్న పరిణామక్రమం తెలుగులో మనకు అంతగాలేదు. యింగ్లీషులో మనస్తత్వ నవలలు ఆవిర్భవించిన చాలా కాలానికి ఒక్కసారిగా తెలుగులో మనస్తత్వ విశ్లేషణ ప్రధానంగాగల రచనలు రావడం ప్రారంభించాయి.

మొదటి ప్రపంచ యుద్ధానికిముందు పాశ్చాత్య సాహిత్య రంగంలో విస్తృతంగా ప్రచారంలోవున్న రొమాంటిసిజమ్, నేచురలిజమ్, రియలిజమ్, ఈ తరహా సాహిత్య దృక్పథాల్లో మనస్తత్వ విశ్లేషణకు ఎక్కువ ప్రాధాన్యత లభించలేదు. రొమాంటిసిజమ్ స్థానంలో సాహిత్య ప్రపంచంలో ప్రవేశించిన నేచురలిజమ్, రియలిజమ్, దృక్పథాలు సాహిత్యంలో 'సెంటిమెంటల్' ధోరణికి బదులుగా కార్య కారణ సంబంధ పరిశీలనను, సూక్ష్మాతిసూక్ష్మ వివరాలతో కూడిన బాహ్యాపరిస్థితుల వర్ణనను, పరిశీలించాయిగాని— మనిషి అంతరంగాన్ని స్పర్శించేందుకు పూనుకోలేదు. ఈ పనిని మనస్తత్వ నవలా కారులు చేశారు. వారిలో కొందరు—వర్జీనియా వుల్ఫ్, జేమ్స్‌జాయిస్, మొదలయినవారు. వర్జీనియావుల్ఫ్ అన్నట్లు—''మిసెస్ బ్రవున్'' అనే పాత్ర పరిసరాలగురించి కాకుండా ''మిసెస్ బ్రవున్‌నెస్'' గురించి చెప్పే మనస్తత్వ నవలలు నవలా సాహిత్యంలో ఒక క్రొత్త మలుపుని తీసుకొని వచ్చాయి.

ఇంగ్లీషులో ఈ తరహా నవలలు మొదటి రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో చాలా అధికంగా వచ్చాయి. ఫ్రాయిడ్, జంగ్, హెన్రీ బెర్గ్‌సన్,ల సిద్ధాంతాలు ఈ నవల ఆవిర్భావానికి కారణ భూతాలయ్యాయి. ఈ సిద్ధాంతాలవలన హేతువాదానికి అందని కొన్ని భావాలు వుంటాయని స్పష్టమైంది. మనిషికి మామూలుగా వుండేమెదడు క్రింద సెక్సువిషయంలోనూ, తల్లిదండ్రుల విషయంలోను, హేతుబద్ధంకాని భావాలకు సంబంధించిన పొర ఒకటి వుంటుందని చెబుతూ ఫ్రాయిడ్—''యిగో'' ''యిడ్'' (Ego, Id) అనే రెండు భాగాలను వివరించాడు. ''యిగో'' అన్నది మనిషి తార్కిక ప్రవర్తనను చెబుతూవుంటే— తర్కానికి లొంగని నిర్హేతుక ప్రవర్తన ''ఇడ్''కు సంబంధించినదని ఫ్రాయిడ్ అన్నాడు. ఈ విధంగా విభజించడంలో ఫ్రాయిడ్ మనిషిలోని తార్కిక, తార్కికాతీతశక్తులమధ్య సంఘర్షణను సూచించాడు. ''యిడ్'' ''యిగో''ల మధ్య సంఘర్షణ ప్రబలమవకుండా ''సూపర్‌యిగో'' తండ్రిలాగా సరిదిద్దుతూ వుంటుంది. ఈ విధంగా మనిషి మనస్సుయొక్క ప్రవర్తనను విశదీకరిస్తూ — చేతన (Conscious), అచేతన (Unconscious), ఉపచేతన (Subconscious) స్థితులలో మనిషి ఆలోచనా తరంగాల తీరును వివరించాడు ఫ్రాయిడ్.

యిది యిట్లావుండగా— అయిన్‌స్టీన్‌వంటి శాస్త్రజ్ఞుల సిద్ధాంతాలు, Planck ప్రతిపాదించిన ''క్వాంటమ్‌థియరీ'' మొదలయినవి 'డిస్కంటిన్యుటీ' అనేది తప్పనిసరిగా వుంటుంది అని బుజువు చెయ్యడంతో—ప్రతిదాంట్లోను 'కంటిన్యుటీ' గురించిన ఆలోచన కూడా తగ్గుముఖం పట్టింది.

ఇలా—కొత్తభావాల ప్రచారం రచయితల భావనాశక్తికి మంచి ఆహారాన్నిచ్చింది. ప్రతివిషయంలోను తార్కిక భావాలే వుండాలని గాని, కంటిన్యుటి మాత్రమే వుండాలనిగాని—అన్న నిబంధన

లేకుండా మనిషిలోని 'కంట్రోల్డ్ డిజార్డర్' రచనల రూపంలో వ్యక్తం చెయ్యడం—మనిషిలో అంతర్గతంగా వుండిపోయి, యింత వరకూ బయటకురాని భావాలను వెలికితీసే ప్రయత్నం చెయ్యడం ప్రారంభమైంది. యిందులో ఒక భాగమే చైతన్యస్రవంతి నవలలు.

సాంప్రదాయ నవలా రచనా విధానానికి చైతన్య స్రవంతి విధానం పూర్తిగా విరుద్ధమైంది అని చెప్పవచ్చును. ఈ విధానానికి ఫ్రాన్సులోని మార్సెల్ ప్రోస్ట్, యింగ్లీషు రచయిత్రి డరోతీ మిల్లర్, ఐరిష్ వ్యక్తి జేమ్సు జాయిస్, ఆద్యులు. అయితే— ఈ విధానానికి తన "యులిసిస్" నవలలో పేరు ప్రఖ్యాతులు తీసుకొని వచ్చినవాడు జేమ్సు జాయిస్. సాహిత్య ప్రపంచంలో "యులిసిస్" చేసినంత అలజడి బహు కొద్ది రచనలుమాత్రమే చేసివుంటాయి. అసభ్యకరమైన రచనగా భావించి దానిని కొన్నాళ్ళు నిషేధించారు కూడా. ఈ రంగంలో విశేషమైన కృషి చేసిన ఆంగ్ల రచయిత్రి వర్జీనియా వుల్ఫ్. ఈమె రచించిన "మిసెస్ డేలోవే", —"వేవ్స్" — "టు ది వైట్ హవుస్" మొదలయిన రచనలు ఈ తరహాకు చెందినవి.

సాంప్రదాయ నవలలకు చైతన్య స్రవంతి నవలలు ఏ విధంగా భిన్నమైనవో తెలుసుకోవాలంటే "The prychological Novel" అన్న గ్రంథంలో Leon Edel అన్న మాటలు పరిశీలిద్దాం—

"సాంప్రదాయక నవలలో పాఠకులు రచయితకు ఎదురుగా ముఖాముఖి కూర్చుంటారు. అతను కిటికీలోంచి చూస్తూ, తను చూచినవి, చూచిన వాటిలో చెప్పాలనుకున్నవి చెబుతూ వుంటాడు. మనకు కిటికీ దగ్గరకు వెళ్ళి చూడాలని వున్నా రచయిత చూడనివ్వడు. కిటికీ దగ్గిర సీటులో తనే కూర్చోవాలంటాడు. అయితే అతను అద్భుతంగా కథ చెప్పేవాడు కావడంతో అతనితోబాటు మనమూ చూస్తున్నట్టు అనుభూతి నందుతాం.

చైతన్య స్రవంతి ధోరణిలో రాయబడ్డ మనస్తత్వనవలల్లో రచయిత మనకు కనబడడు. హఠాత్తుగా మనం కిటికీ దగ్గిర కూర్చుంటాం. కిటికీ పైనో, క్రిందనో, ప్రక్కనో రచయిత స్టేజి మేనేజరులాగా కూర్చుని, మనకు చూపించాల్సిన విషయాల గురించి పరిశీలన చేస్తూ వుంటాడు......ఒకళ్ళు చెప్పేదానికి శ్రోతలుగా వుండటంకాక, మనకు ప్రత్యక్షంగా పాల్గొనే అవకాశం లభిస్తుంది. యింకోళ్ళమీద ఆధారపడకుండా మన కళ్ళతో మనం చూస్తాం. మనం చూచిన దానిని అనుభూతినందుతాం. ...రచయిత ఒక్కొక్కప్పుడు రంగుటద్దాలు యివ్వ వచ్చును. అయితే అనుభూతి మాత్రం మనది..."

ఈ విధానం గురించి కాస్త వివరిస్తాను .చైతన్యస్రవంతి విధానంలో పాత్రల బహిః స్వరూపమేకాక, అంతః స్వరూపంకూడా అవగత మవుతుంది. ఇందులో "కథ" కు ఎక్కువ ప్రాధాన్యత వుండదు. పాత్రల ఆలోచనా సరళి— ఆలోచనా తరంగాలు— వీటిని విశ్లేషించడం జరుగుతుంది. ఈ విధానం ప్రకారం నవలా కాలం ఒకరోజు లేదా కొద్ది గంటలు వున్నా చాలును. ఈ కాలంలో ప్రధాన పాత్ర లేదా పాత్రల జ్ఞాపకాల ద్వారా ఎన్ని సంవత్సరాల కథ అయినా యిమిడి పోతుంది. 900 పేజీల ఉద్గ్రంథం అయిన 'యుల్లీసిస్' నవలాకాలం కేవలం 18 గంటలు. హోమర్ మహనీయ కావ్యంలో 18 పర్వాలుంటే యిందులో ఆధునిక యులీసిస్ కథాకాలం 18 గంటలు. 1904వ సంవత్సరంలో జూన్ 16వ తేదీన డబ్లిన్ నగరంలో ఉదయం 8 గం॥ నుండి తెల్లవారుజాము 2—45 గం॥ వరకూ గల కాలంలో 'యులీసిస్' అనే ఆసామీ జీవితంలో జరిగిన సంఘటనల గురించి ఈ నవల చెబుతుంది. ఇదే విధంగా శ్రీమతి వర్జీనియా వుల్ఫ్ రచించిన "శ్రీమతి డేలోవే" (Mrs. Dallow way) నవలలో నడివయస్కురాలయిన మిసెస్ డేలోవే అనే గృహిణి జీవితంలోని పన్నెండు గంటల కాలంగురించి రచయిత్రి చెబుతుంది. ప్రధాన పాత్ర ఆలోచనా తరంగాల్లో జ్ఞాపకాల్లో, మనంకూడా పాలు పంచుకుంటూ ఆమెతోబాటు మనంకూడా లండన్ నగరవీధుల్లో ప్రయాణం చేస్తాం. ప్రవాహగతిలో ఆలోచనా తరంగాలు కదిలిపోతాయి.

ఈ తరహా రచనా విధానానికి Stream of Consciousness (చైతన్య స్రవంతి) అని పేరు పెట్టిన William James "Stream" అనే మాటలో ఒక ప్రత్యేకమైన భావనాశక్తిని నిర్దేశించారు. అతడు దీనిని "Chain of Thought" అనిగాని, — "Train of Thougt" అనిగాని అనక పోవడాన్ని మనం గమనించాలి.

చైతన్య స్రవంతి విధానంలో వర్తమానము, గతం, జోడు గుర్రాల్లాగా నడుస్తాయి. చైతన్య స్రవంతుల తెరల్లో మనం వర్తమానంలోంచి గతంలోకి జారి, మళ్ళీ గతంలోనుంచి వర్తమానంలోకి వస్తూంటాము. చైతన్య స్రవంతియొక్క ప్రత్యేకతను తెలుపుతూ జక్జీ జాన్‌యమ్ వుల్ఫ్ దీనిని 'Multiple Exposure on a Cinema film' అన్నాడు. జాయిస్ రచనా విధానం గురించి చెబుతూ అతడు అన్నమాటలను ఉదహరిస్తాను—

"ఇంచుమించు జాయిస్ ఉద్దేశించిన ఫలితం ఎలాంటిదంటే — సినిమా తెరమీద ఒక మనిషిని focusలో చూపించి, దానివెనుక అంతకన్నా తక్కువ focus లో అతని మనస్సంచారాన్ని చూపించి — ఇంకా దాని వెనుక అతని సుప్త చైతన్యంలోని స్మృతి పరంపరలను చూపడం వంటిది. ఒకేసారి యిన్ని focusలలో ఫోటో తియ్యగల కెమెరాలు లేవు. రచనా శిల్పంద్వారా దీనిని జేమ్సు జాయిస్ సాధించాడు—"

ఈ విధంగా చేయడానికి అవకాశం వున్నందువల్లనే చైతన్య స్రవంతి నవలల్లో—మనకు వర్తమానకాలం, భూతకాలం, ఒక్కమారుగా దర్శన మిస్తాయి. సాంప్రదాయ నవలల్లో గతాన్ని వర్తమానాన్ని ఒక 'ఆర్డర్' లో చెబితే ఈ నవలల్లో అది 'డిజార్డర్'గా మారుతుంది. ఈ విషయాన్ని గురించి చెబుతూ "The novel and the modern world" అనే గ్రంథంలో David Daicher ఇలా అంటడు:—

"The Line along which we move in traditional chronological novel becomer in a Novel of this kind one of the axer of a graph on which the curve of our journey is plotted and we refer to the axis only when we want to check upon our position—"

ఈ తరహా నవలల్లో మనిషి మెదడులోకివచ్చే ఆలోచనలే ప్రధానం. అవి సభ్యమైనవా, అసభ్యమైనవా, అన్న ప్రశ్నకు అవకాశం లేదు. కొన్ని సందర్భాలలో పాత్రలకు వచ్చే ఆలోచనలు అసభ్యంగా వుండవచ్చు. పచ్చిగా వుండవచ్చు. అందువల్ల యిటువంటి రచనల్లో కొందరు బూతుల్నికూడా చొప్పిస్తారు. ఈ నవలల్లో ఛాప్టర్ల విభజన వుండాలన్న నియమంకూడా లేదు. ఆలోచనలమధ్య Break చూపించడానికి పేరాగ్రాఫ్‌ల మధ్య కాస్త ఎడం సూచిస్తే చాలు. వర్జీనియా వుల్ఫ్ యిలాగే చేసింది.

ఇంతవరకూ చర్చించిన తరువాత, 'చైతన్య స్రవంతి' అంటే ఈ క్రింది అపోహలు లేకుండా వుండటం అవసరం—

1) చైతన్య స్రవంతి అంటే స్వగతాలు మాత్రమే కావు.

2) చైతన్యస్రవంతి అంటే 'ఫ్లాష్‌బాక్' విధానంమాత్రమే కాదు.

చైతన్య స్రవంతిలో కనబడేది Monologue కాదు — Internal monologue— 'మొనొలాగ్' కి, 'యింటర్నల్ మొనొలాగ్' కీ తేడా వుంది. Monologue అంటే ఒక పాత్ర స్వగతం. ఇందులో Logical organisation వుంటుంది. ఏది ముందు చెప్పాలి ఏది వెనుక చెప్పాలి అన్న ఆలోచన వుంటుంది. కాని—Internal monologue లో Logical organisation వుండదు. Disorder వుంటుంది. ఒక కాలక్రమ వరుస లేకుండా ఒక పొందిక లేకుండా బుర్రలోనికి వచ్చిన భావాలు యథా తథంగా వెల్లగక్కడం జరుగుతుంది. అయితే— పొందిక లేకపోవడంలోనే ఒక పొందిక వస్తుంది. ఈ విషయాన్ని వివరిస్తూ వర్జీనియా వుల్ఫ్ యిలా అంటుంది: — "Life is not a series of gig lamps symmetrically arranged, but a luminous halo, a semi transparent envelope surrounding us, from the beginning of consciousness to the end—"

చైతన్యస్రవంతిలో రాయబడిన నవలలు సగటు పాఠకులకు అంత అందవు. ఈ తరహా నవలలు తుదీ మొదలూ లేనట్టుగా ప్రారంభం అవుతాయి కాబట్టి పాఠకునికి అవగాహనా శక్తి చాలా అవసరం. మిసెస్ రిచర్డ్‌సన్ నవల "Pointed roofs" నలభై పేజీలు చదివితేగాని— ప్రధాన పాత్ర పూర్తి పేరు మిరియమ్ హేండర్సన్ అని తెలియదు. దాదాపు వందపేజీలు చదివితేగాని ఆ పాత్ర వయస్సు 17 సంవత్సరాలు అని తెలియదు. ఒక విధంగా చెప్పాలంటే ఈ తరహా నవలలు 'పొయిట్రీ'కి దగ్గరగా వుంటాయి. అందుకే Leon Edel అంటాడు — "—ఛాయా మాత్రంగా కనబడి లాస్యమాడుతూ వుండే చైతన్య భావాన్ని పరిశీలించేందుకయి కృషిచేసిన నవలాకారులు వచనానికై ప్రార్థించి కవిత్వాన్ని తయారు చేశారు—" అని.

ఏది ఏమయినా— మనస్తత్వ విశ్లేషణకు సాహిత్యపరంగా జరిగిన ప్రయత్నాల్లో చైతన్య స్రవంతి ఒక మైలురాయి అనేది నిర్వివాదాంశం.

* చైతన్యస్రవంతి విధానం తెలుగులో మొదట కథా సాహిత్యాన్ని పలకరించింది. చైతన్యస్రవంతి ధోరణిలో శ్రీ శ్రీ 1946లో 'కోనేటి రావు కథలు' ప్రారంభించాడు. 'కోనేటి దినం' 'కోనేటి రాత్రి' 'కోనేటి జన్మ' ఈ విధంగా వుంటాయి ఆ కథలోని భాగాలు. మహారాజశ్రీ జటావల్లభుల కోనేటిరావు పంతులు అనే హెడ్ గుమాస్తా గానుగెద్దు మార్కు జీవితంలోని ఒకనాటి రాత్రి, పగలు ఎలా వుంటాయో వివరిస్తాడు శ్రీ శ్రీ యిందులో—

"—హెడ్ గుమాస్తా కోనేటిరావు పంతులు పదకొండు గంటలు అయింది. గుమాస్తా కోనేటి హెడ్డు పదకొండు గంటలు కొడుతున్నాడు. ఆఫీసువేళ కోనేటి గంటలగందరగోళం తొందర భోజనం ముగించుకొని చుట్ట బిగించుకొని బట్ట సవరించుకొని పాగా తగిలించుకొని ఒసే కుర్రాళ్లు జాగ్రత్త మిలిటరీకార్లు చిల్లర డబ్బులు ఏమున్నావుంటే జేబులో వెయ్యి—ఆఫీసు కాగితాల అరుపులు వినబడుతున్నాయి. కోనేటి కాగితాల దొరనిండా కోపం ఊళ్లలో కార్లు జొరబడ్డాయి—"

యిలా అస్తవ్యస్తంగావుండేమాటలతో కోనేటిరావు Brainను మనకు పరిచయం చేస్తారు రచయిత. ఆఫీసుకు వెడుతున్న కోనేటిరావు బుర్రచుట్టూ ఎన్నో భావాలు ముసురుకున్నాయి. పదకొండు గంటలకు తొందరగా భోజనం చెయ్యడం—ఆఫీసరు దొరగారి చిటపటలు—యింటిగొడవలు—రోడ్డుమీద మిలటరీ కార్లహడావిడి— అన్నీ అతగాడి బుర్రలో కలగా బులగం కావడం ఈ వాక్యాల్లో మనం చూడవచ్చు.

"—ప్రపంచంలోవున్న చిత్తు కాగితాల నన్నింటినీ చించి వాటి నన్నింటినీ క్రమంలేకుండా ప్రచురిస్తే చైతన్యస్రవంతి అనిపించుకొంటుంది—" అని హాస్యధోరణిలోనే అనుకోండి అన్న బుచ్చిబాబు కూడా ఈ రంగంలో కథలకు సంబంధించి ప్రయత్నం చేశాడు. 'చైతన్యస్రవంతి' అనే పేరుతో అతడు వ్రాసిన కథలో, యింటర్వ్యూకోసం బయలుదేరిన ఒక నిరుద్యోగి యింటినుండి కార్యాలయం చేరేవరకూ ఎలా ఆలోచిస్తాడో—అతడి ఆలోచనల ఎగుడు దిగుళ్ల గ్రాఫు ఎలా వుంటుందో వివరిస్తాడు. బస్సులో నిరుద్యోగికి ఓ అందమైన అమ్మాయి కనబడ్డప్పుడు అతడి బుర్రలో చెలరేగిన 'సెక్సు' గందరగోళాన్ని ఈ కథలో రచయిత యిలా మన ముందు వుంచుతాడు—— "ఆ నాజూకు, ఆ అమాయకత్వం ఎక్కడా చూడలేం. భవభూతి గుండెలు కొట్టుకుంటాడు. దంతపు సీసాలాంటి కంఠం. రవిక కొంగా ముడతలు పడ్డచోట తళతళ— పదునయిన మొనమెరుపు. లారెన్స్ జుట్టు పీక్కుంటాడు. మాన

వుడి బుద్ధికి లొంగని ఆ పికాసో పెదవులు రష్యన్ విప్లవంతో వణకి పోతాయి.

క్లైవ్ బెల్ కేదారరాగంలో యేడవాలి. పెళ్లాం ఒకటి తగలడిందిగానీ, లేకపోతే ఆ వ్యక్తిని హేమింగ్వే సముద్రంలో మునలాడిలా పారలెల్‌దాటి హిమాలయా ప్రాంతాలకి లేవదీసుకుపోదును'' అని.

నిరుద్యోగి యింటర్వ్యూకోసం ప్రిపేరయిన విషయాలు, అతగాడి 'సెక్స్యువల్ యిన్‌స్టింక్ట్' రెండూ కలగా బులగం అయిపోవడంవల్ల యిలాంటి వాక్యాలు చైతన్య స్రవంతి ధోరణిలో పుట్టుకొచ్చాయి. అసలు ఈ తరహా 'స్ట్రీమ్ ఆఫ్ కాంషస్‌నెస్'కు 'చైతన్యస్రవంతి' అని బాలసారె చేసింది బుచ్చిబాబే అనుకుంటాను. ఇక—నవలల విషయానికివస్తే, చైతన్యస్రవంతి విధానం తెలుగు నవలల్లో రెండువిధాలుగా కనబడుతుంది. మొదటిది అచ్చంగా జాయిస్ వరవడిలో నడుస్తూ, కథకు ప్రాధాన్యతను యివ్వకుండా కొన్ని గంటల వ్యవధిలోని ఒకపాత్ర ఆలోచనల రికార్డును అందించిన నవలలు—ఇక, రెండవది, మామూలు సాంప్రదాయ ధోరణిలో నవలరాస్తూ, మధ్యమధ్యలో పాత్రల అంతఃకరణను తెలపడానికి చైతన్య స్రవంతి విధానాన్ని ఉపయోగించడం. —మొదటి తరహా నవలలకన్నా రెండవ తరహా నవలలు తెలుగులో ఎక్కువగాఉన్నాయి.

జేమ్స్ జాయిస్ దోవలో నడవడానికి శ్రీ నవీన్, వినుకొండ నాగరాజు, పరిమళాసోమేశ్వర్, మొదలయినవారు ప్రయత్నం చేశారు. అక్షరాలా జాయిస్ విధానం కాకపోయినా, శిల్పంలో ఒకింత సాంప్రదాయతవున్నా, చైతన్య స్రవంతి విధానాన్ని అద్భుతంగా ఉపయోగించినవారు శ్రీ రా. వి. శాస్త్రి.

శ్రీ 'నవీన్' రచించిన 'అంపశయ్య' నవల 1969 ప్రాంతంలో వెలువడింది. ఒక యూనివర్శిటీ స్టూడెంట్ హాస్టలు జీవితంలోని 18 గంటలకాలం ఈ నవలకు యితివృత్తం. సర్వ సాధారణంగా విద్యార్థుల హాస్టల్ జీవితాలలోను, వాళ్ల ఆలోచనల్లోనూ, దర్శనం యిచ్చేవి—చదువులు, పరీక్షలు, రాజకీయాలు, సినిమాలు, సెక్స్, అమ్మాయిలు, ప్రొఫెసర్లు, భవిష్యత్తు గురించిన ఆశలు, నిరాశలు, యిలా ఎన్నో—ఈ ఆలోచనలన్నీ ఒకదానితో ఒకటి లుంగచుట్టుకొని 'రవి' అనే విద్యార్థి దినచర్యగా మారితే—దానిని రచయిత 246 పేజీల నవలగా రూపొందించారు. ఈ నవలపై జాయిస్ ప్రభావం వుంది.

''—అరెరూ!—ఝూ ఝూ ఝూ బ్బబ్బబ్బబ్బబ్బ నిద్రపో పోపోపో రమేశ్ అమెరికా పోపో రమేశ్ తనతో చెప్పించాడు రత్తి రత్తి రత్తి బెగ్గర్ గర్ల్ రత్తి చచ్చిపోలేదా న్యూడ్స్ న్యూడ్స్ న్యూడ్స్ రత్తిశవం ఒకటీ ఒకటీ ఒకటీ తీస్తున్నాడు వేస్తున్నాడు. తాళం వేస్తున్నాడు. తీస్తున్నాడు......కుక్కను కుక్కంటే అంత రోషం ఎందుకో కుక్కవాడో కుక్క రెడ్డివెంట యిరవైనాలుగు గంటలూ తిరిగే అల్సేషియన్ కుక్కంటే రోషం ఎందుకో గ్రేట్ ప్రకాష్ గ్రేట్ హ్యాట్సాఫ్ టు యు ఆర్ ఓన్లీ కోతల రాయుడనుకున్నానెన్నో అనుకున్నానన్నీ నన్ను నట్టేటముంచి నయవంచనచేసి నమ్మించి మోసంచేసి మీసం తిప్పాడు రిక్షావాడు—'' (పేజీలు 242—244)

కలగా బులగంగావున్న ఈ ఆలోచనల్లో బజారు మనిషి 'రత్తి'కి 'అఠణా' యిచ్చి రవి తీర్చుకున్న సెక్స్‌దాహం వుంది—బీద బిచ్చగత్తెకు అర్ధరూపాయి యిచ్చి తీసిన న్యూడ్ ఫోటో కథ వుంది. మార్క్సిస్టు ధోరణులంటే నచ్చని అమెరికా మానస పుత్రులతో 'రవి' పెట్టుకున్న తగువుల ఉదంతం వుంది. రిక్షావాడితో తగువుకథ వుంది. ఒక సంఘటన గురించి ఆలోచిస్తున్నప్పుడు అవ్యక్తంగా మరెన్నో సంఘటనల జ్ఞాపకాలు మనస్సు ఎలా పలక రిస్తాయో ఇలాంటి ఉదాహరణలు చెప్పక చెబుతాయి.

చదువుకుందామని ఉదయం అయిదున్నరకు నిద్రలేచి, అనేక భావాలు తనని ముప్పిరిగొనగా—స్నేహితులు అనేకమంది 'హస్కురాయళ్ల' రూపంలో తనని పరివృతం చేయగా—చదవలేక, చదవాలనే ఆశ చంపుకోలేక—కట్టని మెస్‌బిల్లురూపంలో తన దరిద్రం ఒకవైపున తనని భయపెడుతూంటే — స్వంతడబ్బా వాయించుకోవడం మినహా మరేమిలేని ప్రొఫెసర్ల విద్యాబోధన, పేరుకుపోయిన కులతత్వం, మరోవైపునించి నిరాశను కలిగిస్తూంటే, ఆకలి—సెక్స్ ఆకలి—యింకో ప్రక్కనుండి మండుతూవుంటే—గతం, వర్తమానాలమధ్య ఊగిసలాడుతూ చివరకు రాత్రి పదకొండు గంటలకు అంపశయ్యలాంటి పక్కమీదకు చేరిన ఒకవిద్యార్థి కథ ఆలోచనా వీధుల్లో అందంగా అందుతుంది మనకు ఈ నవలలో.

శ్రీ వినుకొండ నాగరాజు రచించిన 'ఊబిలోదున్న' 'తాగుబోతు' నవలల్లో చైతన్యస్రవంతి విధానపు ప్రభావంబాగా కనబడుతుంది.

''—ఫ్రాయిడ్ చెప్పిన కాన్షస్,అన్‌కాన్షస్, సబ్‌కాన్షస్‌ఆలోచనా స్థితిగతుల పరిణామాలతో జేమ్స్‌జాయిస్, కాథరిన్ మాన్స్‌ఫీల్, వర్జీనియా వుల్ఫ్ చేసిన చైతన్య స్రవంతి ప్రయోగాలు యాభైఏళ్ల క్రితంనాటివి. కంప్యూటర్లు, రాకెట్లు స్ఫుత్నిక్‌లు, అరుదెంచిన యుగంలో గల నేను—ఆ ముగ్గురికంటే అభివృద్ధి చెందిన చైతన్య స్రవంతిని ఉపయోగించెనని అభిప్రాయపడుతుంటాను—'' అని వ్రాసుకొన్న వినుకొండ నాగరాజు రచించిన 'ఊబిలోదున్న' నవలకు సాహిత్య ఎకాడమీవారు బహుమతిని ప్రకటించారుగానీ, ఆతడు దానిని స్వీకరించలేదు.

ఈ నవల కథాకాలంకూడా కొద్ది గంటలు. యిక యితి వృత్తం మాటకొస్తే చెప్పుకోదగ్గ కథ ఏమీలేదు. కొర్రాజు గుండం డామ్ దగ్గర ఒక ఊబిలో దున్నపోతు కూరుకుపోయింది. దానిని పైకి తీయడానికి మానవతాదృక్పథం గల రాఘవులు పూనుకున్నాడు. కొన్ని గంటలపాటు వళ్లు యూనం చేసుకొని దానిని బయటకు లాగాడు. అంతేకాదు. దానిలో చైతన్యం తీసుకొనివచ్చి గ్రామందాకా నడిపిద్దామనుకుంటాడు. అది నడవదు. దాన్ని గట్టిగా అదిలిస్తాడు—సదుద్దేశంతోనే. దున్నపోతుకు కోపంవస్తుంది. రాఘవుల్ని

అది పొడవబోతుంది. చావు తప్పి కన్ను లొట్టయిన రాఘవులు, ''దాని తప్పేమీ లేదు. అది దున్నపోతు. నేనే యింకాస్త జాగ్రత్తగానూ, మెలకువగానూ వుండవలసింది—'' అని అనుకుంటాడు సంతృప్తితో.

ఈ నవలలో రచయిత ఊబిలోంచి దున్నను లాగడం సుదీర్ఘంగా, అతి సూక్ష్మ వివరాలతో వర్ణించారు. అసలు నవలలో వున్నదంతా అదే. దున్నను ఊబిలోంచి లాగేటప్పుడు రాఘవులు ఆలోచనలు చైతన్య స్రవంతి ధోరణిలో సాగుతాయి. ఆ జ్ఞాపకాలలోనే మనకు రాఘవులి కథ తెలుస్తుంది. ఆ జ్ఞాపకాలు అతను చదువుకొనేరోజుల నాటివి... నిరుద్యోగపు కష్టదినాల నాటివి... పెళ్ళినాటివి...రంగమ్మగారి రొమాన్సుకు సంబంధించినవి. రాజకీయాలకు సంబందించినవి. ఎన్నో, మరెన్నో...

''...అతని తలలో. సూన్యం. భ్రమణం. ఎగుగ్ళ్ళా దిగుళ్ళూ—నలుపూ, కాంతి, తరువాత మెడంతా నల్లగా అయిపోయి—తర్వాత చీకట్లోవుండి వెలుగుతున్న లైటు కాంతిలా — నున్నగా గీసిన గెడ్డం, స్నో పౌడరూ, గౌను వేసుకున్న ఫోటో — స్నేహితుల నవ్వులు—ఎయిర్ కండిషన్డ్ హోటలు, టాక్సీ — సినిమా—అమ్మాయిలు—'' ఇవి అన్నీ చెల్లా చెదురుగా తెగిపడ్డ రాఘవులి జ్ఞాపకాలు. ఇవి 'సబ్ కాంషస్' స్థితిలో వుండగా వచ్చినవి. వీటి మధ్య దృశ్యాదృశ్యంగా కనబడే సమన్వయం రాఘవులి కథ మనకు చెబుతుంది. రాఘవులి ఆలోచనలకు ఊబిలోదున్న కేంద్రం. ఆలోచనలు గతంలోకి, భవిష్యత్తులోకి ఎంతదూరం ప్రయాణం చేసినా మళ్ళీ దున్న దగ్గరకు చేరుకుంటాయి. ఇదే చైతన్య స్రవంతి టెక్నిక్—

ఈ రచనపై జాయిస్ ప్రభావంతోపాటు హేమింగ్వే ప్రభావంకూడా వున్నట్టు మనకు కనబడుతుంది. హేమింగ్వే రచించిన 'ఓల్డ్ మాన్ అండ్ ది సీ' మాదిరిగానే ఈ నవలలోకూడా సింబాలిజం జాస్తి. ఈ నవలలోని 'దున్నపోతు' చేతనా రాహిత్యానికి, జడమనస్త్వానికి ప్రతీక—దున్నపోతు ఒక జంతువుకాదు — ఒక తరహా సమాజానికి, వ్యవస్థకు అది ప్రతినిధి. ఇక రాఘవునిలో మనం ఒక గాంధీనో, ఒక మార్క్సునో, ఒక వీరేశలింగాన్నో— ఎవరినయినా ఊహించుకోవచ్చు. రాఘవులు, దున్నపోతు, వ్యక్తికీ వ్యవస్థకీ ప్రతీకలు అని మనం అనుకుంటే రచయిత వర్ణించిన జలగలు, రక్త పింజెరులూ, ఆ వ్యవస్థచుట్టూ అలుముకున్న విష ఫలాలుగా మనం చెప్పకోవచ్చు.

ఈ నవల చదివితే 'ఓల్డ్ మాన్ అండ్ ది సీ' జ్ఞాపకం వచ్చిందని ఎందుకు అన్నానంటే— హేమింగ్వే నవలలోని ముసలివాడు, పడుచుకుర్రవాడు, ఎరలో పడిన పెద్దచేప, యివన్నీ కొన్ని ప్రత్యేకమైన భావాలకు ప్రతీకలు. హేమింగ్వే నవలలోని ముసలివాడు చేపతో మాట్లాడినట్లుగా నాగరాజు నవలలోని రాఘవులు దున్నపోతుతో మాట్లాడతాడు. Old manకు తాను పట్టి చంపబోతున్న సొరచాపమీద జాలి. రాఘవులుకు తాను రక్షించబోతున్న దున్నపోతుమీద ప్రేమ—అయితే తేడా అల్లా, Old man ది పొట్టకూటికయి కర్తవ్యం—రాఘవులిది పండగవూట 'ఎడ్వంచర్'—ముసలివాడి కథ విషాదాంతంగా ముగుస్తుంది. ఎద్దు చేత తాపులు తినడం మినహాయించి రాఘవులి కథ సుఖాంతం.

"fish, I love you and respect you very much. You are my brother—you are killing me fish, But you have a right to. Never have I seen a greater or more beautiful or Calmer or more noble thing than you. Brother, come on and kill me — I don't care who kills who—'' అన్న ముసలివాడి విషాద భావాల్లాగానే ''అనుకున్నది చేశాను. చాలు, ఇక నిద్ర పోగలను — '' అనుకున్న రాఘవులి సంతృప్తికూడా మనకు చాలాకాలం జ్ఞాపకం వుంటుంది.

శ్రీ వినుకొండ నాగరాజే రచించిన 'తాగుబోతు' నవలలో కూడా చైతన్య స్రవంతి విధానం కొంత వరకు కనబడుతుంది. ఈ నవల కథాకాలం కూడా కొద్ది గంటలు మాత్రమే. కథానాయకుడు మాదిగలింగడు. పిచ్చెమ్మగారింట్లో గొడారివాడు. ఏనాటినుంచో వర్ణాశ్రమ 'ధర్మా'ల ప్రకారం అధర్మపు యినప పాదాల క్రింద నలిగి సాంఘికంగా అడుగుకు పోయినవాడు. ఆర్థికంగా కృంగిపోయిన వాడు. పైగా తాగుబోతు—ప్రొద్దుగూకువేళ యజమానురాలిగారి పొలం నుంచి యింటికి వెడుతూంటే—ఆమె వెనుక బయలుదేరిన లింగడి ఆలోచనలు, వాడి దయనీయమైన ఛండాలపు బ్రతుకు— వాడి డైరీలో ఒక పేజీ— ఈ నవలకు యితివృత్తం. లింగడి బ్రతుకంతా బాధే—ఆకలి, చీకటి, దరిద్రం, యివన్నీ పుట్టుక నించీ వున్నవే— వీటన్నిటికితోడు తాగుడు లేందే తెల్లవారదు. అందుకే వీడితో అవస్థపడలేక పెళ్ళాం బుచ్చిపెద్ది లేచిపోయింది. గుండెకు తగిలిన ఈ దెబ్బ సంగతి అలా వుండగా, కాలికి గట్టి దెబ్బ తగిలి రక్తంకారి మంటపెడుతోంది. ఈ బాధలు కన్నీటి మధ్య లింగడి ఆలోచనలు తాడూ బొంగరం లేకుండా పరిగెడుతూంటాయి. వీటిని 'రికార్డు' చేయడంలో చైతన్య స్రవంతి రచయితకు బాగా ఉపకరించింది.

చచ్చినంత పనిఅయి—చచ్చిచెడి బ్రతికిన లింగడి ఓరోజులో నాలుగు గంటల కథను ముగిస్తూ రచయిత—

''ఇంకాసేపట్లో ఊరు నిద్రపోతుంది. కిర్సనాయి దీపాలు ఆరిపోతయ్—చీకటి. చలి. శ్వాసలు. తన్నులాటలు. గుద్దులాటలు. ఆదిమ మానవుల్లా. పురాణ వీరుల్లా. ఆడది. ఆకలి. పట్టుదల. పగ. దొంగతనం. హింస. బలమైనవాళ్ళు. బలహీనులు. కృతఘ్నత. చేతగానితనం. లోపల అగ్ని. అరచేతిలోస్వర్గం—కష్టంలో సుఖం, సుఖంలోకష్టం. ఎన్నో పదజాలాలు పేరిస్తే ఎన్నో పొరడాక్సులు. సాహిత్యంలో విలువయినవి. జీవితంలో ప్రతినిత్యం. అంతా నిద్దరోతుంది. తిరిగి లేచేవరకూ—''అని అంటారు.

అట్టడుగు మానవుల్ని వాళ్ల ఆలోచనల్ని ఆధునిక ధోరణిలో వివరిస్తుంది ఈ నవల.

శ్రీమతి పరిమళా సోమేశ్వర్ రచించిన "అంతరంగ తరంగాలు" కూడా ఈ తరహా నవలే. ఈ నవలలో రచయిత్రి ఒక గుమాస్తా దినచర్యలోని పదిహేను, పదహారు గంటల కాలాన్ని యితివృత్తంగా తీసుకున్నారు.—"ఉదయం నిద్రలేచిన దగ్గిరనుంచి రాత్రి పడుకోబోయేవరకూ ఒకగుమాస్తాకు ఎదురయ్యే వివిధ సంఘటనలు వ్యక్తులు—అనుభవాలు—అతని మేధస్సుపైనా, హృదయంపైనా, వ్యక్తిత్వంపైనా, ఎలాంటి ముద్రవేస్తాయో ఈ నవలలో వ్యక్తీకరించడానికి ప్రయత్నించాను—" అన్నారు రచయిత్రి.

ఎల్. డి. సి. శర్మ జీవితంలో—గతంలోను, వర్తమానంలోను, ఎన్నో అనుభవాలున్నాయి. చదువుకొనే రోజుల్లో మొగ్గ తొడిగిన ప్రేమవుంది—భార్య సాన్నిధ్యంలో వికసించిన వైవాహిక ప్రేమకూడా వుంది. అయితే, ఆ మొగ్గా, ఈ పువ్వు మాత్రం ఒకటికావు. అంతేకాదు—శర్మ జీవితంలో ఆఫీసు సూపర్నెంటు చిటపటలున్నాయి. మహానగర వరప్రసాదితాలయిన యిరుకు కొంపలూ, జనంతో క్రిక్కిరిసిన బస్సులూ, అప్ టు డేట్ ఫేషన్ల అమ్మాయిలూ—వాళ్ల వెనుకబడే దేశవాళీ రోమియోలు—రోకలిబండ క్కాళ్లమీద పడేసుకున్న చంటివాడి ఏడుపూ—యిలా మరెన్నింటినో స్పర్శించుకుంటూపోయే సామాన్య జీవనమూవుంది — ఇలాంటి ఎల్. డి. సి. శర్మగారి ఆలోచనా తరంగాల్ని—అంతరంగంవరకూ పోయి "అంతరంగతరంగాలు"లో చైతన్య స్రవంతిగా అందిచ్చారు రచయిత్రి.

* కొంతమంది రచయితలు చైతన్యస్రవంతి విధానంలో రచనను పూర్తిగా నడిపించకపోయినా — తమ రచనల్లో ఒకపాత్ర అంతరంగస్థితిని పాఠకులముందు వుంచడానికి 'చైతన్యస్రవంతిని' అక్కడక్కడా కావలసినమేరకు వాడుకున్నారు. రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారి 'అల్పజీవి' పూర్తిగా చైతన్యస్రవంతి విధానంలో వ్రాయబడిన నవల అని చెప్పలేముగాని—ఆ విధానాన్ని ఉపయోగించిన మేరకు అది ఒక అపూర్వమైన విజయం అని చెప్పాలి. ఈ ప్రక్రియను రచయిత చాలా చక్కగా ఉపయోగించుకున్నారు.

"—ఈ నవలలోని రచనా విధానానికి ఆధారం కొంత మట్టుకు జేమ్స్ జాయిస్ రచనలు. ఎక్కువ మేరకు శ్రీ శ్రీ గారి రచనలూను...ఇందులో సుబ్బయ్య పాత్రకి శ్రీ శ్రీగారి కోనేటిరావు కొంతగా నమూనా—నిజ జీవితంలో చాలా నమూనాలు—" అని విశ్వనాథశాస్త్రిగారు చెప్పుకొన్నప్పటికీ— శ్రీశ్రీ గారు 'కోనేటిరావు' ద్వారా చేయదలుచుకున్న ప్రయోగాన్ని—రా.వి. శాస్త్రిగారు, తమ 'సుబ్బయ్య'ద్వారా పూర్తిచేయడం మాత్రమేకాదు—ఆ విధానానికి తెలుగు సాహిత్యంలో ఒకస్థానాన్ని కూడా కల్పించారు.

బుద్ధి గడ్డితిని లంచం తీసుకున్న పిరికి సుబ్బయ్య — గుమాస్తా సుబ్బయ్య—గుండెదడదడ ఈ నవలలో రా. వి. శాస్త్రి గారు వివరించడానికి చైతన్యస్రవంతి ఎంతగా ఉపకరించిందో చూడండి—

"లంచం!—నేరం!—శిక్ష!—జెయిల్!—
సుబ్బయ్య కళ్లు తెరిచాడు.
దేవా!—నాకు భయంగా వుంది!—
నాకు మతిపోతోంది దేవ దేవా!—

లేడీ పిల్లలు లేటుగా యింటికి వెడుతున్నాయి—
పరమేశ్వరా నా కెందుకీ భయం? —
సొట్టకాలువాడు ఆలస్యంగా బజారుకు వస్తున్నాడు—
పరమేశ్వరా నేనేవిధమైన నేరమూ చెయ్యలేదే—
వయ్యారిభామ కొబ్బరికాయల తట్ట ఖాళీచేసుకొని పోతోంది
భగవాన్—ఏ పాపమూ ఎరగన్నేను—
సిల్కుజాకెట్ పిల్ల లైట్‌హవుస్‌నించి వచ్చేసిందే—

అందరికీ పాపాలభైరవుడు హెడ్ క్లర్కు...ఎర్ర చీరమనిషి...
అవధానిపాపం... వెంకట్రావుకోసం చేశాను... పాడురోజులు...
...ఎదురింట్లోకి దిగుతున్న దెవరు?—

(పేజీ 98)

లంచం పుచ్చుకున్నాక— ఎటు తిరిగి ఏటు వస్తుందో అన్న భయంతో యింటి అరుగుమీద కూర్చుని వచ్చేవాళ్ళనూ, పోయేవాళ్ళనూ, చూస్తూ ఆలోచించుకుంటున్నాడు పిరికి సుబ్బయ్య—అందుచేత తన భయం ఒక వైపు—రోడ్డమ్మట పోతున్న అమ్మాయిలు మొదలయినవారి గురించిన ఆలోచనలు మరొక వైపు కలగాబులగంగా వుండడటాన్ని యిందులో మనం చూస్తాం.

యింత పిరికి సన్యాసి లంచం ఎందుకు పుచ్చుకున్నాడు? అబ్బే—తనకోసం కాదు—బావమరిది అంటే వున్న భయంకొద్దీ అతగాడి అవసరం తీర్చడానికి కర్కోటకుడని పేరు గాంచిన కంట్రాక్టరు గురవయ్య దగ్గిర లంచం పుచ్చుకున్నాడు—గురవయ్య బిల్లు పాసవకుండానే సుబ్బయ్య సెక్షను మారిపోయాడు — పని పూర్తి కాలేదు కాబట్టి తన డబ్బు తనకు తిరిగి యిచ్చెయ్యమన్నాడు గురవయ్య— యివ్వను అనడానికి సుబ్బయ్యకి గురవయ్య అంటే భయం—యిస్తాను అందామంటే అతని దగ్గిర డబ్బులేదు. బావమరిదిని అడుగుదామంటే అది మరీ భయం — ఇదీ, అసలు విషయం.

ఈ నవలలో వివిధ పరిస్థితులలో సుబ్బయ్య ఆలోచనలు అద్భుతంగా వుంటాయి. ఆఫీసులో మిత్రుల సలహాతో, బావమరిది భరోసాతో, పిరికి సుబ్బయ్య ధైర్యంచేసి గురవయ్యకు డబ్బు తిరిగి యివ్వనక్కరలేదని కబురు పంపిన తరువాత సుబ్బయ్య తనను తాను అభినందించుకున్నాడు— అందరూ తనని అభినందిస్తారని ఆశించాడు—

"—ఓహో!— సుబ్బయ్యా !
ఆహా !— సుబ్బయ్యా!—
ఎంతపని చేశావు?— మంచిపని చేశావు!—

నేడే ఆఖరు దినం — ఇదే ఆఖరి తరుణం — ముగ్గురు యోధులనే చిత్రరాజాన్ని ... హ లో ఈ న్యూస్ విన్నావా ? ఏమిటా న్యూసు?— కాని— ఎలా చెప్పడం వీరందరితో?—ఒరే, నా వేయిపడగలు పుస్తకం ఏదిరా?— సారీ రా బ్రదర్. ఒద్దంటే వినకుండా మా అక్కయ్య ఢిల్లీ పట్టుకెళ్ళిపోయింది—నీతో చెబ్దా మనుకుంటూ...అనుకొని, అనుకొని, ఆఖరికి చెప్పేశాను. ఎంత గుమ్మెగా, ఎంతఫస్టుగా, ఎంత ధైర్యంగా, ఎలా చెప్పేశాను?—''
(పేజీలు 184—185)

చెప్పడం చెప్పేశాడుగానీ, గురవయ్య మనుషులు ఎప్పుడు తనను తంతారో అని భయం — ఎవర్ని చూచినా రాక్షసులను చూచినట్టే వుండేది. ఓ రాత్రిపూట రోడ్డుమీద నడుస్తున్న సుబ్బయ్య యిలా అనుకుంటాడు—

''—చాలా ఆలస్యం అయినట్టుందే !—
సావిత్రి ఏమనుకుంటుందో ఏమిటో!—
వీధులన్నీ నిర్జనంగా ఉన్నాయ్
ఒకానొక నిర్జనారణ్యంలో ఒకపాంథుడు పోవుచుండగా...
నాకు భయంగా వుంది.
పండ్లూడిపోయిన ముసలి టక్కరిపులి అతనినిచూచి ...
వెన్నెల మసక మసక వెన్నెలగా మారిందేం ?—
— ఓరీ! పాంథా! ఈ పసిడి కంకణమునుగొనిపోయి—
పక్కన రాళ్ళకుప్పలు — రోడ్డు బాగులేదే!—
రా దగ్గిరకు రా దీనిని గొనిపొమ్ము —
ఇలాటి రాళ్ళకుప్పమీదే ఆరోజు పడ్డాను—
అమ్మో! —- నాకు భయంగా వుంది.
అంత నా దుష్ట శార్దూలముచే...
ముగ్గురు కొడుతున్నారు నాలుగో మనిషిని
అమ్మో !— అమ్మో !—
నా పాంథుడు రక్షించబడియె
నాకు భయంగా-వుంది.
తలవంచుకుని యింటికి నడుస్తున్నాడు సుబ్బయ్య
(పేజీ 206)

ఇక—కంట్రాక్టరు మనుషులచేత చావుదెబ్బలు తిన్న తరువాత పిరికి సుబ్బయ్య మనోగతం యిలావుంది—

''ఏమయిందని ఎవరో అడుగుతున్నారు.
చెప్పలేను. చెప్పలేను. చెప్పలేను.
ఏమయిందేమయిందే దేమయిందే
హబ్బ! చెప్తాను చెప్త సెప్తాన్సెప్తాను స్సెప్తాను...
ఏమయిందే మయిందే దేమయిందే...
పడిపోయాన్రా!—పడిపోయాను!—''

దెబ్బలు తిన్నానని చెప్పడానికి కూడా భయమే సుబ్బయ్యకి.

తెలుగు సాహిత్య చరిత్రలోని అధీర నాయకుల్లో సుబ్బయ్యకు ఒక ప్రత్యేక స్థానం వుంది. ఆ స్థానానికి మరింత ప్రత్యేకతను సమకూర్చింది చైతన్య స్రవంతి రచనాధోరణి.

—ఇటీవలి కాలంలో తెలుగులో వచ్చిన గొప్పనవలల్లో ''హిమజ్వాల'' ఒకటి. అస్తిత్వవాద దృక్పథంతో ఈ నవలను రచించిన వడ్డెర చండీదాసుగారు—అక్కడక్కడా తమ రచనలో పాత్రల మనోగతాన్ని ఆవిష్కరించేందుకు చైతన్య స్రవంతి విధానాన్ని ఉపయోగించారు.

''—గీతా!—
—యెవరు గీత?—
—మీరు గీతాదేవిగారు కాదా?—
—నేనా?—నేను గీతనా?—హాహా
—మరి మీ పేరేమిటి?—
—రిత
—కాదు. మీ పేరు గీతాదేవి ఎక్కడుంటున్నారో చెప్పండి.
—మార్సెలో
—మార్సెలోనా?—అనుకున్నంతా అయింది. ఎవరు తీసికెళ్లారు?—
—రోడిన్ బొమ్మ చెక్కుతానని తీసికెళ్లి చెక్కలేక తల రాతికేసి కొట్టుకొని చచ్చిపోయాడు పాపం—
—మీరేం చేస్తున్నారక్కడ?—
యేం చేస్తాను?— యాంటొనీని కౌగిట్లో బిగిస్తున్నాను.
—మరి క్లియోపాత్ర?—
—యింకెక్కడి క్లియో? పక్షవాతంతో తీసుకుని ఛస్తోంది ఆయుర్వేద వైద్యం చేయించుకొంటోంది—''
(పేజీ 89)

యిలాంటి 'సబ్ కాంషస్' 'స్వగతాలు' 'హిమజ్వాల' నవలలో చాలా కనబడతాయి.

యింతవరకూ నేను పరిశీలించినవి ఈ ధోరణిలో రచింపబడిన కొన్ని రచనలను మాత్రమే. స్వాతంత్ర్యానంతరం తెలుగు సాహిత్యంపై ఫ్రాయిడ్ ప్రభావం మరికొంత బలపడటంతో— చైతన్యస్రవంతి విధానం విస్తృతంగా కాకపోయినా, స్వాతంత్ర్య పూర్వయుగంతో పోల్చిచూస్తే కొంచెం ఎక్కువగానే వాడుకలోనికి వచ్చింది. ఈ తరహా రచనలను రచించడంమాట ఎలావున్నా— పఠించడం కష్టం. పాఠకులలో ఓపికా, సాహిత్యాభిరుచీ వుండాలి. కాలక్షేపానికి మాత్రమే రచనలు చదివే పాఠకులు ఈ 'గందరగోళాన్ని' అంతా బుర్రకెక్కించుకోడానికి యిష్టపడరు. బహుశా—

ఈ కారణం చేతనే అనుకుంటాను—ఈ విధానానికి ప్రజాదరణ కొంచెం తక్కువ. యింగ్లీషు సాహిత్యంలో కూడా ఈ విధానం ఎక్కువగా ప్రచారంలోలేదు. వర్జీనియావుల్ఫ్ మొదలయిన రచయితల తరువాత దీనిని ఎక్కువగా పట్టించుకున్నవాళ్లు ఆట్టే మందిలేరు.

ఈ విధానానికి ఉన్న కొన్ని ఉపయోగాలను తప్పకుండా అంగీకరించవలసిందే. పాత్రల అంతరంగంలోనికి చొచ్చుకొనిపోయి, వెలుగునీడల్లోనూ సహా, సభ్య అసభ్య భావాలతోసహా మనిషిలోని అసలు మనిషిని మనముందు రచయిత ఉంచదలుచుకున్నప్పుడు ఈవిధానం చాలా ప్రయోజనకారిగా వుంటుంది. అయితే—అర్థం పర్థంలేని, ఒక దానితో ఒకటి సంబంధంలేని, వాక్యాలు ఒకచోట రాసేసి యిదే చైతన్యస్రవంతి అని సంతృప్తి పడకూడదు. నాలుగు పిచ్చిగీతలు ఒక మోడరన్ ఆర్ట్ ఎలాగకాదో, అర్థంలేని మాటల కలయికకూడా చైతన్యస్రవంతికాదు. కొన్ని పరిస్థితుల్లో, ఉద్రేకం అధికమై మనుషుల ఆలోచనల్లో ఒకవిధమైన "డిజార్డర్" ఏర్పడుతుంది. ఆ Disorder ను యధాతథంగా పాఠకులముందు వుంచడం చైతన్యస్రవంతి విధానపు లక్ష్యం. ఈ విధమైన 'ఎక్సురే' దృక్పథం రచయితకు కావాలంటే ఆతనికి మంచి రచనా సామర్థ్యం, క్లిష్టభావాలను వ్యక్తీకరించగల శక్తి, వుండాలి. పాత్రల మనస్తత్వాన్ని అంతరంగంలోకి పోయి మదించేందుకు కావలసిన జీవితానుభవం వుండాలి. ఒక లారీ డ్రయివరు ఆలోచనలు—ఒక ప్రొఫెసరు ఆలోచనలు — ఒకే విషయాన్ని గురించినవి కావచ్చు, ఉదాహరణకు, సెక్సు గురించో — సారాయి గురించినవో కావచ్చు. అయితే— యిద్దరి 'సబ్‌కాంషస్'ల లోనూ ఈ ఆలోచనల కదలికలో తేడా వుంటుంది. వీటిని మనం చైతన్య స్రవంతి రచనల్లో అందంగా చూడగలం.— ఏది ఏమయినా, మనస్తత్వ చిత్రణ ప్రధానంగా రచనలు చేయవలసి వచ్చినప్పుడు చైతన్యస్రవంతి విధానం పూర్తిగానో, కొంతవరకో, అవసరం అవుతుంది. ఈ విధానాన్ని రమణీయంగా ఉపయోగించుకునే బాధ్యత రచయితలమీదనే ఉంది.

# శబ్ద చిత్రాలు

శ్రీ పెదగాడి సూర్యప్రకాశరావు

ఒక అశ్రుకణము
ముత్యం లా
తారికల
నేత్రాంచలమునుండి
జారి
పచ్చికపై పరున్న
తృణ కన్య
నాశికాగ్రమున
ముక్కుపుడకలా
వ్రేలాడింది !

ఒక అశ్రుకణము
శివుని కంఠాన
గరళం లా
నా గొంతున
అడ్డుపడింది !

*

ఒక అశ్రుకణము
అమృతంలా
హృదయాంతరాళాన
ఇంకింది !

# కాస్త దాహం దయచేయండి, బాబూ

ఎండలు మండి పోతున్నాయి. పెదవులు ఎండి పోతున్నాయి. - మనుషులకు - ఇది సహజమే.

వానలు రాష్ట్రంలో కురుస్తున్నాయి. కాని కొన్ని చోట్ల విపరీతమైన దాహం వేస్తున్నది - పొలాలకు. ఇది అసహజం.

ఏటేటా ఎన్నో వందల కోట్లు సేద్యపు నీటిపారుదల ప్రాజెక్టుల మీద ఖర్చుపెడుతున్నాం. ఈ యేటి వార్షిక ప్రణాళికలో యీ రంగానికి రు. **107.17** కోట్లు కేటాయించారు. అయినా యింకా ఎన్నో ప్రాంతాలకు నీటిపారుదల సౌకర్యం లేదు.

రెండు నెలల క్రితం వెంకటస్వామికి ఎకరన్నర మిగులు భూమి పట్టా యిచ్చారు. అది అనావృష్టి ప్రాంతం. ప్రాజెక్టులు అతనికి అందవు. వేరేనీటి వనర్లులేవు.

ఆ ప్రాంతంలో యిప్పుడు గొట్టపుబావి త్రవ్విస్తున్నారు. భూగర్భ జలాలను వెలికి తీస్తేగాని మన పొలాల దాహం తీరదు.

అనావృష్టి ప్రాంతాల్లో యిందుకోసం ప్రత్యేక కృషి జరుగుతున్నది.

ప్రజా సౌకర్య పథకాల్లో చేయవలసింది ఎంతోవుంది. ఎంత చేసినా యింకా మిగిలే వుంటుంది. వెనుకచూపు లేకుండా పని చేసుకుంటూ పోవడమే మన పని.

సమాచార పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

2577

# నగ్నరాత్రి

గుప్పున వెలిగింది వీధి దీపం—శత్రువుమీదికి బలవంతంమీద నడి పించబడిన పిరికి సిపాయిలా, కంగారుగా !

వీధి దీపంకింద ఎవడో దిక్కులేని ముసలాడువెల్లకిలాపడుకుని వున్నాడు. పక్కన ఖాళీ కంచం, ఊతకర్రా పడున్నాయి. కాళ్ళ వైపున ఎవడో చింపిరి తలవాడు—జీబురు గడ్డంవాడు — నిలబడి తదేక దృష్టితో ముసలాడి ముఖంవైపు చూస్తున్నాడు.

రోడ్డుమీద వందగజాల దూరంలో పంచాయితీ ప్రెసిడెంటు బసవరాజాగారి మూడంతస్తులమేడ సందడిగా వుంది.

మేడముందు వాడంత పందిరి !

పందిరినిండా రంగురంగుల ట్యూబ్‌లైట్లు !

ఇంట్లో సన్నాయిమేళం !

పందిరిక్రింద పసివాళ్ళ కేరింతలు!

లౌడ్ స్పీకర్లలోంచి సినిమాపాట తప్పతాగినవాడిలా తూలి పడుతోంది '...దమ్మరో దమ్మ్... బిత్తిజాయా హమ్మ్... బోలో సుబాశామ్...హరే కృష్ణా హరేరామా...హరే కృష్ణా హరే రామా...'

వీధి దీపానికి ఎదుట వున్న మఠంలోకూడా లౌడ్ స్పీకర్లు గొంతు చించుకుంటున్నాయి. 'హరే రామ హరేరామ రామరామ హరే హరే, హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే...'

పదిరోజులనుంచీ మఠంలో ఉదయమూ, సాయంకాలమూ ఎవరో స్వాములవారు వేదాంతోపన్యాసాలు యిస్తున్నారు. నేడే ఆఖరిరోజు.

గేటు లోపల వేదికమీద కూర్చున్న స్వాములవారు ఉపన్యాసం ముగించి 'హరే రామ హరేకృష్ణ' అంటూ భగవన్నామ సంకీర్తన చేస్తున్నారు. వేదికముందు కూర్చున్న భక్తాగ్రేసరులందరూ — ఇహ పరాలలో ఏ ఒక్కదాన్నీ వొదులుకోలేని జీవాత్మలలాగా తల కాయల్ని అటూయిటూ ఉయ్యాల లూపుతూ స్వాములవారితో గొంతులు కలుపుతున్నారు. అలా వూగుతున్న తలలు ఏభైకంటే ఎక్కువ వుండవు. అన్నీ పెద్ద తలలే ! పెద్దమనుషుల తలలే ! అందరూ వర్తక శ్రేష్ఠులు ! అందరూ పుర ప్రముఖులు ! తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాభాలు సంపాదించేవాళ్ళు ! తక్కువ శ్రమతో ఎక్కువ సుఖాల్ని అక్కున జేర్చుకునేవాళ్ళు ! వేదాంత శ్రవణం ద్వారా తమ పాపాల్ని కడిగేసుకోవాలని, దేవుడి దయతో పుణ్యాన్ని తమ స్వంత గోదాముల్లో దాచేసుకోవాలని — కడుపులో చల్ల కదలకుండా కూర్చున్నారు.

భగవన్నామ సంకీర్తనం ముగిసింది.సరిగంచు పంచెకట్టుకుని సిల్కులాల్చీ తొడుక్కుని, పండిత శాలువ కప్పుకున్నవాడొకడు — వందన సమర్పణ చెయ్యటం కోసం వేదికమీది కెక్కాడు. అతడి పేరు దేవముని. అతడంటే ఆ వూళ్ళో అందరికీ తెలుసు.

దేవముని మైకుముందర నిలబడి గొంతు సవరించుకుని చిరు నవ్వుతో భక్తకోటివైపు పరకాయించి చూసి, 'పవిత్రాత్మ స్వరూపులారా !...' అంటూ గంభీరంగా తన ప్రసంగాన్ని ప్రారంభించాడు.

అతడి గొంతు వినగానే—వీధి దీపం కింద నుంచుని వున్న జీబురుగడ్డంవాడిలో చలనం వచ్చింది. వాడు తల పైకెత్తాడు చుట్టూ చూచాడు. మఠం వైపు చూపు నిలిపాడు.

అతణ్ణి అందరూ పిచ్చిదొర అని పిలుస్తారు. పిచ్చివాడు పిచ్చివాళ్లలో దొరలాంటివాడు. అహర్నిశలూ ఊరంతా తిరుగ తూంటాడు. ఎవరితోనూ మాట్లాడడు. ఎవరినీ ఏమీ చెయ్యడు వాణ్ణి చూడటం అలవాటైతే, పసిపాపలుకూడా జడుసుకోరు.

దేవముని ప్రసంగం పదినిమిషాలసేపు సాగింది.

'గీతోపదేశ మొనర్చువానికంటే అధిక ప్రియతముడు నాకు ఈ జగత్తులో లేడు—అంటాడు శ్రీకృష్ణ పరామాత్మ భగవద్గీతలో. భగవంతుని మనం చూడలేదు. ఆ లోకేశ్వరునికి అధిక ప్రియతములైన శ్రీ స్వాములవారిని ఇప్పు డిక్కడ మనం చూస్తున్నాం. దేవుని దివ్యవాక్కులు సరాసరి స్వాములవారి నాలుకపై నుంచి మనం విన్నాం. ఇది సత్యం...'

గీతోపదేశం చేసి, భాగ్యవంతుడైన భక్తుని గృహం పావనం చేసి, పాదపూజ చేయించుకుని, ప్రీతితో నేతి వంటకాలు తిని 'సుఖీభవ' అని చేయెత్తి దీవించే స్వాములవారంటేనే దేవుడికి యిష్టమా ?

దేవుడు అన్నాడా, అలా అని !

బీళ్ళు దున్ని, పంటలు పండించి, పండిన గింజల్ని బండ్ల కెత్తించి, భూస్వాముల ధాన్యపు కొట్లలో బస్తాలు పేర్చి, కడుపులో కాళ్ళు ముడుచుకున్న కూలివాడు—

మేడమీద మేడకు, మేడమీద మేడకు, మేడచివరి పిట్ట గోడకు యిటుకలుమోసి, కిందికిదిగి వెళ్ళిపోయి, కటికనేలమీద కాళ్ళు జాపుకునే కూలివాడు—

దేవుడికి యిష్టంలేనివాళ్ళా ?

దేవుడూ! వర్థిల్లు !

స్వాములవారూ! వర్థిల్లు!

భక్తులారా! వర్థిల్లండి!

మీరు ముగ్గురూ వర్థిల్లితే, దేశం వర్థిల్లినట్లే !

'...మన పుర ప్రముఖులు పూజనీయులు డాక్టర్ వైద్య లింగంగారు మన వూరికి చేస్తున్న సేవ అపారం. వారు ప్రతి సంవత్సరం ఎందరో మహాత్ములను మన పట్టణానికి రావించి వారి ప్రసంగామృత ధారలచే మన జీవితాలను పునీతం చేస్తున్నారు. వారి కృషే లేకపోతే మనందరికీ ఈ మంచిమాటలు వినే భాగ్యమే లేకపోయేది. జనం ఎక్కువమంది రాకపోయినా నిరుత్సాహపడక, పట్టుదల వదలక ఆయన ఈ పుణ్యకార్యక్రమాలను జరిపిస్తున్నారు. కనుక ఈ పదిరోజులూ జరిగిన గీతా యజ్ఞంద్వారా మనం ఏదైనా ఫలితాన్ని సాధించివుంటే, అది డాక్టర్ వైద్యలింగంగారి లోకోపకారగుణం వల్లనే!...'

డాక్టర్ వైద్యలింగంగారు ప్రైవేటుగా డిస్పెన్సరీ నడుపుతున్న ప్రముఖ వైద్యులు. వారి లోకోపకారగుణం ఎలాంటిదో ప్రపంచానికి తెలిసిందే! కలిగినవాళ్ళ ఆయురారోగ్యాలకోసం పాటు పడటం ఒక్కటే జీవిత పరమార్థమనీ, డబ్బివ్వలేనివాడికి మందివ్వడం గోహత్యా పాతకం కంటే గొప్పదనీ భావించి, పాపాల జోలికి పోకుండా పుణ్యాలను మాత్రమే మూటగట్టుకుంటున్న ధర్మాత్ముడు! తన నిర్మల జీవితానికి దాఖలాగా ఈ గీతాయజ్ఞాలు నిర్వహిస్తున్నాడు.

'ఈ వూళ్ళో చాలామంది మొదట బీదవారుగా వుండేవారని మీకు తెలుసు. శీఘ్రకాలంలోనే వాళ్ళంతా ఐశ్వర్యవంతులై సుఖ జీవనం గడుపుతూ వుండడం మనమిప్పుడు చూస్తున్నాం. దీనికంతటికీ కారణం వారి నిరంతరకృషి, వారి మంచితనం, వారు చేస్తున్న పుణ్యకార్యాలే అని నేనంటాను. నా మాట అక్షరాలా నిజం! తమకెన్ని పనులున్నా ఇట్టి గీతాయజ్ఞాలను ప్రోత్సహిస్తూ డాక్టర్ వైద్యలింగంగారికి సహకరిస్తున్నందుకు ఈ వూరిలోని వ్యాపారులు ఎంతైనా ధన్యులు!...'

సరుకులు దాచేసి చాటుమాటుగా అమ్ముకోవడం, కల్తీ సరుకుల్ని కల్తీలేని బంగారంలా తూచి యివ్వడం, లంచాలు తినిపించి పందిరి మంచాలూ, బంగారు కంచాలూ స్వంతం చేసుకోవడం, తాకట్లు పెట్టించుకుని కోర్టులకు లాగడం, పొలాల కంచెలు పెద్దవి చేసుకోవటం, పొరుగువాడి కొంపపీకి అక్కడ అద్దాలమేడ కట్టి అద్దెకివ్వటం, పేదవాళ్ళపు స్సైలుతెంపి, దేవతలుసైతం అసూయ పడేటంత వైభవంగా కన్నబిడ్డల పెళ్ళిళ్ళు జరిపించడం, తాగటం, జూదమాడటం, గౌరవంగా ఘరానా దొంగతనాలు చెయ్యటం, తమ సిరిసంపదలకు తామే మురిసిపోవటం, దేవతా విగ్రహాలకు క్షీరాభిషేకాలు చేయించటం, స్వాములను సంతృప్తిపరచటం—ఇవేనా పుణ్యకార్యాలంటే?

'నేను కవిని, కథకుణ్ణి, నటుణ్ణి, గాయకుణ్ణి! శ్రీస్వాములవారి ప్రసంగం విన్న తరువాత భగవద్గీత గొప్పదనాన్ని గురించి—సామాన్యులకు ఉపయోగపడే విధంగా చిన్నగ్రంథం ఒకటివ్రాసి ప్రకటించాలనుకుంటున్నాను మీ అందరి ఆశీస్సులతో నేను...'

...వందన సమర్పణ ముగిసిన పిదప భక్తులంతా లేచి బట్టలు దులుపుకుని బయటకు రాసాగారు.

వీధి దీపం క్రింద వెల్లకిలాపడివున్న ముసలివాణ్ణి చావు లొంగదీసుకుంటోంది. గొంతులో శ్వాస గురగురలాడుతోంది. ఎండిపోయిన రొమ్ము పైకీ కిందికీ లేచి పడుతోంది. కళ్ళు వెళ్ళుకొచ్చాయి. మనిషిలో కదలికలేదు.

ముసలాడు చచ్చిపోతున్నాడు. రోడ్డుపక్కనపడి చచ్చిపోతున్నాడు. చూచేవాళ్ళు లేరు. ఏడ్చేవాళ్ళులేరు. మెదలనైనా మెదలకుండా, ఏడవనైనా ఏడవలేకుండా చచ్చిపోతున్నాడు. ఎవరైనా వొచ్చి, చీమలు కొరుకుతున్న ఈ ముసలివాణ్ణి ఎత్తి చాపమీద పడుకోబెట్టరాదూ? వాడిమీద మూరెడు గుడ్డ కప్పరాదూ? గురగురలాడుతున్న వాడిగొంతులో గుక్కెడుపాలు పోయరాదూ?

ముసలివాడి పక్కనుంచే—

స్వాములవారు నడిచిపోతున్నారు.

స్వాములవారి పక్కనే డాక్టర్ వైద్యలింగంగారు నడుస్తున్నారు.

వాళ్ళవెనకే — పుణ్యకార్యాలుచేసి భాగ్యవంతులైన భక్త చూడామణులందరూ వెళ్తున్నారు.

చచ్చిపోతున్న ముసలివాడివైపు అందరూ చూశారు, క్షణకాలం. అలా చూడటంకూడా మహాపాపమన్నట్లు, మరుక్షణంలోనే చూపులు మరల్చుకొన్నారు. అందరూ ముందుకే వెళ్ళిపోయారు

మనిషేకదా చచ్చిపోతున్నాడు? పోనీ! దేవుడు చావటంలేదు కదా ?

వాళ్ళందరూకూడా మనుషులే కదా? అయితేనేం? వాళ్ళు పుణ్య కార్యాలు చేసి దేవుణ్ణి మెప్పించినవాళ్ళు. దేవుడికి చిన్న పెళ్ళాం వైపు చుట్టాలు ! ఇలా రోడ్డు పక్కన పడి దిక్కులేక చావు చస్తారా ? మేడల్లో చస్తారు. పట్టు పరుపులమీద చస్తారు పెద్ద డాక్టర్ల పర్యవేక్షణలో చస్తారు. పిల్ల నర్సుల పలువరస మీద చూపులు నిలిపి చస్తారు. వాళ్ళు చావటానికి ముందే దేవుణ్ణి చంపేసి, ఆ తరవాత వాళ్ళు చచ్చి దేవుడి దగ్గిరికి వెళ్ళిపోతారు.

మానవ సేవే మాధవ సేవ అన్నారు కదా మహాత్ములు !

మహాత్ముల మాటన్ని ఎవరూ చెవినివేసుకోవటం లేదెందుకు?

మానవ సేవే మాధవ సేవ కాదా ?

మానవ సేవ ! మాధవ సేవ !

ఏది గొప్పది ?

మాధవ సేవకంటే మానవసేవ గొప్పదా, మానవ సేవకంటే మాధవ సేవ గొప్పదా ?

మాధవుణ్ణి మరిచిపోయి మానవసేవ చేయటం గొప్పదా, మానవుణ్ణి మరిచిపోయి మాధవ సేవ చేయటం గొప్పదా?

దీనుల్ని చంపి దేవుణ్ణి బ్రతికించటం మంచిదా, దేవుణ్ణి-చంపి దీనుల్ని బ్రతికించటం మంచిదా ?

దేవుడు దీనుల్ని బ్రతికించలేని దద్దమ్మ అయితే, ఆ దేవుడు చచ్చిపోయి దీనులు బ్రతకటమే మేలు కదా ?

శాలువ సర్దుకుంటూ గేటు దాటుకుంటున్నాడు దేవముని. అతడు కంటబడగానే—వీధి దీపం క్రింద నిలబడివున్న పిచ్చిదొర వెర్రి నవ్వు నవ్వాడు. దేవముని అదిరిపడి, అతడివైపు చూశాడు.

'ఎంగిలి పాయసం తినే నాయాలా...,' అంటూ పండ్లు కొరికాడు పిచ్చిదొర.

పామును చూసిన కప్పలా భయపడిపోయాడు దేవముని. జడి వానలో చిక్కుకున్న వాడిలా కంగారు పడిపోతూ గబగబా ముందుకు నడిచాడు. అతడి వెనకే నడిచాడు పిచ్చిదొర అదే వెర్రి నవ్వుతో. దేవముని దగ్గరలోనే వున్న సందులోకి నడిచి, వేట కుక్క పొలకువ తెలుసుకున్న కుందేలులా అక్కణ్ణుంచి ఉసుక్కున పరుగుతీశాడు. అతడి వెనుక పిచ్చిదొరకూడా పరుగందుకున్నాడు.

పిచ్చిదొరను చూడగానే దేవముని ఎందుకలా భయపడి పారిపోయాడు ?

పేరుకు మాత్రమే పిచ్చివాడిలా తిరిగే పిచ్చిదొర దేవమునిని చూడగానే ఎందుకలా పిచ్చివాడై పోయాడు ?

## 2

చీకట్లోనే దీపాలు చిత్రంగా వెలుగుతాయి. చంద్రనిప్పులు చెరిగే పగటి ఎండలో—మండు టెండలాంటి సెగల బ్రతుకులో—వెలవెలబోయి, గుండె గూటిలో సొమ్మసిల్లిన ఆశల దీపాలు చీకట్లో ప్రాణం పోసుకుంటాయి .ఆశల దీపాలు వెలిగించి ఆనందించాలంటే, చీకటి కావాలి ! తెల్లవారితే, కలతల కత్తులు; చీకటి పడితే, కలల శరత్తులు !

కలల కోసం కళ్ళ తలుపుల్ని తెరిచిపెట్టి వీధిలోకి చూస్తూ ఆ కిటికీ వద్ద కూర్చున్న ఆ పద్దెనిమిదేళ్ళ అమ్మాయిపేరు ఆశాప్రియ.

వీధిలో పిల్లలు ఆడుకుంటూ వున్నారు. ఆశా ప్రియ చిన్న పిల్లగా వున్నప్పుడు చిన్నపిల్లలతోనే ఆడుకొంది. వాళ్ళతో ఆడుకునే ఈడు తనకిప్పుడు లేదు.

ముసలమ్మలు ఉబుసుపోక, అరుగులమీదచేరి కబుర్లు చెప్పుకుంటూ వున్నారు. ఆశాప్రియ ముసలిదైతే ముసలివాళ్ళతోనే ముచ్చట్లు చెప్పుకుంటుంది. ఇప్పుడుమాత్రం కాదు.

ఎంతకాలం ఈ ఒంటరితనం? త్వరగా ముసలిదైపోతే బాగుణ్ణు. లేదా మళ్ళీ చిన్న పిల్లగా మారి వీధిలోకి పరిగెడితే బాగుణ్ణు !

బోసి ముఖం, చింకిపావడ, మెతుకుల్లేని కంచం, నవ్వులేని గుండె, వెలుగులేని భవిష్యత్తు—ఇదేనా జీవితం ?

మోడు చిగురించేదెప్పుడు ? కొండవాగు నిండి పారేదెప్పుడు? ఎడారిలో నవ్వులు పూచే దెప్పుడు?

వీదిలో—పిల్లలేకాదు, పండు ముసలివాళ్ళే కాదు—ఎడారిలో పువ్వులు పూయించగల పడుచుకుర్రవాళ్ళుకూడా వెడుతున్నారు, ఆ కిటికీ ముందునుంచి.

ఒకడు, ఇద్దరు, ముగ్గురు...నాలుగు...ఐదు...పది...

వీళ్ళంతా ఎవరికోసం పుట్టినవాళ్ళో ?

వీళ్ళకోసం పుట్టిన వాళ్ళెవరో ?

తనకోసం పుట్టిన వాడెవడో ?

తానెవరికోసం పుట్టిందో?

ఎప్పుడువాడు? ఎందున్నాడు ?

... గౌరమ్మా, నీ మొగుడెవడమ్మా? ఎవడమ్మా, వాడెవడమ్మా ?

...ఎవరు నీ వారో, తెలుసుకోలేవో ?

ఎవరు? ఎవరు ?

ఎందరో మహానుభావులు! అందరూ పరాయివాళ్ళు!

అందరివైపూ కళ్ళప్పగించి చూస్తూవుంటుంది ఆశాప్రియ. ఆమె కళ్ళలో తడబాటులేదు. ఆమె బుగ్గలమీద సిగ్గు మొగ్గలు తొడగదు. ఆమె పెదవులమీద నవ్వులు పూయవు. ఆమె మేను పులకించదు. కిటికీ దగ్గరనుంచి కదలదు. కిటికీలోంచి కళ్ళు తిప్పకోదు.

ఆమె వెలిగించుకున్న కోటి ఆశల దీపాలు ఆమె కళ్ళలో ప్రతిఫలిస్తూ కిటికీ ముందునుంచి కదిలిపోతుంటాయి. ప్రతిదీపం ఆమె గుండె చీకటిలో గోరంతకాంతి నింపిపోతూవుంటుది. ఆ కిటికీ లేకపోతే ఆమె బ్రతుకులో సారమేలేదు.

పడుచుదనానికి పతాకలా, విలాసానికి కలికితురాయిలా, అల్లరికి ఆఖరిమెట్టులా—ఆశాప్రియ రోజూచూచే మగవాళ్ళలో

మొనగా డొకడున్నాడు. పేరు తెలియని పూలరంగడు!... రోజూ పొద్దు గూకేవేళ మరుని తేజిలా సాగివస్తాడు పూలరంగడు.

ఈ రోజు అతనింకా రాలేదు. సందేహ నివృత్తికోసం 'మనసా! పూలరంగడు వెళ్ళిపోయాడా?' అని అడిగిందామె.

'లేదమ్మా వయసా! ఇంకా రాలేదు' అంది మనసు.

పూలరంగడు రోజుకోరకం బట్టలు తొడుక్కుంటాడు. వేళ్ళనిండా ఉంగరాలు. జేబునిండా కొత్తనోట్లు. ఒంటినిండా సెంటు వాసనలు. కంటినిండా కొంటెపిలుపు.

రెండు నెలలనుంచీ కనిపిస్తున్నాడు పూలరంగడు. మూడిళ్ళ కవతలున్న మహడీలో ఒక్కడే వుంటున్నాడు. రోజంతా ఎక్కడెక్కడ తిరుగుతాడో, పొద్దుగూకేవేళ తన మేడవైపు నడిచిపోతూ, కిటికీవైపు చూస్తాడు. నడక మందగిస్తుంది. కళ్ళు సైగలు చేస్తాయి. పెదాలపైన నవ్వులు పూస్తాయి.

అదిగో—వచ్చాడు పూలరంగడు, ముఖంమీద వచ్చిపడిన పూలచెండులా!...ఆశాప్రియ ముఖంలో తొలిసారిగా నెత్తురు ఉరకలు పెట్టింది. ఎందుకో?

పూలరంగడు ఓరగా చూశాడు. కళ్ళలో సైగలు! పెదాలపైన వంకరనవ్వులు!...మెల్లగా నడుస్తూ చుట్టూ చూశాడు. కిటికీవారకు వచ్చాడు. కళ్ళలోకి సూటిగా చూశాడు—పొడుస్తున్నట్లు, చొచ్చుకుపోతున్నట్లు! నోరు విప్పాడు, మొట్టమొదటిసారిగా.

'నిన్ను చూసినాక నిద్రలేదు. రాత్రికి వస్తావ్?...' తురక యాస. ఖంగున మోగి తీగతెగి మూగవోయిన వీణలా ముందుకుసాగి వెళ్ళిపోయాడు.

మిన్ను విరిగి మీద పడినట్లయింది ఆశాప్రియకు. ప్రమాదాన్ని శంకించిన తాబేలులా, గుండె ఆగిపోయింది.

ఏమన్నాడు? పూలరంగడేమన్నాడు ?

'...రాత్రికి వస్తావ్?'

ఎందుకు? తన ఆశల ఒత్తులన్నీ ఒక్కసారిగా మండి ఆరిపోవటానికా?...ఇరుసు విరిగిన చక్రంలా గుండె తూలిపోయి గిలగిల కొట్టుకుంది. ముఖంనిండా చెమట బిందువులు పొటమరించాయి. భయం, కంగారు—ఊపిరిసలపనివ్వకుండా గొంతులో అడ్డునిలిచాయి.

రాత్రికి వెళ్తే ఏమవుతుంది?

తేనెలో ఈగపడితే, దానికేమవుతుంది?

అక్కయ్య జ్ఞాపకం వచ్చింది.

తేనెలోపడి గిలగిల కొట్టుకుని ఏడాదిక్రితం ఓరోజు తెల్లవారేసరికి వెళ్ళిపోయింది అక్కయ్య. ఈ ఇంట్లోనుంచే బయలుదేరి, ఈ వీధిలోనుంచే సాగి, ఈ ఊరి పొలిమేరలు దాటి వెళ్ళిపోయింది.

ఆశాప్రియకంటే కుమారి మూడేళ్ళు పెద్దది. స్కూల్ ఫైనల్ ప్యాసయి, నాలుగేళ్ళపాటు యింట్లో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంది. ఆమెతోబాటు చదువుకున్నవాళ్ళకంతా పెళ్ళిళ్ళయినాయి. ఆమెకుమాత్రం పెళ్ళికాలేదు. ఆమె ఈడు పిల్లలు చాల మంది ఉద్యోగాలు చేస్తున్నారు. ఆమెకుమాత్రం ఉద్యోగం రాలేదు. మొగుడు కావాలంటే కట్నం యివ్వాలి. ఉద్యోగం కావాలంటే కట్నం కంటే తక్కువ కానంత లంచం యివ్వాలి. పెళ్ళాడి పిల్లల్ని కనటం మాత్రమే తెలిసిన తండ్రి, కూతురికి కూడు పెట్టడానికి ఒక మొగుణ్ణో, లేక ఒక నౌకరీనో చూపించలేకపోయాడు. శ్రీ లక్ష్మీ ఫైనాన్స్ కార్పొరేషన్ భాగస్వాములనందర్నీ బ్రతిమలాడి, ఆమెను అక్కడ లెక్కలురాసే పనిలో పెట్టించాడు. జీతం డెబ్బైరూపాయలు. ఈ అదనపు రాబడి అతని సంసారానికి వేణ్ణీళ్ళకు చన్నీళ్ళలా ఉపకరించింది. రెండు నెలలు అలా గడిచిపోయాయి.

రోజూ ఏడుగంటలకు యింటికి తిరిగివచ్చే కుమారి—ఓ రోజురాత్రి నలిగిన చీరతో, రేగిన కురులతో గంట ఆలస్యంగా వచ్చింది. పని ఎక్కువగా వుందనీ, అందుచేత ఆలస్యమయిందనీ, చెప్పింది. అన్నం తినమంటే వద్దంది. తలనొప్పిగా వుందంటూ చాప వేసుకు పడుకుంది.

ఆ రాత్రి నడిజామువేళ నిద్రాభంగమై లేచి కూర్చుంది ఆశాప్రియ. అందరూ నిద్రపోతున్నారు. కుమారి మాత్రం పడుకోలేదు. చాపమీద కూర్చుని మోకాళ్ళమీద తలవాల్చుకుని కుమిలి కుమిలి ఏడుస్తూంది.

'ఎందుకక్కా, ఏడుస్తున్నావు?' అంది ఆశాప్రియ.

కుమారి వెక్కిళ్ళు ఆపుకుని, 'ఏమీ లేదు.' అంది.

'ఏమీ లేకపోతే ఏడవటం ఎందుకు?'

'కడుపు నొప్పి !'

'అమ్మను లేపమంటావా ?'

'వొద్దు. అదే పోతుంది. నువ్వు పడుకో !'

ఆమె ఏదో దాస్తూ వుందనిపించింది ఆశా ప్రియకు.

మరునాడు ఆఫీసుకు వెళ్ళలేదు కుమారి. ఒంట్లో బాగు లేదని పడుకుంది. ఆ ఉద్యోగం తాను చేయలేనంది. ఇక మీదట వెళ్ళేది లేదంది.

'నీ కిదేం పోయేకాలం ?' అంది తల్లి.

'కష్టపడి సంపాదించిన నౌకరీ—కాళ్ళు పట్టుకుని యిప్పించిన నౌకరీ పోగొట్టుకుంటా నంటావా? కాలుమీద కాలేసుకుని తినటానికి మనమేం పాలేగాళ్ళమా?' అంటూ పొదుగు ఎండిపోయిన గొడ్డును తిట్టినట్లు చీవాట్లు పెట్టాడు తండ్రి.

తల్లి దండ్రుల మాటలకు ఎదురాడలేకపోయింది కుమారి.

మరో రెండు మూడు నెలలు గడిచాయి. రోజులు దొర్లిపోతున్న కొద్దీ ఆమెలో కొత్తకొత్త మార్పు లొచ్చాయి. ఆఫీసుకు

ఆలస్యంగా వెళ్ళేది. ఇంటికి ఆలస్యంగా వచ్చేది. నౌకరీ అంటే భయ భక్తులు తరిగాయి. తల్లిదండ్రులంటే అలక్ష్యాల పెరిగింది. మంచి మంచి చీరలు కట్టుకునేది. చేతిలో ఎప్పుడూ చిల్లర డబ్బు లుండేవి. జీతం మాత్రం మొక్కపోకుండా తెచ్చి యింట్లో యిచ్చేది.

ఓ రోజు రాత్రి పొరుగింట్లో ఎవరో పురిటినొప్పులు పడుతూంటే సాయంగా వుండటానికి వెళ్ళింది అమ్మ. ఎలక్షన్ డ్యూటీ మీద నాన్న పొరుగూరు వెళ్ళాడు.

ఇంట్లో మిగిలినవాళ్ళు—ఆ అమ్మా నాన్నా కలిసి అచ్చుపోసి యింట్లో కుక్కిన ఆరుగురు పిల్లలు మాత్రమే!

కుమారి !

ఆశ్రేయ !

చక్రపాణి !

బాలయోగి !

రోజారమణి !

రాజా !

అందరూ ఒక్కచోట పోగై కథలు చెప్పుకున్నారు, కబుర్లు చెప్పుకున్నారు.

కళ్ళు తిరుగుతున్నాయంటూ చాపమీద పడుకుంది కుమారి. తక్కిన వాళ్ళంతా ఆచాపమీదనే కూర్చున్నారు, ఒకర్నొకరు ఆనుకుని.

జీవితం అంటే కోరికల వేట ! కోరికలు తీర్చుకోవటానికి సాగే ప్రాకులాట ! పువ్వు పుట్టగానే పరిమళం అన్నట్లు మనిషి పుట్టగానే కోరికలు గుబాళిస్తాయి. మనిషికంటే ముందుగా, మనిషికంటే ఎత్తుగా మనిషిలోని కోరికలు ఎదిగిపోతాయి.

పెరుగుతూన్న పిల్లలకు కోరికలే పరమౌషదాలు !

'జీవితంలో నీ మొదటి కోరిక ఏమిటి?' అనే ప్రశ్న ఎలా వచ్చిందో— వచ్చింది.

ఆ ప్రశ్నకు అందరూ సమాధానాలు చెప్పాలి, దాపరికం లేకుండా ! అబద్ధాలు చెప్పకూడదని అందరూ ఒట్లు వేసుకున్నారు.

ముందుగా బాలయోగి తనకోరికను వెల్లడించాడు... 'నాకు మంత్రదండం కావాలి !'

'ఎందుకు?' అన్నాడు చక్రపాణి.

'మంత్రదండం పై కెత్తి, గరీబీ హటావో అంటాను.' అందరూ పొట్ట చెక్కలయ్యేలా నవ్వారు.

'నీకేం కావా' లంటే, పట్టుపరికిణీ కావాలంది రోజా. బెల్లం కావాలన్నాడు రాజా.

'నీ కోరిక ఏమిటే అక్కా ?' అన్నాడు బాలయోగి ఆశా ప్రియతో.

'నేను చెప్పను పోరా!' అంది ఆశా ప్రియ.

'ఎందుకు చెప్పవు?' అన్నాడు చక్రపాణి.

'నాకు ఏ కోరికా లేదు.'

కోరికల్లేని మనుషు లుంటారా ప్రపంచంలో ? ఒట్టు ...న తరవాత అబద్ధాలాడొచ్చా ? అంది కుమారి.

'నాకు సిగ్గు !'

'సిగ్గెందుకూ? నువ్వేం పెళ్ళికూతురివా! చెప్పు చెప్పూ !'

'మీ రెవ్వరూ నవ్వకూడదు.'

'నవ్వితే అప్పు డడుగు.'

ఆశా ప్రియ తలొంచుకుని చెప్పింది. 'నేను చపలకుమార్‌ని పెళ్ళి చేసుకోవాలి.'

'చపల కుమార్ ఎవరు?'

'ప్రెసిడెంటు బసవరాజుగారి కొడుకు!' అంటూ చేతుల్లో ముఖం దాచుకుంది ఆశాప్రియ.

కంటనీరు తిరిగేలా పగలబడి నవ్వింది కుమారి. ఆ రోజు నవ్వినట్లుగా జీవితంలో ఆమె ఎప్పుడూ నవ్వలేదు. నవ్వులతో మెలికలు తిరిగిపోతూ, 'ప్రేమించావా?', 'అంత అందగాడా?', 'ఎప్పుడూ చెప్పలేదే?' అంటూ చెల్లెల్ని అల్లరి పట్టించింది. ఆ అల్లరికి ఆశా ప్రియ కంట్లో నీళ్ళు తిరిగింది.

ఆ పరిహాసాన్ని అంతటితో కట్టిపెట్టి 'ఇక నువ్వు కానీరా చక్రపాణీ !' అంది కుమారి.

వాడి ముఖంలో నవ్వు అంతర్ధానమైంది. జాలిగా ఆమె వైపు చూశాడు. చూపులు మరల్చుకున్నాడు. పళ్ళు కరచిపట్టి యిలా అన్నాడు: 'గునపం తీసుకుని శేషఫణిగాణ్ణి తరుముకుంటాను. వాడు కుంటుతూ కుంటుతూ పరిగెడతాడు. గునపంతో రెండో కాలు విరగ్గొడతాను. కిందపడతాడు. వాణ్ణి కాలితో తొక్కిపట్టి రొమ్ముల్లో గునపం దిగేసి, నెత్తురు తాగుతాను...'

కుమారి ముఖం పాలిపోయింది. పాలిపోయిన ముఖాన్ని ఆమె తలగడలో దాచుకొంది.

ఒక నిమిషం నిశ్శబ్దంగా గడిచింది. కుమారి ఉన్నట్లుండి పైకి లేచింది. తూలిపోతూ పెరట్లోకి పరుగెత్తి భళ్ళున వాంతి చేసుకొంది. వికారం తగ్గిన తరవాత చన్నీళ్ళతో ముఖం కడుక్కుని తిరిగివచ్చి గోడకు చేరగిలబడి కూర్చుంది.

'అక్కా! నీ కోరిక ఏమిటో చెప్పనేలేదు' అన్నాడు చక్రపాణి.

'నాకు బతకాలని వుంది తమ్ముడూ!' అంటూ కుమారి వాణ్ణి వాటేసుకుని బావురుమంది.

ఆ రోజు తరవాత కుమారి మళ్ళీ ఎప్పుడూ నవ్వలేదు. పగ లంతా ఎప్పుడూ ఏదో ఆలోచన! రాత్రుల్లో కళ్ళనిండా నీళ్ళు! నిద్రపోయేదికాదు. అన్నం తినేదికాదు. ఎవరితోనూ మాట్లాడేదికాదు.

ఓరోజు ఆమె గుండెలో గూడు కట్టుకొన్న దిగులు మబ్బుల్ని పారదోలుతూ సూర్యుడు ఉదయించాడు. కుమారి నిద్రలేవలేదు.

'నాకు బతకాలని వుంది తమ్ముడూ'అన్న కుమారి, బ్రతుకు చాలించింది.

బ్రతకాలన్న ఒకే ఒక కోరిక కూడా ఆమెకు మిగలకుండా చేసిన ఆ నిర్దయుడు ఎవడై వుంటాడు?

చీటికీ మాటికీ శేషఫణిని తిట్టిపోస్తుంటాడు చక్రపాణి. వాడిరక్తం కళ్ళజూస్తానంటూ వుంటాడు.

శ్రీ లక్ష్మీ ఫైనాన్స్ కార్పొరేషన్ మేనేజింగ్ పార్టనర్— శేషఫణి! అతడికి ఒక కాలు కుంటి. నలభై ఏళ్ళవాడు. వికారంగా వుంటాడు. అతడికి పెళ్ళాం వుంది. పిల్లల్లేరు. అక్కయ్య బ్రతుకులో నిప్పులుపోసింది వాడేనా ?

వాడే 'అయితే—

ఆ కుంటివాడు

ఆ నలభై ఏళ్ళవాడు

ఆ దిష్టిబొమ్మ

ఆ పెళ్ళాం వున్నవాడు

ఆ పశువు

కట్టుకున్న పెళ్ళానికి కడుపు చెయ్యలేని నపుంసకుడు

పెళ్ళికాని కన్నెపిల్లకు కడుపు చేసిన మగరాయడు

అక్కయ్యను ఎందుకు పెళ్ళి చేసుకోలేదు?

ఆమె కడుపులోవున్న కాయకోసమైనా పెళ్ళాడి, ఆమెను బ్రతకనిచ్చి వుండరాదూ ?

బిడ్డల్ని కనలేని గొడ్రాలే పెళ్ళామయినప్పుడు—కొంగు పరిచి కడుపు తెచ్చుకున్న కన్నెపిల్ల పెళ్ళాం కాలేకపోయిందా?

ఆశాప్రియ గుండె బరువెక్కింది.

పూలరంగడి పిలుపు ఆమె చెవుల్లో యింకా గింగురు మంటూనే వుంది.

'...రాత్రికి వస్తావ్ ?'

ఎందుకురా గుంటనక్కా? వచ్చి, నీ బులపాటం తీర్చటానికా? నీ ముచ్చట చెల్లించి, నీ ముచ్చటకోసమే నేను చచ్చిపోవటానికా? ఛీ, పో!

ఆశాప్రియ లేచి నిలబడి దభేలున కిటికీ తలుపులు మూసి కొక్కెం పెట్టింది.

(ఇంకా వుంది)

# ఋతు నర్తనం

## "సాంధ్యశ్రీ"

## 1

ప్రయోక్త : ఇది ఆమని. ఈ వసంతాగమనంతో అవని పులకించి పోతోంది. విరిసిన వనకాంత హృద్వీధిలో భృంగతతి ఝుంకారాలు, కోకిలల కలరవాలు మలయ పవనంతో కలిసి వినవస్తున్నవి. రాగధారల పంచు వసంత యామినిలో...అడిగో కవి కుమారుడేదో—అంటు న్నాడు...

కవి : కాలములోన హాసమును కానుక వెట్టిన ఓ వసంతమా
నీ లలితాకృతీ విభవనీల విశేష విలాసితావళుల్
మాలగ కట్టి నా మహిత మంగళ మానినికిన్ మనోజ్ఞతా
మాలతికిన్ గళమ్మున సమాహిత రీతిని వైచెదో—సఖీ...!

వసంత : నేనె...రాణినిగా! నే విరి బోణినిగా ·

[గేయం] చిరుగాలి హసనాల—సుమధూళి వసనాల
నటియించు భామగా—పులకించు పుడమిలో—
నా రాక ప్రతివాడ శోభలే కురియింప
నా కాలి చిరుఅందె చిగురులో రవళింప—
పుడమికి నిజమౌ నే తొలి కలగా
నిజమౌ ఆశలనే తొలినెలగా—
ఆమని నా పేరు—అవనియె నా ఊరు...

కవి : తొరగు ఆమని నీడ ధారుణి తొంగలించె; వసంత శ్రీ
కర రథంబుల రాగరంజిత కాంక్షలే మదినావహి
ల్లె! రసమాధురులంతరంగ విలేపనమ్ముల తీర్చె—ఈ
విరుల సౌరభ పూరమందున వీ వలుల్ తడిసెన్ సఖీ...!

## 2

ప్రయోక్త : అవనికి జరిగిన సీమంతానికి అర్కుడెందుకో అలిగి నట్లున్నాడు. చైత్ర మాసానురక్తి చిత్తమింకా వీడనే లేదు; ఇంతలో వెచ్చని వాయువుల అహస్కరుడు తూర్పునుండే సముద్యత్క్రోధా(మతాకుడై నట్లు...వినండి కవి మాటలు

కవి: పూలను చూచి కంటకపు పుంజము మర్చుజనాళికిన్—ఇదో
వేళకు నేనటంచు దిగె ;వేసవి ! చల్లనిరోజు లింక చె
ల్లెన్! లతకూనమై వడలె! లేత వెలుంగుల తోడవచ్చి; ఆ
భీల దవాగ్నితో కఠిన భీకర ఊష్మకరూప మొందగా !

గ్రీష్మము : మధుమాసపు సుధ త్రాగిన జనతా ఘనలలితా నిల

[గేయం] విలసిత యోగమ్మును పటు తరముగ పటుమాయము
చేయగ నే నర్తించెద...!
పుడమి పులకరింతలకు అవరోధము కల్పించగ
అతులితముగ నాదుశక్తి అవనిలో దీపించగ
'బీరెండల నర్తించెద...!
కీలాకోలాహల, హాలహల వహ్నిజ్వాల
కాలము గ్రీష్మజ్వలిత వసనమహా చూర్ణలీల
ఘలం ఘలం నర్తించెద...!

కవి : వేసవి డిండిమంబునకు వేసట కల్గినదేమొ! గాడ్పులా
వేశము తగ్గె! మానవ నివేదిత తాపము లాలకించెనో
ఆ సవితా ప్రభుండు...? జనులందరి సేదలు తీరగా, ఎవో
ప్రోషిత వాయువుల్ తిరిగి ప్రోవుగ కూడె నిలాతలమ్మునన్!

## 3

ప్రయోక్త : గాడ్పులు తగ్గినవి. వానమబ్బులు గగన వీధిలో ఎంత శోభను వెదజల్లుతున్నాయో ! చూడండి.

కవి : కృతపడి మేఘరాజములు కామినీ ఘనచాలన కుంతలా
కృతిగ నభమ్ము నందవిగో కూడుచున్నవి. భాస్కర పాటవ
క్షతమున ధారుణీ స్థలికి సాంత్వనమబ్బె! వినీల మేఘమా
ఋతు భర రాగమా! కదలు ఈ మహికిన్ జలదామృతమ్మిడన్!

వర్షము : ఉరుము మెరుపులతోడ—ఉత్సాహరవళితో

[గేయం] శక్రచాపముపైని చిందుత్రొక్కుచు నేను
వచ్చి చేరెద నిలకు చినుకు చినుకుగ నేడు
రాగ శీకర వృష్టి హరితాల రవళించ
నా రాక పులకింత పుడమిలో చిగురించ
వచ్చి చేరెద నిలకు చినుకు చినుకుగ నేడు
కర్షకావళి ఎడద హర్షముదయించంగ
తొలకరించెద నేను పులకించ భూమేను
వచ్చి చేరెద నిలకు చినుకు చినుకుగ నేడు... !

కవి: కురిసిన కాలమేఘముల కూటమి తేలె ! నభంబు నందవే
విరియుచునుండె శీత పవ విహ్వాతి వేళ నవాభ్ర తూలముల్

విరహిత నాయికోన్మదపు వీకన జారెడు పైటలట్లుగా
తెరలుచుమబ్బుతూలె! ఋతుతేజము శోభకు వీడియమ్మిడన్!

## 4

ప్రయోక్త : తెల్లని వెన్నెల గంధాన్ని శరీరానికి పూసుకొన్నట్లు శారద ఎలా వస్తోందో...?

కవి: ముగ్ధ మోహన శారదాశితి పూత వైభవశ్రేణు లీ
దిగ్దిశాంతములందు శోభల తీర్చె! తారకలే పయో
దిగ్ధ పాండుర పాదపుంజ వితీర్ణ ధూమపు తోరణాల్
స్నిగ్ధత న్నిడె! చలి వెన్నెల జిల్లులం దగిలెన్ సఖీ !

శరత్తు : లలిత జీవన రమ్య రాగరంజిత వేళ

(గేయం) శరదిందు చంద్రికను మైపూత చేయంగ
అరుదెంతు నిలకు, చలిగాలి చెలిమితో
విరహజీవుల్లోన విరజాజి పూవులో
వలపు వెన్నెలపాలు ఒలకబోయగ— నే
నరుదెంతు నిలకు, చలిగాలి చెలిమితో
నీలి గగనపు యేటి నీలాటి రేవులో
తెలిమబ్బు వలువలే ఆరవేయగ—నే
నరుదెంతు నిలకు, చలిగాలి చెలిమితో !

కవి : వర రాగ శీకరముతో
దరహాస విలసితహేమ తల్పంబు దిగన్
శరదిందు చంద్రికలలో
సిరిగంధ సుమచయ చారు శిల్పంబుడిగెన్ !

## 5

ప్రయోక్త : తెలి గంధాన్ని వదలి, మంచుగుడ్డ మేలిముసుగు వేసు కొని హేమమాలిని ధర కరగుదెంచింది. చలి చలిగా పుడమి...

కవి: తుహిన తుషార పుష్పముల తూర్యము హేమకుస్వాగతమ్మనన్
విహరణ సేయవచ్చె వినువీధులనుండి ఇలాతలమ్ముకున్
మహిత శుభాంగినీ ధవళమంగళ రసాగమ పాలిమై విలా
స, హిమిక బాలగా; మకర సంక్రమణోత్సవ దివ్యవేళకున్.

హేమ : చిగురించు చిత్తాన చలిగాలి నేతతో

(గేయం) తెలిమంచు వలిపాల వలెవాటు ధరియించి
నర్తింతు పృథివిలో—రమ్య విహృతికేళి
కొౌదమ వెలుగుల చిదిమి మంచుకుంచెలతోడ
తేనె వాకలు పారు తెలుగునేలల పొంగి
నర్తింతు పృథివిలో— రమ్య విహృతికేళి
మొగసాల ముగ్గులో—ముగ్గు గొబ్బిళ్లలో
గొబ్బిళ్ల గుమ్మడి—విరిమొగ్గలో
తళుకొత్త నవకాంతి నర్తింతు పృథివిలో !

కవి: హైమ శీతల గంధ మైవెలది

(మా.ఛం.) హేమంత వెడలిపోతు శిశిరా
నికీ ధర నప్పగించె! ముద ముద
యించు కాలమిక విశీర్ణ మవగ !

## 6

ప్రయోక్త : శ్లథ శైశిర పలాశములతో వృక్షములవియే, వెల వెలవోతూ!. ఈ చిత్తక్షోభకు సంకేతాక్షరమైన శిశిర ప్రాభవమెన్నాళ్లో కాని...

కవి: ముసురు శీతల వాయువుల్ బడి మూగవ్రతము జీర్ణమై
పసల కోల్పడి రాలెగా ధర! పాతకమ్మది మేమొగా
ని; సిరి సర్వము వీడ తా నొక నీడలేని నిరాశగా
కసిగె మోడుగ! భూజపుం దెశ గాంచ భగ్నత చిత్రమా!

శిశిరము : ఆకు పచ్చని మాకుల ఆకుకోకల ఒలిచివేసి

(గేయం) నగ్న దృశ్యము గాంచగా ఉద్విగ్నమా— నా ఎద
అందుకే నే వచ్చితి శిశిర ఘోషను తెచ్చితి
మంచి ఔనో—కాదొ, కాని పచ్చదనము చూడలేను
ఉన్న రెణ్ణాళ్ళీ ధరందున పెత్తనమ్మును చేయగా
అందుకే నే వచ్చితి, శిశిర—ఘోషను తెచ్చితి !
మధుర భావనయందున విధుర వీచిక లుంచగా
కలలు కనియెడు కంటిలో కంటి నీరంటియుండగ
అందుకే నే వచ్చితి శిశిరఘోషను తెచ్చితి !

కవి : చలిమంటల వేడితోడ శిశిరమ్మనకు

(మా. ఛం.) అప్పగింతల పాటలాలపించె. తెగిన
జీవన వీణ తీగెలు సవదరించి—స్వ
ర్ణ భావిని తలచి—చేయెత్తి పిలిచె జనత...!

# మంగళా శాసనం

కవి : కాలమనియెడు చిత్రకారుండు గీచినవి

(మా.ఛం.) ఆరు ఋతువుల శబల చిత్రాల వృత్త
నర్తనమ్మిది. ఋతువైభవ శ్రేణి దీప్త
లలర చక్రమాగక నిరతము తిరుగుచుండు !

పరమ మహితాత్మ జీవిత సరళియగుచు
ప్రవిమలోదాత్త జీవనపథము మలచె
క్రమ్మరి మనము కాల సైకతము నందు
మహిత చిహ్నములు నిలిపి మరల తగును.

శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రి

# అస్తిత్వవాద అసంబద్ధ సాహిత్యము

ఎవని యునికిని వాడు సార్థకము చేసికొనవలయును. సార్థకము చేసికొనుట యనగా నేమి? ఎవని ఆత్మీయ లక్షణమును బట్టి వాడు పోవుట. ఆత్మీయతా లక్షణమనగానేమి? కర్మఫలానుభోక్తృత్వము. ఇదొక్కటే పరమ సత్యము.

మనుష్యులున్నారు. సమాజమున్నది. మత తాత్త్విక రాజకీయాది వ్యవస్థలెన్నో సామాజిక వ్యవస్థయందున్నవి. ఇవన్నియు మనుష్యులు కల్పించినవి. కల్పించిన మనుష్యులు గతించినారు. ఆయా దేశకాలములయందు ఆయా పరిస్థితులలో తమ తమ యస్తిత్వములను తాము స్థాపించుకొనుటకు వారు వారు ఆయా వ్యవస్థలనట్లు కల్పించుకొన్నారు. దేశ కాల పరిస్థితులు మారి పోయిన మనుష్యులు మారిపోయిన మీదట—క్రొత్త దేశ కాల పరిస్థితులలో ఉన్న క్రొత్త మనుష్యుల యస్తిత్వమును స్థాపించుటకు కూడా అప్పుడు నెలకొల్పబడిన వ్యవస్థా ధర్మములే సమార్థములై యుండ గలవా అన్న ప్రశ్నలను తీవ్రముగా నాలోచించిన బుద్ధిమంతులకు సమాధానము ప్రతికూలముగా వచ్చినది. మరి మిగిలిన లోకమెట్లున్న దనియు వారు విచారింపగా అది ఆయా వ్యవస్థలు తన కనుకూలములుగా నున్నట్లే పోవుచున్నది. ఇంత లోకము తన యస్తిత్వమును గురించి తాను పట్టించుకొనకుండా గంగిరెద్దుకువలె పోవుచున్నది. దానినట్లు పోనీయక వివేకమును కల్గించి అస్తిత్వమునందు ప్రవృత్తిని ప్రతిష్ఠింపవలయునని అందుకనుకూలముగా విషయ విచారణ జరిగి జరుగుచున్న కొలదియు దానికి అస్తిత్వవాదమని—**EXISTENTIALISM**—పేరు ప్రసిద్ధికి వచ్చినది.

సజీవులయిన స్త్రీ పురుషుల నిత్యజీవిత మొక్కటే కలదు. అందఱి వారి ప్రవృత్తులన్నియును వారి సొంత విషయములు. ఎవరి ప్రవృత్తి వారిదే. ఎప్పటి ప్రవృత్తి అప్పటిదే. వారి యవసరములను అక్కరలను వారికొరకు కాక మఱెవరికొరకో ఏర్పాటైన వ్యవస్థా ధర్మములు తీర్చలేవు. మరియు వారి వారి ప్రవృత్తుల ధర్మాధర్మముల నిర్ణయమునకు వారి వారి అంతఃకరణ లక్షణమే లక్షణము కాని వ్యవస్థా ధర్మములు కావు. ఇట్లని అస్తిత్వవాదము మత తాత్త్విక సాంఘిక రాజకీయ వ్యవస్థా ధర్మములనుండి విడివడి వ్యక్తి తన అస్తిత్వమును తాను నిరూపించుకొన గలుగుటయే పరమార్థముగా ప్రతిపాదించుచున్నది. విడివడుట దగ్గరనే వ్యతిరేకించుట, ఘర్షణపడుట, తిరుగబడుట అని ఈ మొదలయిన అర్థములను చెప్పుచున్నారు. భౌతికశాస్త్ర విజ్ఞాన వ్యవస్థ కూడా మనిషి యొక్క ఆత్మవస్తువును గుర్తింపదు గనుక అస్తిత్వవాదమీ విజ్ఞానముకూడా మనిషి వ్యక్తిత్వ ప్రతీతికి దోహదము చేయుదని త్రోసిపారవేయు చున్నది. ఆత్మవస్తు వనగా వట్టి అంతఃకరణ ప్రవృత్తి. దానికదే ప్రమాణము. ఈ దృశమైన స్వాత్మబుద్ధి లక్షణమునందు అనన్య పరాయణ దృష్టి కలవాడు అస్తిత్వముకల వ్యక్తి. వానికి శాస్త్ర ప్రమాణము ప్రమాణమేకాదు. అస్తిత్వముకల వ్యక్తి జీవితము దాని వైలక్షణ్యము దానిదిగానుండును. అంతర్ముఖీనతయే దాని వైలక్షణ్యము. అంతర్ముఖుడైన వ్యక్తికి మునుముందీ జీవితమున కసలు అర్థము లేకపోవుట కన్పించి మరికొంత లోతుకు చూడగా మనస్సునకొక ఉద్విగ్నతయు తత్ఫలితముగా నొక నిరాశోపహతత్వమును సంభవించును. ఆ పరమ దీనావస్థనుండి ఆత్మవిశ్వాసమును పుంజుకొనుటయే వ్యక్తి తన అస్తిత్వమును తాను నిలబెట్టుకొనుట. ఆత్మచైతన్యమును ప్రజ్వలింపచేయగల మహాశక్తి పరమదైన్యమునందున్నది.

ఉన్నది నిజమే కానీ, దాని నంత సులభముగా పొందుట యెట్లు? అది ఇట్లని చూపించుటకే ఈ అస్తిత్వ వాదము అన్ని వ్యవస్థా ధర్మములను తొలగించినది. జనన మరణములు రెండే మానవ జీవితము కిద్దరిగానూ అద్దరిగానూ ఉన్నవి. ఇద్దరికిటుగానీ, అద్దరి కటుగానీ మనిషికనుభవముగా నేమియు తెలియదు. శాస్త్రములు ప్రమాణములుకావు. జనన మరణములు రెండును మన కాద్యంతములుగా నున్నవి కానీ మన ప్రమేయముతో లేవు. జననమైపోయినదిగనుక మనిషి కది యిక సమస్యకానేకాదు. రాబోవుచున్నది గనుక మరణమే సమస్య. అదియు కాదు. మనిషి తన ప్రయత్నముతో దాని నేమియు చేయలేడు. ఒకవేళ ఆత్మహత్యకు ప్రయత్నము చేయవచ్చునుగదా యన్నచో వచ్చును గానీ జీవితమునకు జనన మెట్లర్థముకాదో అట్లే మరణమును అర్థము కాదు. మరణమునందు దైన్యము లేదు గనుక దైన్యము ననుభవించుటకు జీవింపనే వలయును. జీవితము నాత్మశక్తిమయముగా చేసికొనుట చేత దైన్యమును పోగొట్టుకొనుట అస్తిత్వమును నిలబెట్టుకొనుట రెండును సంభవించు చున్నవి. అజ్ఞానమును జ్ఞానముచేత నివర్తింప జేసికొన్నట్లు. జనన మరణముల మధ్య మబ్బు మబ్బుగానున్న జీవితమునందొక ఉరుము ఉరుముట దైన్యము. ఒక మెరుపు మెరయుట అస్తిత్వము.

జనన మరణముల మధ్య మనిషికి తాను తప్ప మరొకఅండ మత దైవతముగాకానీ, సామాజిక రాజకీయ సిద్ధాంత ధర్మముగాగానీ ఏమీలేనప్పుడు తన ఆత్మను తానాశ్రయించి తన బుద్ధిని తాను నమ్మికొని తన కాళ్ళమీద తాను నిలబడి తన దోవను తాను పోవలసిన అనివార్య పరిస్థితి ఏర్పడినప్పుడు ఏది త్రోవ అన్న ప్రశ్నకు సమాధానము చెప్పుట కెవరును లేరు. తన బుద్ధియే తనకు చెప్పవల

యును. తన అస్తిత్వమును తానే చూచుకొనవలయును. ఆ విధముగా మనిషి తన ప్రకృతి ననుసరించి తనను తాను వ్యక్తీకరించుకొనును. వ్యక్తీకరించుకొనక వ్యవస్థాధర్మమునొకదాని నాశ్రయించి పోయినచో పరప్రత్యయనేయ బుద్ధియని యర్థము. వ్యక్తీకరణమే అస్తిత్వమునకు లక్షణము. అది అపరాధమగునా కాదా అన్నప్రశ్న లేనేలేదు. అది వానిచేత స్వయంకృత మగునా కాదా అన్న దొక్కటే ప్రశ్న. స్వయం కృతమగుచున్న దంతయును సుకృతము. సుకృతియే అస్తిత్వము గల వ్యక్తి.

అస్తిత్వముగల వ్యక్తులు (EXISTING INDIVIDWALS) ఎందరుండగలరు? ఎందరైననూ ఉండనచ్చును. అందరునూ కావచ్చును. కావచ్చునన్నంత సేపునూ ప్రక్కనే కాక పోనూవచ్చునన్న దుండనే యుండును. అన్ని వాదములతోపాటు ఆదర్శ వాదమునుకూడా అస్తిత్వ వాదము తిరస్కరించుచున్నది గనుక సరిపోయినదిగానీ లేనిచో ఇంతటి అస్తిత్వముగల వ్యక్తిని ఆదర్శ పురుషుడనుట కభ్యంతరమే మున్నది? పృథగస్తిత్వము తప్ప మనుష్యులయందు సాధారణ లక్షణములను అస్తిత్వవాదము పరిగణింపదు. మనుష్యులయొక్క ఏకార్థమునందు ప్రవృత్తిని కూడా ఇది సహింపదు. ఈ విధముగా మనిషిని ఏకాకిని చేసి వాని పూర్ణ లక్షణమునందు వాడు బ్రతుకుటను పరమార్థముగా ప్రతిపాదించుచున్న వాద మిది. ఏకాకీ, అనన్యుడూ, సర్వతంత్ర స్వతంత్రుడూ, స్వేచ్ఛా జీవీ, అంతఃకరణమునుబట్టి మాత్రమే పోవువాడూ, ఏ రూపముగానూ పరప్రత్యయనేయబుద్ధికానివాడూ అయిన మనిషి యొక్క వ్యక్తిత్వజీవితమునే అస్తిత్వవాద దృక్పథము అస్తిత్వముగా చెప్పను. పృథగస్తిత్వముయొక్క తీవ్రత యింతగా నున్నదిగనుకనే సామాజిక మానవతావాదముల కతీతముగా అస్తిత్వవాదము రూపు గట్టుకొన్నది.

మనవేదాంతమునందును మనిషియొక్క ఉనికికి కేంద్రస్థానము వాని ఆత్మలక్షణమే కదా! అది మనోబుద్ధ్యహంకారముల నతిశయించి ప్రకాశించెడు పరమ సత్త్వధార్థము. దాని అస్తిత్వమే అస్తిత్వము. ఆ యాత్మయే జీవుడనీ, జీవాత్మయే పరమాత్మయన్న తెలివిని వేదాంతము ప్రధానము చేయగా ఈ అస్తిత్వవాదము జీవాత్మయే యున్నది. అది తన వ్యక్తిత్వమును తాను సంపూర ముగా అనుభవింపవలయునన్న దానిని ప్రధానముచేసి చెప్పను. జీవో నాఽహమ్మని వేదాంతము చెప్పుచున్న దానిని తిరుగవేసి జీవోఽహమ్మన్నదే అస్తిత్వ లక్షణమని ఈ వాదము ప్రతిపాదించు చున్నది. ఈ ప్రతిపాదనమునందు బ్రహ్మోఽహమస్మి యన్నంత తీవ్రత యున్నది. ఈ పరిభాష కిక్కడ ప్రవృత్తి చాల పరిమితము. బాహ్యవస్తు వ్యవస్థాధర్మ నిరపేక్షముగా జీవాత్మయొక్క స్వయం నిర్ణయ ప్రకాశ లక్షణమే అస్తిత్వము. తనలో సర్వ భూతాలనూ, సర్వ భూతాలలో తననూ చూడగలుగుటను వేదాంతము ప్రశంసింపగా తనలో తనను తనకొరకున్నట్లు చూచుకొనగలుగుటను అస్తిత్వ వాదము పేర్కొనుచున్నది. ఇది చిట్ట చివరకు ''అహమేవాహం మాంజుహోమిస్వాహా'' వాదముగా కన్పించుచున్నది. మొత్తమునకు అంతఃకరణ ప్రవృత్తియే ప్రవృత్తి. అదే జీవితము. అదే అస్తిత్వము. అస్తిత్వమనగా అచ్చమైన కర్మఫలాను భవము. అదే సత్యము.

# II

పదునెనిమిది పందొమ్మిది శతాబ్దములలో— ఈ ప్రాపంచిక నిత్య జీవిత వ్యవహారములంత నసిగా కన్పించకపోయినందున బుద్ధిమంతుల యందు కలిగిన ఆలోచన సత్యజిజ్ఞాసాత్మకముగా కొనసాగి క్రొత్త క్రొత్త వాదములు బయలుదేరినవి. అందులో ఈ అస్తిత్వ వాదమును ఒకటి. దీని నెవరు కనిపెట్టినారనికాదు ఇది మొదట ప్రధానముగా ఎవరియందు కన్పించుటకు మొదలు పెట్టినదనగా కియెర్కుగార్డు (KIERKE GAARD) పేరును చెప్పుచున్నారు. ఇది తత్త్వ విచార ధారారూపము గనుక భగవంతునితో మతముతో వద్దన్ననూ సంబంధముండక తప్పదు.

ఆ కియెర్కు గార్డు క్రైస్తవుడు. భగవంతుడున్నాడు. ఆయన పంపించిన క్రీస్తును కలడు. వారిద్దరును ఏరూపమున ఎక్కడ కలరన్నది గార్డు జిజ్ఞాస. వారు నిరుపాధికులుగానున్నారు. అందువల్ల ఒకటిగానే యున్నారు. ఉన్నారని చూపించుటకు వీలు లేదు. వారి యునికిని అనుభవించుచు లేరని చెప్పట కుదరదు. అందువల్ల మనుష్యులయందనుభూతి రూపముగా భగవంతుడున్నాడు. మనుష్యజీవితమే అనుభవపరంపర. భగవంతుడు మనుష్యునకు తన జీవితమునకంటె భిన్నముగా లేడు. జీవితమనగా మనోవాక్కాయములతో ప్రవర్తించుట. పరిశుద్ధ లక్షణముచేత నది భగవన్మయము. భగవన్మయత్వమే మనిషియొక్క అస్తిత్వము. మనిషి అస్తిత్వమునుబట్టి వాని వ్యక్తిత్వము రూపుగట్టుకొనును. మనిషి తనలోని తన భగవ లక్షణముయొక్క అన్వేషణమే జీవితముగా జీవించుటయే అస్తిత్వము. అస్తిత్వముగల వ్యక్తి యనగా నట్టివాడు. తాదృశమైన వ్యక్తిత్వమును రూపుగట్టుకొననీయని మత, సాంఘిక, రాజకీయాది వ్యవస్థా ధర్మ సమస్తమును అస్తిత్వముగల వ్యక్తి తన స్వాత్మ ప్రబోధము ననుసరించి త్రోసి రాజనవలయును. స్వాత్మ ప్రబోధ లక్షణమే మత ప్రతిపాదితమైన భగవల్లక్షణముకాని భగవలక్షణము. ఆ విధముగా మనిషి తనకు తానభిముఖుడై అంతర్ముఖీనమైన బ్రతుకు బ్రతుకుటయే అస్తిత్వము. ఇది గార్డు జిజ్ఞాసావాదము. [1]

కియెర్కు గార్డుకు చివర పది సంవత్సరాలు సమకాలికుడుగా పుట్టిన నీట్షే ఈ అస్తిత్వవాద దృక్పథమును తాను పునరాలోచించుచు ఇరువదియ శతాబ్దమున కందిచ్చినాడు. ఈయన మనిషి యందు సంకల్పశక్తి నొకదానిని గుర్తించినాడు. మనిషి తన మనో వాక్కాయ కర్మలచేత, తన స్వయం నిర్ణయాధికారముచేత, తన స్వయం సంకల్పముచేత, తన జీవితమునకు ఒక విలువను ఒక అర్థమును సమకూర్చుకొనుటను అస్తిత్వముగా ప్రతిపాదించినాడు. కియెర్కు గార్డు వాదమునందు కన్పించని పురుషకార లక్షణమొకటి స్పష్టముగా నీట్షే వాదమునందు కన్పించు చున్నది.

సంకల్పము తదనుగుణమైన సాధన ఈ రెండును మనిషి అస్తిత్వము నకు మూలము. అంతఃకరణమునందలి స్వయం ప్రేరణ మొక్కటే సంకల్పకారణము. అట్లు వ్యక్తి ధర్మముననుసరించియే వ్యక్తి పోవలయునుగానీ బాహ్య వస్తు వ్యవస్థా ధర్మముల ననుసరించి పోరాదన్న సూత్రముండనే యున్నది. [2]

ఈ ఇరవదియ శతాబ్దమున తమ అస్తిత్వవాద దృక్పథము చేత సాహిత్యమును మిక్కిలిగా ప్రభావితము చేసిన మేధావులలో ఇద్దరిని ప్రధానముగా చెప్పవలయును. ఇద్దరికీ నోబెల్ బహుమతి ప్రకటింపబడినది. ఒకాయన బహుమతి నందుకొన్నాడు. మరొకాయన నాకు వద్దన్నాడు. అందుకొన్నది ఆల్బర్టు కేమూస్ (ALBERT CAMUS—1957లో) వద్దన్నది జీన్‌పాల్ సాత్రే. (JEAN PAUL SARTRE—)

ఆల్బర్టు కేమూస్‌లోని అస్తిత్వ విచారణ శీలముమీద ఫాసిస్టు జర్మనీ దురాక్రమణకు గురియైన, ప్రతి సామాజిక వ్యవస్థా ధర్మము కూడా దాని లక్షణమును కోల్పోయిన, అన్ని విధాలా చిన్నాభిన్నమైన, అస్తవ్యస్తమునూ, ఎటుచూచినా అసంబద్ధమునూ అయిన ఫ్రాన్సు జీవిత ప్రభావము ప్రధానముగా నున్నది. మనిషికి బ్రతుకుమీద ఆశ నశించి, బంధుమిత్రులమీద ప్రేమాభిమానాలు ఇంకిపోయి, కర్తవ్యము విషయమున మౌఢ్యము ప్రబలమై నిరాశా నిస్పృహలతో చచ్చేదాకా బ్రతుకుటయే జీవితముగానైన పరిస్థితులు మేధావులనూ, రచయితలనూ కలవరపెట్టక మానవు. మనిషి తన జీవితానికి తాను పరాయివాడుగానూ, ప్రవాసితుడుగానూ అయిపోవుచున్న వైనము నాయన చూచినాడు. ఈ జగత్తు ఇంత అసంబద్ధముగానూ ఉండుటకు వీలున్నదన్న సత్యమాయనకు ప్రతీతికి వచ్చినది. జీవునకూ వాని జీవితమునకూ సంబంధము లేకపోవుట నటునకూ నాట్యమునకూ సంబంధము లేకపోవుట వంటిది. వట్టి రసాభాస వ్యవహారము. అసంబద్ధత యనగా అది [3]. ఆయా జీవుల మనోవ్యథాభర వివశత్వ ప్రవృత్తిచేత జీవితము లసంబద్ధములుగా తయారగును. జీవిత పరమార్థమే అసంబద్ధత యన్నంతవరకూ కేమూసుపోయినాడు. అట్లు జీవిత పరమార్థమును చిత్రించెడు సాహిత్యము అసంబద్ధ సాహిత్యము. ఈ పేరు పెట్టుకొని నాటక సాహిత్యమూ, నవలా సాహిత్యమూ యూరోపియను భాషల యందెక్కువగానే వచ్చినది. మానవజన్మము యొక్క మహనీయ లక్షణమును జారిపోయిన దానిని చక్కదిద్దుటకు ఆల్బర్టుకేమూసు జీవుల మనోవ్యథాభరవివశత్వములను ( anguished and absurd ) తాత్త్విక విచారణకు పెట్టి రచనలు చేయుటచేత ఆ తరువాతివారికాయన అస్తిత్వవాద సాహిత్య నిర్మాతలలో అగ్రగణ్యుడైనాడు. అసంబద్ధ సాహిత్యమునకు పరమార్థము అస్తిత్వ నిరూపణము. ఈ జాగ్రత్ప్రవృత్తి ఎంత అసంబద్ధముగా నున్నను మనిషి తన అస్తిత్వమును గూర్చిన తెలివిని తాను పొందినప్పుడు తదనుగుణముగా జీవితమునందలి అసంబద్ధతా లక్షణములను కనీస స్థితికి దింపగలడు. అస్తిత్వమును గూర్చిన తెలివికి మృత్యువు ముఖము నందు విశ్వము పరిసమాప్తిని పొందుచున్నదనియు, జనన మరణముల మధ్య జగత్తుతో పొత్తు పొసగని అనుభవ పరంపరగా జీవితము సాగుచున్నదనియు, మనిషి గుర్తించి జగద్వ్యవస్థా ధర్మము నటుంచి ఆత్మధర్మ వ్యవస్థకు అస్తిత్వమును సాధన చేయవలయుననియు, దానికి మూలబలముగా మృత్యువు తప్పించుకొన రానిదన్న గట్టి నమ్మకముండవలయుననియు, ఆ పరిస్థితిలో తన అసంబద్ధ జీవితమునకు మూలముగానున్న తన మనోవ్యథలు తన పొత్తును సహింపని జగద్వ్యాపార వ్యవస్థ తనకు తెలియకుండ తనకంట గట్టినదన్న దృఢవిశ్వాసముతో జగత్తును తృణీకరించుటద్వారా మృత్యువెట్లును తప్పదు కనుక తనకు మిగిలిన తనను ఆ లోపల వ్యక్తీకరించుకొనుట యొక్కటే చేయదగినదిగా నెరిగి ప్రవర్తించుటయే మార్గముగా ఆల్బర్టు కేమూసు ఆలోచించినాడు. [4]

ఇరువదియ శతాబ్దము బహుదేశముల బహుభాషల బహువిధముల భగవంతుని యునికిని ప్రశ్నార్థమునకు మార్చి లేమిని సమాధానముగా చూపించినది. జీన్‌పాల్ సాత్రే మొదలయిన అస్తిత్వవాదులా విషయమున అభినివేశముతో ప్రవర్తించి మానవ జీవితము యొక్క అసహాయతను భయవిహ్వలత్వమును చూపించి అసహాయ శూరతను అస్తిత్వ లక్షణముగా చెప్పిరి.

భగవత్సాక్షాత్కారమును పొందుట యొక్కటే వ్యక్తి అస్తిత్వమునకు నిదర్శనమనీ, అందుకు ప్రతిబంధకముగా నున్నది విధి—మృత్యువు; శూన్యము—నిరర్థకత; పాపము—శిక్ష—ఈ మూడు ద్వంద్వములను గూర్చిన అనవగాహన యొక్కటేయనీ, దానికి విరుగుడు అజ్ఞానమునకు జ్ఞానమునువలె సదవగాహనయేయనీ, అందువలన నయ్యెడు భగవత్సాక్షాత్కారము స్వానుభవ విషయమనీ, అది అతిమానసమూ అనిర్వచనీయమూ అనీ, మనిషి శాస్త్రముమీద విశ్వాసము కలిగి స్వస్వరూపాను సంధానముచేత ధైర్యమును పొంది విజ్ఞాన మార్గమున విహరించుటయే అస్తిత్వమనీ పాల్ టిల్లిచ్ వాదమును [5] పూర్తి పురుషకార లక్షణమునకు దైవానుకూల్యమును భావించు వాదముగా చెప్పవచ్చును.

కియెర్కు గార్డు అంతర్ముఖీన లక్షణముగల నివృత్తి మార్గముగా ప్రతిపాదించిన దానిని నీట్‌షే బహిర్ముఖముగా ప్రవృత్తికి తిప్పి పురుషకారమును పైకితెచ్చి మాట్లాడినాడు. దైవము నసలే తక్కువచేసి సంకల్పమును ప్రధానముగా చెప్పిన సాత్రే వాదము సామాజికులయందు "తనలో తాను" "తనకు తాను" "ఇతరుల కొరకు తాను" అని మూడు పొరలుగా అస్తిత్వమును అనివార్యముగా చూపుటలోని ఆంతర్యము నింకను విచారింపవలయును. ఈ యందరలో దైవమానుషములకు సమప్రాధాన్యమిచ్చి ఆలోచించిన పాల్‌టిల్లిచ్ వాదమును కూడా నిదానముగా వినవలయును.

# III

రెండవ ప్రపంచ యుద్ధానంతర కాలమున క్రమక్రమముగా ఈ అస్తిత్వవాదము తన అసంబద్ధతా లక్షణముచేత సంప్రదాయ లక్షణములయిన సాహితీ సంస్కృతుల మూలతత్వములనూ, విలువ

లనూ, విశ్వాసములనూ కూలగొట్టుటకు కంకణము కట్టుకొని బయలుదేరినదా అన్నట్లు పరిణమించినది. నెమ్మది నెమ్మదిగా ధర్మమూ, విజ్ఞానమూ, కట్టుబాటూ ఈ మొదలయిన నాగరక లక్షణములనుండి మనిషి కావలయునని వైదొలగుటకు ప్రేరణ గానూ, వత్తాసిగానూ ఈ అసంబద్ధ సాహిత్యము ప్రపంచ భాషల యందభివృద్ధి యగుచున్నదనీ చెప్పవలయును.

ఎవని జీవిత సత్యము వానికి పరమార్థమనీ దాని నిరూపణము నకే సాహిత్యము ప్రయత్నము చేయవలయుననుటయు, ఆ జీవిత రహస్యములకు జనిస్థానములను వారి వారి ప్రకృతులయందే అను ప్రవేశించి గుర్తింపవలయుననుటయు, జీవితమనగా భయము, ద్వేషము, ఆందోళన, అవిశ్వాసము, అవినీతి, అధర్మమూ—ఇవే అన్నట్లు చెప్పి మనిషిని సమాజమునుండి వేరుచేసి తీసికొనిపోయి, వానిని చూచి వానికే గుండెలు పగులునట్లుచేసి చూపుటయే విధానముగానున్న ఈ అసంబద్ధ సాహిత్యము జీవితమునకు దర్పణ పట్టు చున్నదనుట నిజమేయైనను భయావహముగా నున్నది. మొత్తము మీద చూడగా ఈ వ్యవహారము నైతిక సాంఘిక ధర్మ నిర్ణయ ధోరణి విమర్శనమును కాదని ప్రక్కకుపెట్టి, మనస్తత్త్వ విజ్ఞాన విమర్శనముగా బయలుదేరి దానిని మించి స్వరూపకళా (FORMALISTIC) విమర్శన ధోరణి కనుకూలముగా ఈ సాహిత్యము పోవు చున్నట్లున్నది. మరియు నొకవిధముగా కామక్రోధాది ప్రకృతి సిద్ధము లయిన పాశవిక ప్రవృత్తులతోడి వ్యక్తులను నిర్దోషులని చెప్పెడు ఫ్రాయిడ్ మతమునకును ఈ అస్తిత్వవాద అసంబద్ధ సాహిత్యము నిదర్శనముగా నున్నది. మృత్యువును పెద్దగాచేసి భయాందోళనము లను కల్పించి, హాస్యాస్పదములుగా నిరూపించి, పశుమనః ప్రవృత్తుల చేత మానవతను పరమ రాక్షసముగా ప్రదర్శించుటయు, మనిషిని సంఘమునుండి, చరిత్ర ప్రభావమునుండి తొలగదీసి వాని ప్రకృతి ననుసరించి వానిని విచారింపవలయు ననుటయు ఇవన్నియు ఈ అసంబద్ధ సాహిత్య నిర్మాణ శిల్ప మర్మములుగా గ్రహింపవలయును. మరియు ఈ యన్నింటికిని తోడుగా ఈ సాహిత్యము చైతన్య స్రవంతి రచనా లక్షణ లక్షితముగా నుండుననియు చెప్పచున్నారు. పందొమ్మిది ఇరువది శతాబ్దములలో కళాసాహిత్య రంగములయందు యూరపుఖండ దేశములు బయలు దేరతీసిన వ్యక్తీకరణ వైచిత్రి వాదము, అధివాస్తవికతా వాదము, ప్రతీకవాదము, ప్రయోగవాదము, నిరాశావాదము, అహంభావవాదము ఈ మొదలయిన చిత్రవిచిత్ర ధోరణుల అంశలన్నియును కొద్దిగానో, గొప్పగానో ఈ అస్తిత్వవాద అసంబద్ధ సాహిత్యమున చోటు చేసికొని యున్నవి. తాము అస్తిత్వ వాద పక్షము వారుగా ముఖ్యముగా నాటకములు వ్రాయుచున్న ఫ్రెంచి ఇంగ్లీషు అమెరికను భాషా రచయితల రచనలన్నియును అసంబద్ధ సాహిత్యముగానే ప్రసిద్ధములుగా నున్నవి.

జర్మను వ్యక్తీకరణ వైచిత్రివాదము (EXPRESSIONISM) ప్రభావము ఈ శతాబ్దపు కళాసాహిత్యాలమీద రకరకాలుగా పడి అంతకు ముందునుండియున్న ఆచార వ్యవహార సంప్రదాయా లన్నింటినీ తల్లక్రిందులు చేసినది [6]. అన్ని అస్పష్టతలకూ, అన్ని అవలక్షణాలకూ అదే మూలము. ఆ విధముగా ప్రయోగవాదము యొక్క పుట్టుకకునూ అది దోహదము చేసినది. అసలీ వ్యక్తీకరణ వైచిత్రివాదమునకు ప్రేరణ నిచ్చినది అస్తిత్వవాద ప్రవక్తలలో నొక ప్రముఖుడుగా చెప్పబడుచున్న నీట్షే. (NIETZSCHE)

ఈ వాదము వారి దృష్టిలో ఈ ప్రపంచ పరిస్థితులన్ని యును మనిషిపట్ల నిష్కరుణముగా ప్రవర్తించి వాని అస్తిత్వ మును హాస్యాస్పదము చేయుచున్నవి. మనిషి తన వ్యక్తిత్వమును తాను నిలబెట్టుకొను ప్రయత్న మేమాత్రము చేసినను ఈ దుర్మార్గ ప్రపంచము ఆ ప్రయత్నమును వమ్ముచేసి వానిని నవ్వులపాలు చేయక ఊరుకొనదు. ఈ కరుణ భయానక తత్త్వాలను సన్నివేశ కల్పనముగా, పాత్రల మనస్తత్త్వ చిత్రణముగా, వారి వారి ఆంగిక వాచిక ప్రవృత్తుల నిరూపణమువల్ల అంతశ్చేతనా వైచిత్రిని ప్రదర్శించుటగా మొత్తముమీద విలక్షణముగా సాహిత్యమునకు విషయములుగా చేసి ప్రపంచ విద్వేషమును ప్రతిపాదించుటనుండి అసంబద్ధ సాహిత్యము ప్రారంభమగుచున్నది. ఇందులో పాత్రలయిన మనుష్యులు ఉత్సవవిగ్రహాలకువలె ఎవరో కదిలించగా కదులు చున్నట్లు ఏ ఉద్దేశ్యములును లేనివారివలె ప్రవర్తించుట, వారి మాటలు అర్థరహితముగా, వట్టి వాగుడుగా నుండుట—ఆ ప్రవర్తనా ఈ మాటలూ రెండూ అర్థముకాక సామాజికు లిది యేమని అయోమయములో పడుట ఈ సాహిత్యకారుల ఉద్దేశ్యము. సాహిత్యము ఆనందించుటకు కాదు. ఆలోచించుటకని సామాజికులు తెలిసికొనుట వ్యక్తీకరణ వైచిత్రివాద తాత్పర్యము. కనీసము తాత్పర్యములలో నొకటి. తను తాత్పర్య మీడేరుటకు సాహిత్య ప్రక్రియలయందు అసంబద్ధతనే కల్పింపవలయును అప్పుడుగాని సామాజికు లిదేమిట్రా యని నిలబడి ఆలోచించరన్న ఉద్దేశ్యముతోనే అసంబద్ధ సాహిత్య రచన మొదలయినది. ఇట్లసంబద్ధతను సాహిత్య గుణముగా మార్టిన్ ఎస్లిన్ (MARTIN ESSLIN) నిరూపించుచు గ్రంథమును వ్రాసి సిద్ధాంతమును చేసెను. [7]

సాహిత్య ప్రక్రియ అది యేదైననూ దాని లక్షణము లక్షణమే కాదు. కథేతివృత్త నిర్మాణముతో ఇక్కడ పనేలేదు. పరిస్థితులు వ్యక్తులు వేష భాషా ప్రవృత్తులు ఇవే ప్రధానము. ఇక్కడి ఈ వ్యక్తులు మరేవేవో అర్థాలకు చూపుడు వ్రేళ్లుకాని అంతకంటే మరేమీకాదు. అందువల్లనే మాటల్లోనూ, చేతల్లోనూ అర్థము లేకపోవుటా, అసందర్భముగా కన్పించుట. ఇదంతయును ఇక్కడ రచనా శిల్పము. అందువల్ల అవి తా మేయే అర్థాలకు ప్రతీకలుగా ఉన్నవో ఆయా అర్థాల వస్తుస్థితి లక్షణమును ప్రతీతికి తీసికొని రాగలుగుచున్నవి. ఈ సాహిత్యమునకు సమకాలీన సమాజ జీవితము నందలి ఒక్కొక్క క్రొత్త కోణమును ఒక్కొక్కసారి నట్టు తెగ గొట్టుచు దున్నుటయే ప్రధానము. అది క్రొత్తకోణమనిపించుటయే ముఖ్యము. విలక్షణ ప్రకృతి భావాలకు ఒకచోట సమావేశమే అసంబద్ధము. అట్లు సమావేశ పరచగలుగుటయే రచయిత పనితనము. ఈ పనితనముయొక్క పరమార్థ మేమనగా ఆలోచనగల వారిముందు మానవ జీవితములోని ఒక క్రొత్త కోణము సమస్యను ప్రదర్శించి

చక్కగా పరీక్షకు నిలబెట్టుట. ఎటు తీర్పుచెప్పవలయునో ఆలోచన గల వాడాలోచింప వలసిన పరిస్థితి కల్పించుట. పైకి ఎంత అసం బద్ధమో లోపల అంత సంబద్ధము. దీనిని లోనారసి మేలనవల యును. పైన జూచినచో వట్టి గోల. జీవితము నెంత విలక్షణ ముగా ప్రదర్శించిన అది అంతగా అసంబద్ధ సాహిత్యమునందు మేలు బంతి.

మొత్తముమీద కథేతివృత్తమునకు ప్రాధాన్యములేని, పాత్రలు వాస్తవికముకాని, భాషావ్యవహారము గాసట బీసటయైన, పరిహాస పరివేదనములు కలిసిపోవుచున్న, ఆనందించుటకుకాక సామాజికులకు ఆలోచించుటకు ప్రేరకముగానున్న, మనిషి అంతశ్చేతన యందున్న చైతన్య స్రవంతి గతి విశేషాలను ప్రదర్శించు సాహిత్యము అసంబద్ధ సాహిత్యము. పరిస్థితుల చేతిలో మానవ జీవిత పరమార్థ తత్వ మును వ్యాఖ్యానమునకు సిద్ధము చేయుటయే దాని ప్రయోజనము. ఆ పరమార్థతత్వమునకు ప్రాతినిధ్యము వహించి నిలబడగలిగినవాడే అస్తిత్వముగల వ్యక్తి. ఈ విధముగా అసంబద్ధతాస్తిత్వములు కలిసిపోవుచుండుటయే లక్షణముగా నున్నది.

పందొమ్మిదవ శతాబ్దము చివరలో భగవంతుడు చచ్చిపోయి నాడని నీట్‌షే పెట్టిన కేక చాలమందికి నిజముగానే వినిపించినది. దానితో స్వర్గ నరకాలు పోయినవి. ధర్మా ధర్మములు పోయినవి. మంచిచెడ్డలు పోయినవి. నీతి నియమాలు పోయినవి. అన్నియును పోయిన పరిస్థితులలో మానవుని అంతస్సత్వము దానంతటది దాని కొరకది సముదాత్తమైనదని అట్లుండుటయే దాని అస్తిత్వమునకు లక్షణమని నిరూపించుచు బయలుదేరిన సాహిత్యము పరిస్థితులే వ్యవస్థకును సంబద్ధములుగాలేవు గనుక అసంబద్ధతనూ, అన్నీ పోయిన తరువాత కూడా మనిషి ఉన్నాడు గనుక అస్తిత్వమును జోడించుకొని పోవుచున్నది. అటువంటి పరిస్థితులలో అస్తిత్వ మెంత కష్టమో ఈ సాహిత్యము ప్రదర్శించుచున్నది. ఈ అసంబద్ధ వాతావరణ మొక్కొక్క దేశములో ఒక్కొక్క విధముగా నున్నది. అమెరికాలో అసంబద్ధ వాతావరణము నీగ్రో జీవిత సమస్యాకోణములను ఆవరించుకొని యున్నది. మరొక దేశములో మరొక విధముగా నుండవచ్చును. ఏమైననూ మనిషి మనుగడకూ, వాని అస్తిత్వమునకూ భంగము రాకూడదనియూ, వచ్చుచున్నప్పుడు నాగరకతా లక్షణములని నీతిని, ధర్మమును, దైవమును నమ్ముకొని కట్టుబాట్లకు లోబడి యుండక మనిషి కావలయునని తిరుగ బడుటద్వారా వైదొలగి తన అస్తిత్వమును తాను తన ఆత్మ చైతన్యముద్వారా నిరూపణముచేసికొనవలయునన్న పరమార్థమునకు ప్రేరణగానూ వత్తాసిగానూ ఈ అసంబద్ధ అస్తిత్వవాద సాహిత్యము నడచుచున్నది.

# IV

వ్యక్తియొక్క అస్థిత్వ వైశిష్ట్య మెప్పుడును కలదు. ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః [8] — ఈ ప్రమాణమును ప్రమాణము చేయుటచేతనే కదా విశ్వ వ్యాప్తిని పొందిన మహనీయ నాటక మొకటి భారతీయ సాహిత్యమునందు వెలసినది! అంతవరకు నిజమే కానీ కాళిదాసుకు అస్తిత్వవాద దృక్పథము లేదు. ఉన్నచో వ్యవస్థా ధర్మములతో సంఘర్షణకు దిగి దుష్యంతుడు తన అస్తిత్వ నిరూపణముకొరకు తిరుగుబాటు చేసియుండెడువాడు. అట్లుకాక కాళిదాసు దుష్యంతుని వ్యక్తి నిర్ణయమును వానికి తెలియకయే అది వ్యవస్థాధర్మమున కనుకూలముగా నుండునట్లు కల్పించినాడు. ధర్మార్థ కామమోక్షస్థితి రూపమైన వ్యవస్థాధర్మమునకు లోబడి నిర్వహించుకొనిపోయిన వారినే అస్తిత్వముగల వ్యక్తులుగా, ఆదర్శ పురుషులుగా అప్పుడనుకొన్నారు. బాధ్యతా నిజాయితీ ఆత్మపరీక్ష ఇవి మనుష్యులయం దెప్పుడును కీలకగుణములే. అందుకనేకదా అప్పుడు దుష్యంతుడు తన మనస్సునకున్న ఆర్య లక్షణమును చూచుకొన్నది! ఆ మీదట కదా తన సత్పురుష లక్షణము తనయం దుండియే తాను ప్రవర్తించుచున్న ట్లాయన నచ్చ చెప్పుకొన్నది! ఈ విధముగా వ్యక్తి తనతో తాను సమాధానపడిపోవుట వరకు నిస్సంశయముగా అస్తిత్వ వాదమే. వ్యవస్థతో సంఘర్షణ మప్ప దుద్దేశ్యముకాదు గనుక దానినింత పెద్దచేసి అదే జీవితముగా వ్రాయలేదు. మరియు దుష్యంతుడు శకుంతలను చూచినాడు. వెంటనే వానికి కణ్వమహర్షి 'అసాధుదర్శి'గా కన్పించినాడు. అదొక అనుభవము. కుసుమ మివ పినద్ధం పాండు పత్రోదరేణ—సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం — కుసుమ మివ లోభనీయం యౌవన మంగేషు సన్నద్ధమ్—ఇదంతయు నొక అనుభూతి పరం పర శకుంతలను చుట్టుకొని కలిగినది. ఇంతవరకు ఈ యను భూతిలో చిత్తశుద్ధిని శంకింపవలసిన దేమియునులేదు. శకుంతలను గూర్చి ప్రియంవద అనసూయతో ఈమెకు ఆత్మ మనోనురూపుడైన వరుని పొందవలయునని యున్నదన్న వాక్యార్థము దుష్యంతుని చిత్తశుద్ధిగల యనుభూతి ప్రవాహము నడ్డగించినది. శకుంతల మనోరథము దుర్లభముగా ననిపించినది. ఎందుకనగా బ్రాహ్మణు లలో అట్టివాడుండడు. ఇక్కడ వ్యక్తిధర్మమునకు వ్యవస్థా ధర్మముతో సంఘర్షణ. దానిని కొనసాగింపక వెంటనే వ్యవస్థా ధర్మములోని మరొక పాయను పట్టుకొని కులపతికీమె అసవర్ణ క్షేత్రమునందు కలిగియుండును ఇక సంశయములేదు ఈమె క్షత్ర పరిగ్రహక్షమ అని నిర్ణయమునకువచ్చినట్లు చెప్పుటచేత వ్యవస్థా ధర్మమును వ్యతిరేకింపకుండగనే దుష్యంతుని యందు వ్యక్తిఅస్తిత్వ వైశిష్ట్యమును ముఖ్యముగా చూపించినట్లైనది. వ్యవస్థాధర్మము మీద తిరుగుబాటు చేయుటనే అస్థిత్వవాదమునకు ముఖ్యముగా చెప్పక వ్యవస్థాధర్మముయొక్క విశ్వ శ్రేయోలక్షణమునందు బద్ధా దర బుద్ధితో ప్రవర్తించెడు వ్యక్తి వైశిష్ట్య అస్తిత్వము చెప్పి నప్పుడు కాదనవలసినదుండదు. కాన ఇప్పటి ఈ అస్థిత్వవాద అసంబద్ధ సాహిత్యమునందు వ్యవస్థమీద తిరుగుబాటు ఒక్కటే ముఖ్యముగా నన్నది గనుక ఈ వాదమును కాళిదాసాదుల వద్దకు తీసికొనిపోరాదు.

భగవద్గీతవద్ద కసలే తీసికొని పోరాదు. [9] వ్యవస్థా ధర్మ మును త్రోసి రాజని వ్యక్తి ధర్మము ప్రవర్తించుటను గీతాకారుని మతముగా చెప్పరాదు. స్వధర్మమును శ్రీకృష్ణుడు ప్రబోధించిన

మాట నిజమే కాని—అది ఇప్పుడు మన మనుకొనుచున్నట్లు వ్యక్తి ధర్మము కాదు. అట్లే ఆయన చెప్పిన పరధర్మము మన వ్యవస్థా ధర్మము కాదు. గీతాకారుడు పేర్కొనిన శ్రేయోదాయకమైన స్వధర్మమును భయావహమైన పరధర్మమును రెండును వ్యక్తుల ఇష్టానిష్టములతోనూ, అనుకూల ప్రతికూలములతోనూ, రాగ ద్వేషములతోనూ సంబంధముకలవికావు. అనుష్టింపదగినవియు కావు. ఆ శ్లోకమునకు దగ్గరగా భారతమునందొక పద్యమున్నది. ఆ పద్యముచేత ధర్మరాజు విషయమున ప్రబోధింపబడిన ఆత్మ కులార్హ కర్మ సంసేవన తత్పరత్వమే అక్కడ ఆ శ్లోకముచేత అర్జునుని విషయమునను ప్రబోధింపబడినది. అర్జునుడు యుద్ధము చేయుటయు, ధర్మరాజు రాజ్యము చేయుటయు రెండును కులధర్మములే. కులమనగా వ్యవస్థయేకదా! వ్యవస్థ ఎవరికి ఏ ధర్మమును ఏర్పాటుచేసినదో వారికి అది స్వధర్మము. వ్యవస్థచేత తనకు నిర్దేశింపబడని ధర్మమంతయు వ్యక్తికి పరధర్మము. ఇది భయావహము. అది శ్రేయోదాయకము.

మన మనుకొనుచున్నట్లు విచారించినచో వ్యక్తి వైశిష్ట్య నిరూపకమైన ఆత్మధర్మము అర్జునుని యందప్పుడు యుద్ధము చేయవద్దనికదా చెప్పుచున్నది. అది స్వధర్మము కావలయును: అదే శ్రేయోదాయకమన్న అభిప్రాయము శ్రీకృష్ణునకున్నచో ఇంత భగవద్గీత ఎందుకు? అసలు సంగతి యేమనగా వ్యవస్థా ధర్మమునకు వ్యక్తి బద్ధుడైపోవలయును. వ్యక్తికి స్వధర్మ పరధర్మములను వ్యవస్థయే నిర్ణయించును. ఈ నిర్ణయము లెందుకనగా వ్యక్తుల ప్రకృతు లెప్పుడెట్లు పనిచేయునో ఎవరికిని తెలియదు. అవి రాగ ద్వేషముల నెట్లు కల్పించుకొనునో చెప్పుట కష్టము. ఆ యీ పరిస్థితులను తట్టుకొనుటకు వ్యవస్థా ధర్మమును వ్యక్తులే సిద్ధము చేసినారు. అదంతయు ప్రకృతి. ఇదంతయు పురుషకారము. దీనికి శాస్త్రమనియు పేరు. స్వధర్మమునందు ద్వేషమును, పరధర్మమునందు రాగమును ప్రకృతి కల్పితములైరాగా విమర్శన రూపమైన పురుషకార శాస్త్రమును ప్రబోధించి భగవంతుడు తొలగద్రోసినాడు. అంతఃకరణ ప్రవృత్తులు శాస్త్రపరీక్షలకు నిలబడ గలిగినప్పుడే అవి ప్రమాణములు. అందువల్ల గీతాకారుడు చెప్పిన స్వధర్మ పరధర్మములు రెండును వ్యవస్థా ధర్మములే. ఆ స్వధర్మము మన వ్యక్తి ధర్మముకాదు. స్వభావ నియతమైన కర్మయన్నను, సహజ కర్మయన్నను ఆ వ్యక్తి ఏ వ్యవస్థా నియత ధర్మమునందు పుట్టినాడో ఆ వ్యక్తికి ఆ జన్మస్థానమే కర్మధర్మమును నియమించుననియు అదే వానికి స్వధర్మమనియు వ్యవస్థను త్రోసి రాజనగల వ్యక్తి ధర్మమును గీత స్వధర్మముగా చెప్పుటలేదనియు అట్లు చెప్పుట దాని యౌచిత్యమునకు భంగమనియు తెలియవలయును. మన అస్తిత్వ వాదమున కనుకూలమైన మరికొన్ని శ్లోకములను గీతనుండి ఉద్ధరించి వ్యస్తముగా చూపవచ్చును గానీ ప్రకరణ యోగ్యతను తొలగించి మనము చెప్పినట్లే మరొకరు చెప్పవచ్చును గనుక మనము చెప్పరాదు. అదియునుగాక పరం పరాక్రమమున ప్రాప్తించెడు శాస్త్ర విద్యాప్రామాణ్యము నంగీకరించి ప్రవర్తించెడు గీతాశాస్త్రము "వ్యక్తిజీవితము ప్రవర్తన వ్యవస్థను వ్యతిరేకించినప్పుడు వ్యక్తి ధర్మమునే ఉత్కృష్టమైన విలువగా అంగీకరించి వ్యక్తినే సమర్థించెడు అస్తిత్వవాద దృక్పథ సారాంశము"[10] ను ప్రబోధించుచున్నదని చెప్పరాదు.

వ్యస్తముగా అన్ని భావముల అంశాంశములును అక్కడక్కడ అన్ని దేశ కాలములయందును, వేష భాషలయందును అప్పుడప్పుడు ఎవరికో ఒకరికి స్ఫురించుచుండుట కలదు. ఆ స్ఫురణముయొక్క సుసంబద్ధ లక్షణమును విచారింపవలయును.

స్వధర్మమనగా మన యిప్పటి సమాజమునందును కులధర్మమనియే చెప్పవలయునా అని. ఎవరి ఉద్యోగ ధర్మములు వారికి స్వధర్మములు. ఒకరిపని మరొకరికి పరధర్మము. స్వధర్మ నిర్వహణమే ఇప్పటికిని శ్రేయోదాయకము. పరధర్మ మెప్పుడును భయావహమే. మరియు ఎవరి గృహస్థ ధర్మములు వారికి స్వధర్మములు. ఎవరి పౌరధర్మములు వారికి స్వధర్మములు. ఈ విధముగా చూచినచో అన్ని ధర్మములునూ ఏదో ఒక వ్యవస్థ దృష్ట్యా ఏర్పడినట్లే కన్పించుచున్నవి. అగుచో వ్యక్తికీ, వ్యవస్థకూ భేదమే లేదా అనియు ఆలోచింపవలయును.

## V

అస్తిత్వవాద అసంబద్ధ సాహిత్యముయొక్క నడక వ్యవస్థా ధర్మము మీద వ్యక్తి తిరుగుబాటును ప్రదర్శించుటగా కనిపించుచున్నంత మాత్రమున వ్యక్తికీ వ్యవస్థకూ సంఘర్షణ వచ్చినప్పుడల్లా వ్యక్తినే సమర్థింపవలయునన్నది అస్తిత్వవాద దృక్పథ సారాంశమనుటకు ముందు నిదానించి చూచుట అవసరము. విజయవంతమై పెద్దగా సాధింప గలిగినదేమీ అంతగా లేనప్పుడు కూడా వ్యవస్థమీద వ్యక్తి తిరుగుబాటును అస్తిత్వవాదము సమర్థించుచున్నదనగా దాని ఆంతర్య మేమనవలయును? వ్యవస్థయందు తిరస్కరింపవలసిన వ్యక్తియందు పురస్కారము చూపవలసిన ధర్మసూక్ష్మములేవో మానవాభ్యుదయ భావముదృష్ట్యా ఆ తిరుగుబాటు ద్వారా ప్రతీతికి వచ్చునని కావలయును. ఆ ప్రతీతికి అనుకూలముగానున్న తిరుగుబాటే ఇక్కడ తిరుగుబాటు. వ్యవస్థాధర్మ లక్షణము దేశకాలములను బట్టి మారవలసినచోట్లనూ మారక వ్యక్తియొక్క మానవతా లక్షణమును హరించుటకు సన్నద్ధమైన పరిస్థితిని చూపించి అప్పుడు వ్యక్తి అంతఃకరణముచేత ప్రబోధితుడై దానికెదురు తిరిగి తన యస్తిత్వమును తాను నిలబెట్టుకొనుటను సమర్థనీయముగా ప్రతిపాదింపవలయును. అదే ఈ సాహిత్య లక్షణము. స్వల్పవిషయములను స్వార్థములను అభిలషించి వ్యక్తి ఏవ్యవస్థకెదురు తిరుగుట ఎప్పుడును సమర్థనీయముకాదు. వ్యవస్థకైనను దాని మంచిచెడ్డలతో నిమిత్తము లేకుండా ఎదురు తిరుగుటనే పెట్టుకొన్న మనిషి మనిషేకాదు. వానిచేతలు సమర్థనీయములు కావు. వ్యక్తి నెప్పుడు సమర్థింపవలసి వచ్చినను వాని అస్తిత్వమునే కబళించెడు వ్యవస్థా ధర్మమునందలి అమానుష లక్షణమును గుర్తింపవలయును. అమానుష లక్షణముయొక్క అధిక తీవ్రతను బట్టి సమర్థించుటలోని సాంద్రత యుండును. అసలా అమానుష

ధర్మమునకే మనుష్య ధర్మమును సమర్థించుటకు పదిమందిని ప్రేరేపించు లక్షణ మున్నది. వ్యక్తిధర్మమును సమర్థించుట యనగా నిట్లుండును.

అయినచో వ్యక్తికీ సమాజమునకూ ఉన్న అవినాభావ సంబంధముకూడా విచారించుకొనవలయును. వ్యక్తికి సామాజిక జీవితము, వైయ్యక్తిక జీవితమూ అని రెండున్నవి. తనకు తనతోగాక మరొకరితో ఏమాత్రము సంబంధమున్న జీవిత విధానమైననూ అది సామాజిక జీవితమే. ఈ లెక్కన వైయ్యక్తిక జీవిత మన్నదుండునా ఉన్ననూ ఎంతయుండును అన్నది విచారణీయము.[11] అంత స్వల్పమైన పరిధిగల వైయ్యక్తిక జీవితమును విశాలమైన సామాజిక జీవితముతో సంఘర్షణకు ప్రోత్సహించి వ్యక్తిని సమర్థించుటయే పనిగా సాహిత్య ముండరాదు. వ్యక్తిని సమాజము బలి తీసికొనరాదనీ సమాజమునకు వ్యక్తి త్యాగముచేయుచు బ్రతుకవలయుననీ సాహిత్యము ప్రబోధింపవలయును. సాహిత్య ధర్మమెప్పుడును అట్లే యుండును.

ఉపాధులను బట్టుకొని యుండెడు మానవ జీవితమున రెండు వంతులు రజస్తమోగుణములు. అవే ప్రవృత్తి హేతువులు. వాటి ప్రభావము సత్వముమీదకూడా పడి దానిని సరిగా పని చేయనీయుట లేదు. ఇది మానవులలో మూడింట రెండువంతుల మంది లక్షణము. సత్వగుణము సరిగా పనిచేసియు చేయకయు ఉన్న ఆ ఒక వంతులో అది పని చేయుటచేత జాగృతిని పొందిన మహనీయులు మూడింట రెండువంతులకు పైగా నున్న తమ సోదర మానవులు మహనీయతా లక్షణమునకు ఎక్కిరావలయునని ఒక వ్యవస్థా ధర్మమును ధర్మార్థ కామమోక్ష స్థితి కనుకూలముగా ఏర్పాటుచేసిరి. స్వయం వివేచన శక్తిగల మానవులు ఆ వ్యవస్థా ధర్మముయొక్క ఆంతర్యమును సహేతుకముగా తెలిసికొని దానివల్ల తనయందు మహనీయతా లక్షణమునకు అస్తిత్వమును చూచుకొన వలయును కానీ, అట్లుకాక వ్యవస్థా ధర్మ మీమాంసను వదలి ఎవరి దృక్పథము వారిది, ఎవరి విలువలు వారివి, ఎవరి జీవితము వారిది అని ఈ విధముగా వ్యవస్థ కనుగుణముకాని ఆచరణకు ప్రామాణ్యమును కల్పించు సానుభూతి దక్షతకు లక్షణము కాదు. మనిషిని మనిషిగా, వ్యక్తిని వ్యక్తిగా గుర్తించుట, గౌరవించుట ఈ మొదలయిన అవ్యక్త మధుర వాక్యముల కర్థమును విచారించవలయును. సామాజిక వ్యవస్థా ధర్మ దృక్పథ వ్యతిరేక శక్తులతోడి వ్యక్తుల యిష్ట ప్రకార ప్రవర్తనములను అడ్డగింపక కొనసాగనిచ్చుట అరాజకము గానీ శాంతికి మార్గము కాదు. ఎవని వ్యక్తిత్వము వానికి ముఖ్యమైన దన్న మాట నిజమే. అది అనిర్వచనీయమైన శక్తి కలదన్న మాట కూడా నిజమే—కానీ అది సామాజిక వ్యవస్థా ధర్మమునకు వ్యతిరేకముగా పెరుగుట వింధ్యపర్వతముయొక్క ఘన శిరశ్శృంగ శృంగాటకములు పెరుగుట వంటిది కాదా అని !

అస్తిత్వవాద సిద్ధాంత గ్రంథ రచయితలునూ, మరియు నా ధోరణి రచయితలునూ సామాజిక వ్యవస్థా ధర్మమని స్పష్టముగా పేర్కొని దానిని మన్నించుటను చెప్పకపోయిననూ, మనిషిలోని మానవత్వము నీతి నిజాయితీ గల ధార్మిక జీవితమునకు తహతహ లాడుటను మహనీయ గుణముగా చెప్పినారు. సాధు శక్తులను పెంచుటకు, దుష్టశక్తులను నశింపు చేయుటకు తాను పుట్టిన వైనము మనిషి కెప్పుడును జ్ఞాపకముచేయుచునే ఉండవలయును. ప్రపంచ పరిస్థితులెంత అస్తవ్యస్తముగా అసంబద్ధములై తనను కబళింప వచ్చినను మనిషి భయపడి పోరాదు. పిరికితనముచేత ఆత్మహత్యకు పాల్పడరాదు. అసంబద్ధతయొక్క లక్షణ జ్ఞానము వల్ల మనస్సమాధానమును పొంది మనిషి జీవించనే వలయును. అస్తిత్వవాద సామాజిక దృక్పథ మీకోణము నుండియున్నది. ఒక విధముగా అస్తిత్వవాద అసంబద్ధ సాహిత్యమునందు ధ్వని అత్యంత తిరస్కృత వాచ్యముగా నున్నది.

## అధోజ్ఞాపికలు

1. ఆర్. యస్. సుదర్శనం, తెలుగు సాహిత్యంలో అస్తిత్వ వాదం. ఆంధ్రపత్రిక (1976—77) నల ఉగాది సంచిక. పుట 46.

   S. Laxmana Murthy, The novels of william styron. An existential study, M. S. p. P. 8—16.

2. సుదర్శనం. పుట 46.

   Joanne cockelreas & Dorothy Logan, writing essays about Literature, P. 189.

3. పి. గణపతిశాస్త్రి, విఖ్యాత రచయిత ఆల్బర్ట్ కేమస్, భారతి (మార్చి 1959) పుటలు 69—75.

   M. H. Abrams, A. Glossary of Literary Terms (Third edition) P. 86. Camus said in The Myth of sisyphus, "In a universe that is suddenly deprived of illusions and of light, man feels a stranger. He is an irremediable exile... This divorce between man and his life, the actor and his setting, truly constitutes the feeling of Absurdity."

   Eugene Io nesco, a leading writer of the drama of the absurd, has put it in an essay on kafka : "Cut off from his religious, metaphysical, and transcendental roots, man is lost, all his actions be come senseless, absurd useless."

4. Murthy, P. P. 16—21.

5. సుదర్శనం, పుట 19.

   William K. wimsatt, Jr. & Cleanth Brooks, Literary.

( మిగతా 47 వ పేజీలో )

# బంగారపు గ్రుడ్లు పెట్టే బాతు

బంగారపు గ్రుడ్లు పెట్టే బాతులాంటి అత్తవారింటి యిల్లరికం దొరికిన గోపీనాథానికి కాలిమీద కాలేసుక్కూచుంటే కాలం పంచకళ్యాణి గుఱ్ఱంలా పరుగెత్తి పోతుంటుంది.

ఒక తల్లి కడుపున పుట్టిన పిల్లలే అయినా రెండోవాడు వెంకటపతికి క్షణమొక యుగంగా కాలం గడుస్తున్నది.

వెంకటపతి పెండ్లికిక్కూడా సముఖంగా లేడు. తన పొట్టపోసుకోలేని నిరుద్యోగికి సంసార తాపత్రయం క్కూడా ఎందుకు ?

ఒక రోజు సినిమాలో యింటర్వల్‌లో వెంకటపతికి "అన్నిటిలో మేలైన ఉద్యోగం" అనే స్లైడ్ ప్రకటన కనిపించింది.

పరిశ్రమలశాఖ కార్యాలయానికి వెళ్లి విచారిస్తే స్వయం ఉపాధి పథకాలు తళతళా మెరిశాయి.

ప్రభుత్వమూ, బ్యాంకులూ ఆదుకున్నాయి.

వెంకటపతి కంపెనీ తయారుచేస్తున్న ప్యాకింగ్ సామాన్లకు యిప్పుడు ఆగ్నేయాసియా దేశాల్లో బాగా గిరాకీ వుంది.

బంగారు గ్రుడ్లు పెట్టే బాతు నిజానికి ఇల్లరికం కాదు. స్వయంగా నిరుద్యోగాన్ని నిర్మూలించుకోటానికి పెట్టుకున్న పరిశ్రమే.

గోపీనాథంలాంటి వాళ్లను దేశం భారంగా మోస్తుంటుంది. వెంకటపతిలాంటి వాళ్లు దేశాన్ని భుజాలమీద సునాయాసంగా మోస్తుంటారు.

---

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధ శాఖ డైరెక్టరుచే ప్రకటితము.

4/77-78

# అనంతరాగం*

కొందరు వ్యక్తులు సమ్మానాలకోసం ప్రాకులాడినా, వారికి అవి జరగవు. తెలివి తేటలున్న కొందరు కోరి యితరులచేత సమ్మానాలు చేయించుకుని తత్సందర్భంగా సంపుటాలు అచ్చు వేయించుకుంటారు. సమ్మానాలు వద్దంటూ చెప్తున్నా వారి సేవలను మెచ్చుకుని కొందరు మెడవంచి, ఎలాగో వారిని ఒప్పించి సమ్మానాలు జరుపుతారు. ఆ మూడవరకం వ్యక్తి శ్రీ రాళ్లపల్లి—అనంతకృష్ణశర్మగారు. సంగీత సాహిత్యాలలో నిధి. విద్వత్కవివతంసులు. సరళ సరస హృదయులు! వారి అభినందన సందర్భంగా ప్రకటింపబడిన గ్రంథం యిది.

దీని 'తొలిపలుకు'లో సంపాదకులు ''పేరుకోసం ఏనాడూ ప్రాకులాడని రాళ్లపల్లి వారిని ఈ అభినందనను స్వీకరింపవలసిందిగా కష్టంమీద ఒప్పించగలిగాము'' అని ఉన్న సంగతినే తెలియజేశారు.

1961లోనే శ్రీ శర్మగారిని సత్కరించి చిత్తూరులో ఒక సమ్మాన సంచిక ప్రకటింపబడింది. కాని రాళ్లపల్లివారి మహోన్నత వ్యక్తిత్వానికి మరుగుపడిన మాణిక్యంవంటి ఈ చిన్న సంచిక చాలదని 'అభినందన గ్రంథం' సమర్పించి అనంతకృష్ణుల సమగ్ర వ్యక్తిత్వంలో కొంత భాగాన్నయినా సాక్షరం చెయ్యాలని రాళ్లపల్లి అభినందన సమితి ఏర్పడి దీనిని ప్రకటించింది. అనంతకృష్ణులవారు సంగీత సాహిత్యాలలో పలికించిన మధురరాగాలు అనంతంగా ఉన్నందున, ఆ కళానిధికి అభినందన పూర్వకంగా అంకితమైన యీ గ్రంథం 'అనంతరాగం'గా వెలువడడం ఎంతో ఉచితంగా ఉన్నది. అంతే కాకుండా సంగీత సాహిత్యాలలో అనంతులకు ఉండే అనంతమైన ప్రీతిసూచకంగా ఈ పేరు ఉన్నాదని చెప్పినా చెప్పవచ్చును.

అనంతకృష్ణశర్మగారి ఆంధ్రాధ్యాపక జీవితం మైసూరులోనే గడిచింది. అందువల్ల ఆయనకు సుప్రసిద్ధ కర్ణాటక విద్వాంసులతో మంచి పరిచయం ఏర్పడింది. వారిలో సంగీతవేత్తలూ, సాహిత్యవేత్తలూ కూడా ఉన్నారు. వారిలో కన్నడంలో కొందరూ, ఆంగ్లంలో కొందరూ వ్రాసిన వ్యాసాలు కూడా ఇందులో ఉన్నవి. తెలుగువారిలో కూడా కొందరు ఇంగ్లీషులో దీనికి వ్యాసాలు వ్రాశారు. ఈ రీతిగా ఈ సంపుటం తెలుగు—కన్నడ—ఇంగ్లీషు విభాగాలతో త్రివేణీ సంగమంగా తయారయింది. తెలుగు విభాగంలో ఆలాపిని, మత్తకోకిల, నెల—వెన్నెల అనే మూడు శాఖలున్నవి. మొదటి శాఖలో పదకొండు వ్యాసాలు, రెండవ శాఖలో ఎనిమిది కవితలు, మూడవ శాఖలో ఇరవైమూడు వ్యాసాలు ఉన్నవి. కన్నడ విభాగమైన 'కన్నడ కస్తూరి'లో తొమ్మిది వ్యాసాలు, **'Fiddlin Tunes'**అనే ఆంగ్లవిభాగంలో ఎనిమిది వ్యాసాలు ఉన్నవి.

సమ్మాన సంపుటాలలో సమ్మానితుల వ్యక్తిత్వ ప్రతిభాదులను గురించిన వ్యాసాలూ, ప్రశంసలూ మాత్రమేకాక సర్వజనులకూ సర్వకాలమూ ఉపయుక్తాలైన ఉత్తమ వ్యాసాలు కూడా ప్రకటింపబడడం పరిపాటి...అలా ఉన్నప్పుడే వాటికి విలువ ఎక్కువవుతుంది. అట్టి విలువైన అభినందన సంపుటాలలో ఇది ఎన్నదగినది.

'ఆలాపిని' లో సంగీత సాహిత్యాలలో ఆరితేరిన విద్వాంసుల వ్యాసాలు—ఆ యా విషయాలకు సంబంధించిన వ్యాసాలు ఉన్నవి. వీనిలో వీణనుగురించి మంచాళ—జగన్నాథరావుగారు వ్రాసిన వ్యాసం, కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారి ఉదాహరణలను గురించిన వ్యాసం, తమిళ, తెలుగు కురవంజులను గురించిన డాక్టర్ చల్లా—రాధాకృష్ణ శర్మగారి వ్యాసం, సత్త్వ చర్చా భూమికలను గురించిన సాళ్వ—కృష్ణమూర్తి గారి వ్యాసం, కన్నడ భాషలో హరిదాస సాహిత్యాన్ని గురించి డాక్టర్ నాగరత్నగారి వ్యాసం, పరభాషగా తెలుగు బోధన, మైసూరు తెలుగు అనే వ్యాసాలు ప్రత్యేకంగా చెప్ప దగినవి. ఇవి శ్రీ రాళ్ళపల్లి వారికి సంబంధించని వ్యాసాలు. ఆ వ్యాసాలకోసమే యీ శీర్షిక ప్రత్యేకించబడింది.

'మత్తకోకిల' లో శ్రీ శర్మగారి ప్రశంసారూపాలైన ఎనిమిది పద్య కవిత లున్నవి. వీటిలో సాళ్వకృష్ణమూర్తిగారి సురూపోదాహరణమనే ఉదాహరణ కావ్యం కూడా ఉన్నది.

'నెల—వెన్నెల' అనే భాగం కేవలం రాళ్ళపల్లివారికి సంబంధించినది. ఇందలి తొలివ్యాసంలో ఘట్టమరాజు అశ్వత్థ నారాయణ గారు రాళ్లపల్లివారి జీవిత చరిత్రను సంగ్రహంగా తెలియజేశారు. వారి జీవితం ఎలా మలుపులు తిరిగినదీ దీనివల్ల స్పష్టమవుతున్నది. 'అధ్యాపకులుగా అనంతకృష్ణులు' అనే వ్యాసంలో కె. వెంకట రామప్పగారు తెలుగువారికి తెలియని రాళ్లపల్లివారి అధ్యాపకవృత్తిని చక్కగా పరిచయం చేశారు. గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు తమకు రాళ్లపల్లివారితోగల పరిచయాన్నీ, ఆయన సహృదయతనూ తెలియ జేశారు. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, దేవులపల్లి రామానుజరావుగారు, అనంతకృష్ణశర్మగారి విద్వత్తను ప్రశంసించారు. తిరుమల—రామచంద్రగారు తమ 'మరపురాని మనీషి' లో రాళ్లపల్లివారిని గురించి వ్రాసిన వ్యాసంలో కొంతభాగం ఒక వ్యాసంగా ఈ భాగంలో ప్రకటింపబడింది. సారస్వతంలో ఆయన ప్రతిభను గురించి కుంటిమద్ది శేషశర్మగారు, గానకళను గురించి శ్రీపాద పినాకపాణిగారు, నల్లాన్ చక్రవర్తుల కృష్ణమా

* అనంతరాగం—రాళ్లపల్లి అభినందన గ్రంథం. సంపాదకులు—శ్రీ ఆర్వీయస్ సుందరం, శ్రీ ఘట్టమరాజు—అశ్వత్థనారాయణ, శ్రీ శివలంక శ్రీ రామచంద్రమూర్తి. డెమ్మీ 12+334 పుటలు. వెల రూ 15. ప్రతులకు—రాళ్లపల్లి అభినందన సమితి, నెం. 53. II బ్లాక్ త్యాగరాజనగరు, బెంగుళూరు—28. లేక ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాదు—3.

చార్యులుగారు వ్యాసాలు వ్రాశారు. శర్మగారి 'తారాదేవి' కావ్య వైశిష్ట్యాన్ని గురించి డాక్టర్ జి. వి. సుబ్బారావుగారు, 'మీరాబాయి'ని గురించి డాక్టర్ చన్నావ్రగడ తిరుపతిరావుగారు తెలియజేశారు.

'మహీశూర రాజ్యాభ్యుదయాదర్శ' మనేది రాళ్ళపల్లివారి సంస్కృత కృతి. అది వేంకటాధ్వరి విశ్వగుణాదర్శం పద్ధతిలో నడిచింది. దాన్నిగూర్చి హెచ్. ఎస్. వరదదేశికాచార్ కన్నడంలో వ్రాసిన వ్యాసానికి ఆర్వీ యస్. సుందరంగారి అనువాదం ఇందులో ప్రకటితమైనది. 'వేమన' ను గూర్చి ఆరుద్రగారు చక్కని వ్యాసం వ్రాశారు. వారి 'శాలివాహన సప్తశతీ సారం' గురించి నాగళ్ళ—గురు ప్రసాదరావు గారు, 'నాటకోపన్యాసా' లను గూర్చి సర్రాజు లక్ష్మీనరసింహారావుగారు, రాళ్లపల్లివారు పరిష్కరించిన 'తాళ్ళపాక వారి సంకీర్తన'లను గురించి కామిశెట్టి శ్రీనివాసులుశెట్టిగారు, 'నృత్త రత్నావళి' అనువాదాన్నిగూర్చి వేదం వేంకటరాయశాస్త్రి గారు, 'సుందర పాండ్య విరచిత ఆర్య' భాషాంతరీ కృతిని గురించి కె. వి. సుబ్రహ్మణ్యంగారు చక్కని వ్యాసాలు వ్రాశారు. ఇవి వారి వ్యక్తిత్వాన్నీ, పాండిత్యాన్నీ, వారి రచనల ప్రత్యేకతను వ్యక్తపరుస్తున్నవి. డాక్టర్ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు వ్రాసిన వ్యాసంలో వీరి విమర్శ పద్ధతి వివరింపబడింది. డాక్టర్ కొలకలూరి ఇనాక్‌గారు వీరి వ్యాస వాఙ్మయాన్నిగూర్చి వివరించారు. డాక్టర్ జి. ఎన్. రెడ్డిగారు వీరు వివిధ గ్రంథాలకు వ్రాసిన రమణీయ పీఠికల ప్రాశస్త్యాన్ని తెలియ జేశారు. చివర రాళ్లపల్లివారు వ్రాసే జాబుల పద్ధతి చూపడానికి ఏడు జాబులు మచ్చున కీయబడినవి. ఆ జాబులు వారి విషయవైశద్యానికీ, సంక్షిప్తతకు, తార్కాణాలు.

కన్నడ భాషలోని వ్యాసాలలో మాస్తి—వెంకటేశయ్యంగారిది తొలి వ్యాసం. ఆంగ్ల భాషలో అసమాన ప్రజ్ఞగల వెంకటేశయ్యం గారి కథలు, వ్యాసాలు, 'త్రివేణి' పాఠకులకు చిరపరిచితాలే! ఆయన వ్రాసిన 'నిగర్వ శిరోమణి' వ్యాసం రాళ్లపల్లి వారి ఉత్తమ వ్యక్తిత్వాన్ని ప్రతిబింబింప జేస్తున్నది. వి. సీతారామయ్యగారి 'పండిత శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మరు' వ్యాసం, నరసింహాచార్ గారి 'జ్ఞానానందోపాసకరు' వ్యాసం, ఎం. వి. సీతారామయ్య గారి 'గురు స్మరణ', టి. వి. వెంకటాచల శాస్త్రిగారి 'గురువందన', చన్నప్పగారి 'రాళ్ళపల్లి మత్తు సాధన', జి. జి. మంజునాథన్ గారి 'సాహిత్య మత్తు జీవన కళ' కూడా వారిని ప్రశంసించేదిగా ఉన్నవి. శర్మగారు కన్నడంలో వ్రాసిన 'గానకళ'ను గురించిన రా. విశ్వేశ్వరన్ గారి విపులమైన వ్యాసం ఆ విభాగానికి తిలకాయమానం. చివరలో 'గానకళ' ప్రకటన సందర్భంగా రాళ్ళపల్లి, డి. వి. జి.ల మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలోని ప్రధాన భాగాలు ప్రకటింపబడినవి.

ఇంగ్లీషు వ్యాసాల విభాగంలో డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ విరించి, ప్రొఫెసర్ ఎస్. వి. రంగన్న, ప్రొఫెసర్ జవారేగౌడ, శ్రీ సంధ్యా వందనం — శ్రీనివాసరావుగార్లు రాళ్లపల్లి వారిని ప్రశంసిస్తూ వ్రాసిన వ్యాసాలున్నవి. అంతేకాక డాక్టర్ బి. రామ రాజు గారు వ్రాసిన కిరీటి వెంకటాచార్య విజయ వైజయంతి అనే నాటకంమీది వ్యాసం, ప్రొఫెసర్ ఎస్వీ జోగారావుగారు బహురూప రూపక భేదాన్ని గురించిన వ్యాసం ఉన్నవి. ఇవన్నీ విలువైనవ్యాసాలు. చివర డాక్టర్ కె. కెంపగౌడ కర్ణాటకదేశంలోని అడవిజాతుల భాషలను గురించిన సంగ్రహ వ్యాసం వున్నది. దానికి తర్వాత — ఇతర విభాగాలలో ఉన్నట్లే ఒక జాబుకూడా చేర్చబడినది. అది డాక్టర్ కట్టమంచి—రామలింగా రెడ్డిగారు రాళ్లపల్లి వారికి 1914 లో ఇచ్చిన యోగ్యతా పత్రం.

వీటికి అనుబంధంగా రాళ్ళపల్లివారి గ్రంథాలు, కవితలు, వ్యాసాలు, ఉపన్యాసాలు, పీఠికలు, అభిప్రాయాలు మున్నగువాని లిస్టు ఈయబడింది.

ఈ అభినందనగ్రంథంలో మూడుభాషల వ్యాసాలు ఉండడం వల్ల ఒక భాష తెలియనివారు ఇంకో భాషలోని వ్యాసాలు చదివి విషయాన్ని గ్రహించడానికి ఎంతో అవకాశం ఉన్నది. ఇట్టి అవకాశం అన్ని సంపుటాలవల్ల లభించదు.

సంస్కృతాంధ్రాలు రెండింటిలోనూ సమర్థులైన విద్వాంసులు ఉండవచ్చును. కాని చక్కని కవులుగా కూడా తయారైన పండితు లుండడం అరుదు. కవిత్వ పాండిత్యాలు రెండూ అబ్బినా గానకళ అబ్బడం అబ్బురం. అదీ అలవడినా గర్వంలేకుండా ఉండడం దుర్లభం. ఇలా ఉండి వ్రేళ్లమీద లెక్కింపదగినవారు తెలుగునాట కొద్దిమందే! వారిలో రాళ్లపల్లి వారొకరు! ఏ కొద్దిపాటి పేరున్నా అరవైయేళ్లు నిండితే ఘనంగా షష్ట్యబ్దపూర్తి ఉత్సవాలు జరిపించుకుంటారు. సంచికలు ప్రకటింపజేస్తారు. మరి, రాళ్లపల్లి వారికి ఆ ఉత్సవం సాధారణంగానయినా జరిగిందో లేదో! ఏడు పదులు నిండిన తర్వాత మాత్రం చిత్తూరు మాండలికులు సమ్మానించి ఒక చిన్న సంచికను ప్రకటించారు. అది జరిగి పదహారేళ్లు పైగా అయిపోయింది. వారి తాహత్తుకు ఆ సమ్మానం సరిపోదని తోచి మైసూరులో పనిచేస్తున్న ఆర్వీయస్ సుందరంగారు మిత్రుల అండదండలతో—ఆంధ్రప్రదేశ్ ప్రాంతాలనుండి లభించిన ప్రోత్సాహంతో వారిని ఘనంగా సమ్మానించే కార్యక్రమానికి పూనుకున్నారు. ఎంతోకష్టపడి సమ్మాన గ్రంథంకోసం సమర్థుల వలన అమూల్యాలైన వ్యాసాలు సంపాదించారు. వివిధ భంగిమలలో ఉన్న అనంత కృష్ణశర్మగారి ఛాయాచిత్రాలను అనేకంగా సంపాదించారు. చిత్రం ఏమిటంటే ఇందులో ప్రకటితమైన ఛాయా చిత్రాలన్నీ శ్రీ అనంతకృష్ణశర్మగారివే! పై వారిది ఒక్కటీలేదు. 'మేమింత ఘనకార్యం చేశాం' అనే భావనకు అవకాశమిచ్చే సమ్మాన సంఘం వారి ఛాయాచిత్రం కూడా లేదు. ఇది ప్రశంసనీయమైన విషయం. వ్యాసాలు ముగిసిన తర్వాత కాళీస్థలం రిత్తపోకుండా రాళ్లపల్లివారిని గురించి యితరుల సూక్తులు, శర్మగారిసూక్తులు అక్కడక్కడ సంగ్రహంగా ఇయ్యబడడమూ ఒక ప్రత్యేకతయే!

( మి గ తా 51 వ పే జీ లో )

## శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం

# పెన్నిధి

ప్రతి మనిషి వెనుకా ఓ కథ ఉండి తీరవచ్చుగానీ వాటిలో కొన్ని కథలు మాత్రమే ఎక్కువ మందికి కుతూహలం కల్పించగల వనుకుంటాను.

*                    *                    *

రైలు—అనుకున్నట్లే ఆలస్యంగా చేరడంతో నేనా వూరు వెళ్ళేసరికి రాత్రి తొమ్మిదయింది. కొంచం చదువుకున్న రిక్షావాడే తటస్థపడడంతో—వాడికి నేను చేరవలసిన ఆఫీసు తెలుసుననడంతో—కనీసం వాచ్‌మన్ అయినా స్వాగతం పలక్కపోడు అన్న ఆశతో—హోటల్లో దిగడం మానేసి—నేరుగా ఆఫీసుకే వెళ్లాను బెడ్డింగూ సూట్ కేసులతో.

నేను బొత్తిగా పిరికివాడిని కాను కానీ—తలుపు తీసిన వాచ్‌మన్‌ని చూసి—భయంతో అరిచినంత పనిచేశాను. ఎందుకంటే—వాచ్‌మన్ అనబడే ఆ మానవుడు —గెడ్డం పెరిగి బూచిలా ఉన్నాడు. జుత్తు పెరిగి రాక్షసుడిలా ఉన్నాడు. గుడ్డలు నలిగి—పిచ్చివాడిలా ఉన్నాడు. పాతబడిన ఆ మేడలో—నిశ్శబ్దం గడ్డకట్టిన ఆ నిశీధిలో—అతను దెయ్యంలా...భూతంలా అనిపించాడు.

వణుకుతున్న కంఠంతో నన్ను నేను తెలియపరచుకున్నాను. నేను వాడికంటె చాలా పై మెట్టు నౌకరునని తెలియగానే—నమస్కరించి—లోపలకు తీసుకువెళ్లాడు. తప్పదు. నేనా ఆఫీసులో ఛార్జి తీసుకోబోయే పెద్ద గుమాస్తాని కదా ?

''టిఫినూ టీ తెమ్మంటారా? భోజనమా ?'' మర్యాదగా అడిగాడు.

''చపాతీ...టీ తీసుకురా...నీ పేరు?''

''అప్పల నరసింహులు—''

వాడు వెళ్లినా వాడిగురించి ఆలోచనలు నన్ను వదలలేదు. మా శాఖలో వాచ్‌మన్‌కి కూడా నూటపాతిక పై చిలుకే వస్తుంది నెలకి. ఎంత పై రాబడిలేని శాఖ అయినా — దీనిలో పనిచేసే ఉద్యోగి మరీ అప్పలనరసింహులంత బీదగా భయంకరంగా శాఖను వెక్కిరిస్తున్నట్టు దిష్టిబొమ్మలా ఉండనక్కరలేదు.

అప్పలనరసింహులుకి పిల్లలెక్కువేమో?

కనుక్కొని—''మందెక్కువా, మజ్జిగ పల్చనా—కుటుంబ నియంత్రణ పాటించి—మిత సంతానంతో అపరిమితానందం అనుభవించ''మని చెప్పాలి.

అప్పలనరసింహులింట్లో దీర్ఘరోగులుండి—వాళ్లతని జీతాన్నంతటినీ మందుల రూపంలో తాగేస్తున్నారేమో?

''హోమియోపతీ వైద్యం చవుక ... సురక్షితము—'' అని చెప్పాలి.

నా ఆలోచనలు సాగుతూండగానే వచ్చేశాడు నరసింహులు.

''రెండు టీ అరవై పైసలు...రెండు చపాతీ – రూపాయ్యరవై—ఇదుగో యిరవై పైసలు—''

లెక్కబాగానే ఉందికాని—నేను రెండు టీ తెమ్మనలేదే? నా ముందరి పెద్దగుమాస్తాకి అలవాటేమో మరచెంబుడు టీ తాగడం.

నేను చపాతీ తినేసరికి గ్లాసుతో ఒక్క టీ మాత్రమే యిచ్చి మిగిలిన టీ వేరుగా ఉంచుకున్న అతని వైఖరికి ఆశ్చర్యపోయాను. అతనిది—కొంచం జబర్దస్తీగానే అనిపించింది. నిగ్రహించుకున్నాను—కాలక్రమమున యితని కీలెరిగి వాత పెట్టవచ్చునులే అని.

వాడి మనస్తత్వం స్టడీ చెయ్యడానికే నిర్ణయించుకున్నాను.

*                    *                    *

మనుషులని—వాళ్లకి తెలియకుండా స్టడీచేసే రెండు జాతుల గురించి మాత్రమే నాకు తెలుసు. దొంగలు—రచయితలూ...

దొంగలు—మనుషులని కనిపెడతారు—ఏమరి ఉంటే దోచుకుందుకు.

రచయితలూ మనుషులని కనిపెడతారు—ఏమయినా ఉంటే కథ రాసుకుందుకు. నేను దొంగని కాను

*                    *                    *

అప్పలనరసింహులు కొంతవరకూ సామ్యవాద సిద్ధాంతాన్ని నమ్ముతాడు. ఉన్నదేదో నలుగురూ పంచుకుతినాలని (తాగాలని) అతని సిద్ధాంతం. అతనెన్ని టీలు తెచ్చినా, ఎందరికి తెచ్చినా తాగేటప్పుడు తను కూడా భాగం తీసుకుంటాడు. ''పే ఇండివిడ్యువలీ'' అనేది పాటించకపోయినా—ఆ సూత్రం తాలూకు రెండవ భాగమయిన ''ఎంజాయ్ కలక్టివ్‌లీ'' అనేది తు. చ. తప్పడు ఎట్టి పరిస్థితుల లోనూ. వన్ బై టు...త్రి...ఫోర్ ... ఇన్‌ఫినెటీ అయినా చెయ్య

గల నేర్పు వాడిస్వంతం. వాడి యీ పద్ధతికి నేనూ అలవాటు పడి పోయి—టీ తాగాలనిపించేటప్పుడల్లా రెండు టీలు ఆర్డరివ్వడం నేర్చుకున్నాను.

* * *

''ఈ చెత్త అవతల పారెయ్—'' అన్నాను కొన్ని కాగితాలను చూపించి—ఓనాడు. వాడు వాటిని భద్రంగా మడుస్తూండడం గమనించి—నవ్వి—''అదొట్టి చెత్త. నీకూ ఇంగ్లీషువాడి స్వభావం వంటపట్టిందేమిటి? ఎంత పనికిరాని వస్తువునయినా ఏడేళ్లు దాచమంటాడట ఆంగ్లేయుడు.''

''అసలు పనికిరాని వస్తువంటూ ఉంటేకద?''

తెల్లబోయాను. సృష్టించబడిన ప్రతీదీ ప్రయోజనకర మయినదే. ఔను.

అప్పలనరసింహులు గెడ్డం గీసుకుంటున్నాడు—నేను వాడిన బ్లేళ్లతో. అది కేవలం పరోపకార దృష్టితోనే తప్ప తనకోసం ఎంతమాత్రమూ కాదు.

ఉండీ ఉండీ వాడిగురించి నా సహోద్యోగులు ఏవేవో చెబు తూనే ఉన్నారు.

''నరసింహులు రూపాయి ఖర్చుపెట్టాడంటే ఆ రోజు ప్రళయం తప్పదు—''

''వాడి కొక కొడుకూ, కూతురూ ఉండేవారు. కూతురు చచ్చిపోయింది. కొడుకు కూడా వీడి దగ్గర లేడు. వీళ్లబంధువే—పిల్లలు లేరనుకుంటూంటే కొడుకుని అతని దగ్గరకు పంపాడు...''

''వీడికీ డబ్బు కాపీనం ఎందుకో తెలియదు. ప్రాణంపోయినా పైసా ఖర్చుపెట్టడు. మళ్లీ పెళ్లాం కూడా నానా పనులూచేసి సంపాదిస్తూనే ఉంటుంది.''

''కొందరి కర్మ అంతే. ఉండీ లేనట్లే లెక్క.''

అప్పలనరసింహులు నలుగురిళ్లకీ వెళ్లి పనికిరాని బట్టలూ... కాగితాలూ...ఒకటేమిటి, అన్నీ పట్టుకెడతాడుట. మా శ్రీమతి కూడా చెప్పి—అంది. ''మీ అప్పలనరసింహులు ధర్మమా అని యింట్లో చెత్త అనేది ఉండడంలేదు—'' అంటూ వాడి ఉపకార బుద్ధిని మెచ్చుకుంది కూడా.

ఒకనాడు వాడు సీరియస్‌గా అడిగాడు—''బాబూ!...మీకు విస్తరాకుల వెంకటస్వామిగారి గురించి తెలుసా ?''

''ఈ వూళ్లో ఉంటూ ఆయన్ని తెలియకపోతే...''

ఆ వెంకటస్వామిగారికీ వూళ్లో సినిమా హాళ్లున్నాయి. సినిమా హాళ్లంతలేసి మేడలున్నాయి. లారీలున్నాయి. కార్లున్నాయి. బార్లున్నాయి. షాపులున్నాయి. అన్నీ ఉన్నాయి. అతనికెంత ఆస్తి ఉందో ఇన్‌కమ్‌టాక్స్ వాళ్లకూ్కడా లెక్క తేలలేదట! అంతటి ఆస్తిపరుడు.

''ఆయన అంతపైకి ఎలావచ్చాడో తెలుసాబాబూ? మొదట—పెళ్లాం విస్తర్లు కుడితే వీధులు తిరిగి అమ్ముకునేవాడు. సిరి పొంగింది... పేరుకి పేరూ డబ్బుకి డబ్బూ...''

నవ్వొచ్చింది.

చాలా డబ్బున్నవాళ్ల వెనక—ఎందుకోకాని యిటువంటి కథ లుంటూ ఉంటాయి. బజ్జీలమ్ముకునే బాబూరావే పదేళ్లు తిర క్కుండా లక్షాధికారయ్యాడనీ; ఇప్పటి కోటీశ్వర్రావే అప్పటి కాకా హోటలు నడిపి పప్పరుబ్బేవాడనీ...అలాగ...ఈ కథలకు అర్థమూ ప్రయోజనమూ ఒకటే తోస్తుంది. ఇటువంటి కథలు చెప్పి బజ్జీ లమ్ముకునే వాళ్లకీ, కాకా హోటలు నడిపేవాళ్లకీ ఆశలుపెంచి—నేటి భిక్షాధికారులే రేపటి లక్షాధికారులని తియ్యగా నమ్మించడం. బ్రతుకుకు ఆశల తీపిపూత పూయడం. అంతకంటే ఏముంది? ఏముంటుంది?

''నువ్వెప్పుడేనా అతనిదగ్గర విస్తరాకులు కొన్నావా?''

''లేదు లెండి. అందరూ చెప్పుకోగా వినడమే.'' వాడి కళ్ళలో కోరికా ఆశా మెరిశాయి. అర్థమయింది. అప్పల నరసిం హులకి అమాంతం లక్షాధికారో, కోటీశ్వరుడో ఐపోవాలని ఉంది. కాని— ఎలాగ? కథలలోనూ, కలలలోనూ తప్ప సాధ్యం కాదే?

ఐనా—డబ్బు ఖర్చు పెట్టనివాడికి లక్ష ఉంటే ఏం, కోటి ఉంటే ఏం? అనుభవించేదెలాగూ ఉండదు. అంకెలు చూసుకు ఆనందించడమేగా?

''నర్సింహులూ!... నీకు అమాంతం సిరి వచ్చిపడితే ఏం చేస్తావు?'' అడిగాను.

''రానివ్వండి చూద్దురుగాని—'' మెరుస్తున్నాయి వాడికళ్లు.

ఔను. వాడు మంత్రులలాగ మాటల మనిషి కాదు. క్రియాశీలి.

వాడిలోని మరికొంత అర్థమైంది.

* * *

ఒక నాటి సాయంత్రం...ఏమీ తోచక రోడ్డుమీదకి బయలు దేరాను.

నాది రోడ్డుమీది కలర్‌విహూస్తూ ఎంజాయ్ చేసే కుర్ర వయసూ కాదు, తల వొంచుకుని నడిచే క్రవయసూ కాదు. ఈ నడివయసుతో యిదే చిక్కు. కుర్రాళ్లేమో పెద్దవాడివని బహిష్కరిస్తారు. పెద్దవాళ్ళేమో కుర్రవాడివని తీసిపారేస్తారు.

నాలుగు రోడ్లు తిరిగి—వస్తున్నాను. సాయంత్రపు ఎండ పలచగా అందంగా పరచుకుంటూంది. గులాబి రంగు ఎండలో—రోడ్డు పక్క మెరుస్తూ—అవేమిటి ?

దగ్గరగా వెళ్లాను. కాగితం బుట్టలూ...చేటలూ...... సజ్జలూ...కళాత్మకంగా ఉన్నాయి.

ఒకటి తీసి— ''ఎంత?'' అన్నాను.

''రెండు—'' అని— నా ముఖంలోకి చూసి—''మీరా బాబూ? నే నింటికి తెస్తాను. యిదేనా యింకేమయినా కూడా కావాలా?'' అంది.

ఆమె నెప్పుడో ఎక్కడో చూసినట్లుంది కానీ ఎవరో గుర్తుకు రావడం లేదు. నేను ముసిలివాడినై పోతున్నానేమో?

ఇంటికి వెళ్లాను. కొంత సేపటికి—చీకటి పడ్డాక ఆమె వచ్చింది నే నెంచుకున్న సజ్జ పట్టుకుని. రెండు రూపాయలు తెచ్చి అందించబోయాను.

సందేహించింది. కళ్ళనీళ్ళ పర్యంతం ఐంది.—''మీ దగ్గర్నుంచి తీసుకోడానికి మనసొప్పడం లేదు. కాగితాలు మీ రిచ్చినవే. కాని లెక్క సరిగ్గా చెప్పకపోతే తాట వొలుస్తాడు—'' విషమ సంధిలో విలవిల కొట్టుకొంటున్నట్లుంది.

''ఎవరు?''

''అప్పల నరసింహులు...''

జ్ఞాపకం వొచ్చింది. ఈమె అతగాడి అర్ధాంగి.

''మీ యజమానికీ డబ్బుకీ ఎందుకంత లంకె?''

''అదేమో బాబూ! అతగాడి డబ్బు పిచ్చి కాదుగానీ అందర్నీ సంపుకు తింటున్నాడు. తను తినడు, ఎవర్నీ తిన నివ్వడు. తను కట్టడు...మమ్మల్ని మంచి బట్ట కట్టనివ్వడు''. గాలికి నిప్పు రేగినట్లు—నా ప్రశ్న ఆమె స్మృతులను తలుపు తట్టిందో ఏమో! మానినగాయం మళ్ళీ రేగినట్లుంది. దుఃఖం వొచ్చేసిందామెకు.

''ముచ్చటగా మూడేళ్ళ బొట్టి, బొంగరంలా యిల్లంతా తిరిగేది. చూడ్డానికి రెండు కళ్ళూ చాలేవికావు. ఉన్నట్టుండి మాయదారి జబ్బు ముంచుకొచ్చింది. మామూలు జబ్బుకాదు—గచ్చాకుకీ పుచ్చాకుకీ గమ్మున తగ్గడానికి'' వెల్లువలా శోకం.

''ఆడు మనిషి కాడు. రాక్షసుడు. డబ్బు రాక్షసుడు. పిల్ల మందులకి మూడొందలు ఖర్చు పెట్టడానికి మనసొప్పక —

''ఊరికే అనుకోడమేగాని డాక్టర్లుమనుషులేకాని దేవుళ్లేటి? మనిషి ప్రాణం మనిషి చేతిలో ఉండదు. దేముడిదయుంటే పిల్ల బతుకుతాది. జబ్బు తగ్గే వేళే రావాలికాని కరీదయిన మందే పడాలని లేదు. ఓ పసరు...మరోగుండ... ఏదేనా చాలు...'' అనేసి డబ్బివ్వకుండా పిల్లదాని బతుకుని చెరిపిపారేశాడు దుర్మార్గుడు—పాపిష్టోడు—''

సాక్షాత్తూ అప్పల నరసింహులు భార్యే ఆ చేదు నిజం చెప్పాక యిక నమ్మకుండా ఎలాగ ఉండేది? డబ్బు ఎంత పాపిష్టిది!

ఆమె ఆయాసపడుతూంటే—దుఃఖం వల్ల అనుకున్నాను. కాని—''నాకూ రోగమే. సూదిమందు పడాలి. కాని యిప్పించడు. డబ్బు ఉంది గతిలేదు, నేనూ ఎన్నాళ్ళో బతకను. రోగం నన్ను మింగేస్తుంది. అటువంటోణ్ని కట్టుకోడం నా కర్మ బాబూ!... ఈ డబ్బుపిచ్చి వొదులుకుని సుకపడమని మీరయినా చెప్పి పుణ్యం కట్టుకోండి—'' అని వెళ్లిపోయిందామె.

డబ్బుపిచ్చి కూడా రోగం లాటిదే. మామూలు రోగి తన బాధ తనే పడతాడు. ధనరోగి తన చుట్టూ ఉన్నవారిని కూడా బాధిస్తాడు చిరకాలమూ. ధనరోగానికి మందూలేదు, కాలపరిమితీ లేదు.

అసలు—నరసింహులు యిన్ని పుర్రాకులు పడుతూ డబ్బు మూటలు కట్టటం ఎందుకో? వాడి పుర్రెను దొలుస్తున్న పురుగు ఏమిటో?

ఆలుమగల తగవు అద్దంమీద ఆవగింజవతు అంటారు.

''నీ పెళ్లానికి మంచి మందిప్పించ''మని నేను నరసింహులుకి చెప్పడం నా మట్టుకు నాకే సబుబుగా తోచలేదు.

కుతూహలం మాత్రం పెరిగింది. నరసింహులు ఎందుకింత కష్టపడి డబ్బు కూడబెడుతున్నాడు?

* * *

కాలం గడుస్తోంది.

నరసింహులు పెళ్లాం చచ్చిపోయిందన్న వార్త తెలిసింది ఆ రోజు ఆఫీసుకి వెళ్లగానే.

వాడింటికి వెళ్లాను.

నరసింహులు పెళ్లాం శవంపక్క కూర్చున్నాడు.

వాడి కళ్లల్లో విషాదంకంటె ఓటమి ఎక్కువ కనిపిస్తూంది.

నాకొక క్రూరమయిన ఆలోచన వచ్చింది. (కథలు రాసే వాళ్లు అప్పుడప్పుడు అసహజంగా ఆలోచిస్తూంటారా?)

చెత్తకాగితాలు...చిరిగిన గుడ్డలు...విరిగిన బ్లేళ్లు...వీటన్నిటికీ ఏదో ఒక రకమయిన ప్రయోజనం ఉంది. చివరకి—చచ్చిపోయిన జంతువులమీద కూడా డబ్బు పిండవచ్చు వాటి తోలు తీసి అమ్మి. కాని—మానవ కళేబరం బోలెడన్ని కర్రలు ఖర్చుపెట్టి కాల్చి బూడిద చేయవలసిందే తప్ప దానిమీద పైసారాదు. పైగా—వాయిదా వెయ్యకుండా చెయ్యవలసిన కార్యక్రమం అది.

సృష్టిలో పనికిరాని వస్తువు—మానవ కళేబరం! కాదూ?

నరసింహులు యిలాగ ఆలోచించడం లేదుకద?

కాని—మానవ కళేబరంమీదకూడా మనీ చేసుకోగలిగా డతను. మా దగ్గరే చందాలు వసూలుచేసి ఆ శవదహనం చేయించాడు. మా కందరికీ తెలుసు, వాడు చాలా కూడబెట్టాడని. కాని వాడి ముఖమూ మాటలూ పరిస్థితీ చూసి మరోమాట ఎలాగఅనగలం?

ఏది ఆగినా కాలం ఆగదుకద?

నరసింహులుకే జబ్బుచేసింది. ఔను. తినడంలో లుబ్దత్వం చూపితే జబ్బులు రాకేంచేస్తాయి? వాడి శరీరంమీద జబ్బు

స్పష్టంగా తిష్టవేసుకుంది. ఇకనయినా నా కథ తాలూకు పాత్ర నా ఊహకనుగుణంగా లొంగితీరుతుందని ఆశించాను. (రచయితలతో యిదే గొడవ. వాళ్లకి మనుషులు కథలలో పాత్రలలాగ మాత్రమే అనిపించడమూ కనిపించడమూ)

ఎన్నో పళ్లు పీకాను కాని—నా పంటినొప్పంత నొప్పి మరెవరికీ లేదన్నాట్ట్రొక డాక్టరు. ఆయన ఆమాట ఎందుకన్నా ఓ జీవిత సత్యం ఉంది ఆయన మాటల్లో. నరసింహులు—తన ప్రాణంమీదకే వచ్చిందనేసరికి—కూడబెట్టిన డబ్బు పైకి తీయకేం చేస్తాడు? స్వంత ప్రాణంకంటె తీపికాలేదుకద డబ్బు?

కాని—నా అంచనాలు తప్పే అయ్యాయి.

''యోగం ఉంటే బతుకుతాను. లేకపోతే లేదు. అంతేకాని వెయ్యి రూపాయలుపెట్టి మందులు వాడలేను—" అనేశాడు డాక్టరుతో. అంతకీ డాక్టరు స్పష్టంగానే చెప్పాడు రోగం ప్రాణాల మీదకు తెస్తుంది త్వరలోనే అని. అయినా అప్పలనరసింహులు చలించలేదు.

వాడి నెలా అర్థంచేసుకోవాలో నాకు తెలియలేదు.

అన్నిటికంటే విలువైనది ప్రాణం అని నమ్మిక నాకు—నా అభిప్రాయం తప్పని తెలియజేస్తున్నాడా అప్పలనరసింహులు? నేను అక్కడా అక్కడా విన్నమాటలే నిజమైతే వాడి దగ్గరిపాటికి కనీసం ఇరవై వేలయినా నిలవ ఉండాలి. అధమపక్షం పదివేలు; ప్రజాభిప్రాయాన్ని అతిశయోక్తిగానూ—గోరంతలు కొండంతలుగానూ తీసుకున్నా. ఆ పదివేలలోనూ ఓ వెయ్యి తనప్రాణంకోసం ఖర్చు చేసుకుందుకేం? ఎన్ని కోట్లరూపాయలు...ఎంత సంపద... ఒక ప్రాణానికి సాటి? మూటకట్టిన సిరిని తనతో ఎంతదూరం తీసుకువెళ్లగలడు మనిషి? చచ్చిపోయాక డబ్బు తనవెంట రాదనీ, రాలేదనీ తెలియని అజ్ఞానీ, అమాయకుడూ కాడే అప్పలనరసింహులు? మరి?

అప్పలనరసింహులు చచ్చిపోయాడు.

ఆఫీసువాళ్లమే దహన సంస్కారం జరిపించాం.

వాడి యింట్లో ఓ కాగితం మా కంటపడింది.

దానిలోఉన్న విశేషాలు :—అప్పటివరకూ అప్పలనరసింహులు ఇరవై రెండువేలు సంపాదించాడు. అవి ఎక్కడెక్కడ దాచాడో వివరించాడు.

ఆ డబ్బుతో—వాడి యిల్లున్న సందుని రోడ్డువేయించాలనీ... ఆ రోడ్డుకి తనపేరు పెట్టాలనీ — తన పేరు పెద్ద అక్షరాలతో వ్రాసిన బోర్డుని రోడ్డుపక్క ఉంచాలనీ — అదే తన కోరిక అనీ స్పష్టంగా తెలియజేశాడు.

అదొక విల్లువంటిదే.

తన ఆస్తిని—ఒక్కగానొక్కకొడుక్కి ఒక్కపైసాకూడా చెందకుండా—తన పేరిటవేయవలసిన రోడ్డు గురించే కేటాయించాడు!

ఆ విల్లు నాకు చిత్రంగా తోచింది. ఆలోచిస్తున్నకొద్దీ మానవ మనస్తత్వంలోని మరొక కోణం నాకు స్పష్టం కాసాగింది.

* * *

తాత—మనవడికోసం కోరుకునేదీ,

రచయితలూ కళాకారులూ రచనా కళాసేవ చేసేదీ,

పేరుకోసం!

అప్పలనరసింహులు తన జీవితాన్నలా మలుచుకున్నది కూడా పేరుకోసమే!

ఔను. కొందరికి—పేరే, నిధీ పెన్నిధీ కూడా!

*(N. బలరామ్‌దాస్, ఇన్‌కమ్‌టాక్స్ ఇనస్పెక్టరు - విశాఖ,కి కృతజ్ఞతలు)*

---

# అస్తిత్వవాద అసంబద్ధ సాహిత్యము

(40 వ పేజీ తరువాయి)

6. Criticism A short History. P. P. 499—521.
7. Cockelreas & Logan. P. 191. "In his book The Theatre of the Absurd Esslin says that the theme of these plays is in the "sense of metaphysical anguish at the absurdity of the human condition."
8. కాళిదాసు, అభిజ్ఞాన శాకుంతలమ్.
9. సుదర్శనం, పుట 46.
10. సుదర్శనం, పుట 47.
11. Karl Jaspers, way to wisdom, P. 115 "Absolute independence is imposible. In thinking we are dependent on experience which must be given us, in living we are dependent on others with whom we stand in a relation of mutual aid. As self hood we ate dependent on other selfhood, and it is only in communication that we and others come truly to ourselves."

శ్రీ జోస్యము జనార్దనశాస్త్రి

# సప్తశతి సంఖ్య

మార్కండేయ పురాణమునందలి సావర్ణి మన్వంతర కథనమున చెప్పఁబడినది దేవీ మాహాత్మ్యము. దానికే దుర్గాసప్తశతి, చండీ సప్తశతి అనునవి నామాంతరములు. కేవలము 'సప్తశతి' యనియు ప్రసిద్ధి కలదు. సప్తశతీ స్తోత్రమాలా మహామంత్రస్య—సప్తశతీ చండికే ఉత్కీలనం కురు సప్తశతీ సంఖ్యా వరమాప్నోతి—అని ఉపాసనా ప్రక్రియాసిద్ధము. దుర్గా—చండీ పదములు దేవికే అన్వయించును. సప్తశతి యని పేర్వడుటకు కారణమే విచారణీయము.

త్రిశతియను వ్యవహారము సంఖ్యతోనే ఏర్పడినదనుట నిర్వివాదము. గాధాసప్తశతి అన్నప్పుడు నింతే. అట్లే యిచ్చటకూడ సంఖ్యను పురస్కరించుకొనియే యీపద మున్నదనుటయే సమంజసమనిపించును. కొందరు శతిని—సతి చేసి నందజా—శాకంభరీ—భీమా—రక్తదంతికా — దుర్గా —భ్రామరీ అను స్త్రీ దేవతలయొక్క కానీ, బ్రాహ్మి, మాహేశ్వరీ—కౌమారీ — వైష్ణవీ — నారసింహీ—వారాహీ—ఇంద్రాణీ—అను శక్తులయొక్క కానీ మహిమోల్లేఖనము తత్కారణగా ఊహించిరి. ప్రధాన కథలో నందజాదులకు స్థానమే లేదు. కేవలము భవిష్యదవతార సూచనలో తడవఁబడిన వంతే. బ్రాహ్మ్యదులును రక్తబీజవధయందు మాత్రమే ప్రవేశితలు. అంతమాత్రమునకే సప్తసతి యని గ్రంథమున కంతటికి నామకరణము చేయుటలో ఔచిత్యము కలదా? ఇంకను కౌశికి—కాళిక—శివదూతి యను శక్తులకు కూడ కథయందు ప్రవేశము కలదు కదా? ఇంతకును శ—స—ఆ కభేదము గ్రహించుట 'సకలశ్శకలోమాభూత్. సకలం శకలం సకృత్ శకృత్' అన్న శబ్ద విదులు సహింతురా?

సంఖ్యతోనే సప్తశతి సంజ్ఞ ఏర్పడినదను పక్షమున ఆ యేడు నూర్లేవి? శ్లోకములా? కాదే? ఆ గ్రంథ మాద్యంతము అయిదునూర్ల డెబ్బది యెనిమిది శ్లోకములే కలవు. పోనీ అధిక పాఠములు చేరినను ఆరువందలు కూడ పూర్తికావు. మరి యేడు నూర్లు మంత్రములే అనవలెను. వానిని సాధించుటకై ప్రాచీనులను దొట్టి బహుతంత్రకారులు బహుప్రయాసలకు గురియైరి. 'ఉవాచ' లను మంత్రములుగా లెక్కించిరి. (అవి కొన్ని అవసరమైన చోట కనిపించవు. అనవసరమనిపించు కొన్ని సందర్భములలో అగుపడుచున్నవి.) కొన్ని శ్లోకములను రెండుగా మూడుగా విరిచిరి. మరికొన్ని శ్లోకములను రెండుసార్లు పఠించిరి. తత్ఫలితముగ ప్రకృత సంఖ్యా వివరణ మిట్లున్నది: పూర్తిశ్లోకములు—అయిదునూర్ల ముప్పదియేడు. అర్ధశ్లోకములు—ముప్పది యెనిమిది. మూడవ భాగపు ముక్కలు అరువదియారు. ఉవాచలు ఏబదియేడు. ద్విరావృత్త శ్లోకములు రెండు. ప్రతితంత్రమున, ప్రతి గురు సంప్రదాయమున మతభేదములే. కొంద రీనాటికిని మంత్ర విభాగమునందు సంస్కరణములు చేయవలయు నను చున్నారు. చేయుచున్నారు కూడ. ఒకరి నొకరు కాదనుచున్నారు. విమర్శించుచున్నారు. వెక్కిరించుచున్నారు. ప్రతిశ్లోకంచ జుహుయాత్ అని వైకృతి రహస్యము. దానికి సమన్వయమింతేనా?

ఇంతకును సప్తశతి యని మొదట అన్నదెవరు? ఏ ప్రమాణ గ్రంథమున ఈ పదము ప్రయోగింపఁబడినది? బహుతంత్ర గ్రంథ పరిశోధకులు తెలుపవలసిన విషయ మిది. దీనిపై ఇన్ని తంత్ర గ్రంథములు వెలువడుట—తంత్రకారులందరికి ఈషదవాంతర భేదములు స్ఫురించి నప్పటికిని ఏడు నూర్ల మంత్రముల నుద్ధరించుట యందు మాత్రము ఐక్యభావము కుదురుట ప్రశంసనీయములు. ఈ గ్రంథముయొక్క ప్రాచీనతకు, పూజ్యతకు నివి తార్కాణములు. ప్రకృతము అచ్చుపడిన నాగరీ లిపి, తెనుగు లిపి ప్రతులయందు మంత్రవిభాగ విషయమున ఒకదాని కొకదానికి ఏదో భేదమే కనబడుచున్నది.

అసలు మంత్రమనగా ఏవి? ఒక భావము—అన్వయము. ఒక్కొక్కచోట వాక్యముకూడ పూర్తి కాకుండనే రెండు మూడు విరుపులా? పూర్వోత్తర భావముల కొక్కొక్క మంత్రముననే సంశ్లేషమా? ఉవాచకు కూడ మంత్రత్వమా? అధ్యాయాంతమున కాహుతియా? అదియు లెక్కలోనిదేనా? ఇట్టి యెన్నియో సంశయములు పొడసూపుచున్నవి. శ్రద్ధాళువులైన యనుష్ఠాతలకు న్యూనాతిరిక్త దోషభయముతో ఇవియెల్ల తికమకలు పట్టించుచున్నవి.

ఇది యిట్లుండగా నీ లోపల తాళపత్రలిపిలోనున్న ఒక సప్తశతి గ్రంథమును చూచుట తటస్థించినది. అందులో ఒక అపూర్వమైన కారికవంటి శ్లోకము నా కంటబడినది. దాని యర్థమునకై చాల దినములు ప్రయత్నించి మిత్రుల సాహాయ్యమున ఒక రకమున అన్వయము చేసికొంటిని. ఆ శ్లోకము ప్రమాణమో? కాదో? నా అన్వయము సమంజసమో కాదో? పెద్దలు, చిరకాలానుష్ఠాతలు సహృదయతతో పరికించు నుద్దేశముతో నిందు ప్రకటించుచున్నాను. తమ అభిప్రాయమును, సూచనలను వ్యక్తిగతముగ నాకు దయతో తెలిపిన యెడల కృతజ్ఞతతో స్వీకరించి నా పొరపాటును సవరించుకొందును. ఏదేని పత్రికా ముఖమున వెల్లడించిన అందరికిని మేలు చేసినవా రగుదురు. చిత్తగింపుఁడు.

కారికవంటి శ్లోక మిది

''నవ దుర్గ ఇదం భర్గ స్సారం సప్తశతీరితం
నానా ప్రాణి ప్రాణసంఖ్యాలయాధ్యాయ మితం తతం ॥

అన్వయము : నవ (నవార్ణ మంత్రములోని) తొమ్మిది యక్షరములును, దుర్గే=దుర్గే స్మృతా . అను శ్లోకము, (ఈ రెండును కలిసి) సప్తశతీ + ఈరితం=సప్తశతి యని చెప్పబడు, ఇదం—సారం—భర్గః=ఇదే శ్రేష్ఠమైన దేవీ తేజము. నానాప్రాణి ప్రాణ సంఖ్యా=రకరకములైన జీవులయందలి జీవముల లెక్కల, లయ=లయముతో— (అనగా వ్యష్టి—సమష్టిరూప జీవభావ నాశము, అదే పర బ్రహ్మైక్య మోక్షమని కదా మన వేదాంత సారము ! అట్టి) అధి + ఆయ=శుభావహ విధి అధికరణమునందు, మితం=చాలినది. తతం=విస్తరించినది. ఈ దుర్గాతేజము బ్రహ్మ నంద మనుట.

మరొక రకముగా, నానాప్రాణి = రకరకములైన హల్లుల (సంయుక్త వ్యంజనములందు విడివిడిగా) ప్రాణ= అచ్చులయొక్క, సంఖ్యా=(కా దినవాధి సూత్ర సిద్ధమైన) సంఖ్యతో లయ + అధ్యాయ (ల=3, య=1 అంకానాం వామతో గతిః) పదుమూడు అధ్యాయములతో, మితం=మితమును, తతం=విస్తృతమునైన సప్తశతీ=ఏడువందలు కలదని, ఈరితం=ప్రసిద్ధ.

## అక్షర సంఖ్యా వివరము

| | | | |
|---|---|---|---|
| ఐమ్ = | 12+5=17 | డా= | 3+2=5 |
| హ్రీమ్=8+2+4+5=19 | | య్యై= | 1+12=13 |
| క్లీమ్= | 1+3+4+5=13 | వి= | 4+3= 7 |
| చా= | 6+2= 8 | చ్చే= | 6+6+11=23 |
| ముం= | 5+5+15=25 | మొత్తం= | 130 |

| | | | |
|---|---|---|---|
| దు= | 8+5=13 | స్వ= | 7+7+4+1=19 |
| ర్గే= | 2+3+11=16 | స్థై= | 7+7+12=26 |
| స్మృ= | 7+5+7=19 | స్మృ= | 7+7+5+7=26 |
| తా | =6+2= 8 | తా= | 6+2= 8 |
| హ= | 8+1= 9 | మ= | 5+1= 6 |
| ర= | 2+1= 3 | తి= | 6+3= 9 |
| సి= | 7+3=10 | మ= | 5+1= 6 |
| భీ= | 4+4= 8 | తీ= | 6+4=10 |
| తి= | 6+3= 9 | వ= | 4+1= 5 |
| మ= | 5+1= 6 | శు= | 5+5=10 |
| శే= | 5+11=16 | భాం= | 4+2+15=21 |
| ష= | 6+1= 7 | ద= | 8+1= 9 |
| జం= | 8+1+15=24 | దా= | 8+2=10 |
| తోః= | 6+13=19 | సి= | 7+3=10 |
| | 167 | | 175 |

| | | | |
|---|---|---|---|
| దా= | 8+2=10 | స= | 7+1=8 |
| రి= | 2+3=5 | ర్వో= | 2+4+13=19 |
| ద్ర్య=8+2+1+1=12 | | ప= | 1+1= 2 |
| దుః= | 8+5+16=29 | కా= | 1+2= 3 |
| ఖ= | 2+1= 3 | ర= | 2+1= 3 |
| భ= | 4+1= 5 | క= | 1+1= 2 |
| య= | 1+1= 2 | ర= | 2+1= 3 |
| హా= | 8+2=10 | ణా= | 5+2= 7 |
| రి= | 2+3= 5 | య= | 1+1= 2 |
| ణి= | 5+3= 8 | స= | 7+1= 8 |
| కా= | 1+2= 3 | దా= | 8+2=10 |
| త్వ= | 6+4+1=11 | ర్ద్ర= | 2+8+2+1=13 |
| ద= | 8+1= 9 | చి= | 6+3= 9 |
| న్యా= | 10+1+2=13 | త్తా= | 6+6+2=14 |
| | 125 | | 103 |

అన్నింటి మొత్తము=700 = సప్తశతి=ఇందులోనె 13 అధ్యాయములు.

'దుర్గేస్మృతా' అను శ్లోకము చాల ముఖ్యమైనదిగా గుర్తింపబడి సర్వసమ్మతమైనది. నవార్ణమూలము. ఈ శ్లోకము కలిసి దుర్గా (భర్గః) తేజము అనుటచే ఈ శ్లోకము గాయత్రీ ప్రతీక అని ధ్వనించుచున్నది. దుర్గే=పోవుటకు లేక పొందుటకు కష్టమైన ఐహికాముష్మిక విషయమునందు, హరసి భీతి మశేష జంతోః=అన్ని జంతువులయొక్క భయమునుహరింతువు అనుటలో ''గాయంతం—స్మరంతం త్రాయతే—ఇతి గాయత్రీ''అనునర్థమును, ''మతి మతీ వ శుభాం దదాసి'' అనుటలో ''ధియో యోనః ప్రచోదయాత్'' అను నర్థమును గూఢముగా ప్రక్షేపింపం బడినవి. 'సారం' వరేణ్యమును, ఇదం భర్గః=గాయత్రిలోని భర్గ శబ్దమును స్మృతా=ధీ మహి పదమును జ్ఞప్తి చేయుచున్నవి.

ఈ తేజస్సే—ఈ దుర్గా గాయత్రీ రహస్యమే పదుమూడధ్యాయములుగా విస్తరింపబడినది. బ్రహ్మయొక్క సకలదేవతల యొక్క భీతినివారణరూపమైన మధుకైటభ—మహిషాసుర—శుంభ నిశుంభ సంహారకథ హరసి భీతి మశేష జంతోః యనుటకు, బృహద్వివరణ రూపమైన ఉదాహరణము. స్వస్థైః= తన యందు (ప్రసన్న భావముతో) నిలచిన వారికి, మతమతీవ శుభాం దదాసి యనుటకు సమాధికి 'మమేత్యహమితి' సంగవిచ్యుతి కారకమైన జ్ఞానము ప్రసాదించుట తాత్పర్యము. ఇంత మహిమగల ఈ శ్లోకముతోడి ప్రార్థన భాగముగల మధ్యమచరిత్రకే ప్రత్యేక పారాయణార్హత కలిగినది. ఇది వినా ప్రథమ—ఉత్తమ చరిత్రలు

( మిగతా 51 వ పేజీలో )

# కాళిదాసత్వం

## శ్రీ మిరియాల రామకృష్ణ

కవిత్వం ముసిల్దై పోయిందని
నిట్టూర్పు విడుస్తున్న ఒకాయనకి నేను
కాళిదాసుని చదవండని సలహా యిచ్చాను.

సరస్వతి తప్పిపోయిందని
వీధుల్లో చాటిస్తున్న ఒక హృదయానికి నేను
నిజం చెప్పాను
నిన్నరాత్రి కాళిదాస కావ్యగేహళిలో
ఆమెను చూశానని.

నాకేసి అనుమానంగా చూసిన
ప్రాచీన కవులకి
ఒక శ్లోకం వినిపించి
టీకా తాత్పర్యా లుపన్యసించి
"పురాణ మిత్యేవ న సాధుసర్వం" అన్నాను.

నవ్య కవిత్వమంటే ఏమిటని
బెంచీ లడిగినపుడు
"అస్తి కశ్చిద్ వాగ్విశేషః" అని
మితభాషి నయ్యాను.

* * *

పంచభూతాలుంటే గాని ప్రపంచం పుట్టదు
పంకం లేనిదే పద్మం పుట్టదు
వర్షం లేనిదే హరివిల్లు రాదు
ఆవేశం లేనిదే కవిత్వం లేదు.
రసావేశం వేసుకున్న
రమణీయ భూమిక కవిత్వం
కవిత్వానికి మరోపేరు కాళిదాసత్వం
వాగర్థాల బిగికౌగిలి రసత్వం
రసత్వం అంటేనే కవిత్వం
కవిత్వం అంటేనే కాళిదాసత్వం.

కాళిదాసు శబ్దాల అర్థాలు
కోశాల్లోనే చూడకు
అతని చేతిలోని శబ్దాలు
కొత్త అర్థాల రేకులు విప్పుకుంటాయి
అర్థాలు అర్థాంతరాల
పరిమళాల్ని పంపిస్తాయి
'లక్షణ'అతడిచ్చే దక్షిణ
'వ్యంజన' అతను చేసే రంజన
వాటికోసం
ఆనందవర్ధనుడ్ని ఆరాధించు
అభినవ గుప్తుడ్ని ప్రార్థించు
మల్లినాథుడ్ని సంప్రదించు
విశ్వనాథుడ్ని ప్రశ్నించు
జగన్నాథుడ్ని శుశ్రూషించు
కాలాలు, దేశాలు దాటి
జలనిధులు, కులగిరులు దాటి
పురాణకాలంనుంచి నవీనకాలంలోకి
ఎగిరివచ్చే కవికోకిల కాళిదాసు
దాన్ని చూడలేక పోతే
గెథేనీ మోనియర్ విలియమ్సునీ
**HILLE BRANDT** నీ
అరవిందుడ్నీ రవీంద్రుడ్నీ అడిగి
సరికొత్త సులోచనాలు ధరించు !

* * *

మా వాడొకడు
నూరు పుస్తకాలు రాస్తేనే మహాకవి
అంటాడు !
కాళిదాసు రాసినవి ఆరో ఏడో అంటాను!

ఇంకోడు
పది బిరుదులుంటేనే మహాకవి
అంటాడు !
అతనికి కాళిదాసేగానీ వేరే బిరుదులేదంటాను

మరొకడు
పద్యాలు రాస్తేనే మహాకవి
అంటాడు
నాటకాంతం హి సాహిత్యం అంటాను.
నేను చెప్పిన సమాధానాలు బుర్రకెక్కక
వీళ్ళంతా
గిరజాలు దువ్వుకుంటూ
లాల్చీలు సవరించుకుంటూ
పద్యాల చట్టాల కోసం
పరిశోధన సాగించుకుంటున్నారు.
ప్రతిభ ఎక్కడో జారిపోయింది
రసం ఎన్నడో కారిపోయింది
వెదుక్కుంటూ వెనక్కి వెళ్తున్నారు
ఇప్పుడైనా కాళిదాసు కనిపిస్తే
మనకి
"శరచ్చంద్రచంద్రికా ధవళ"మైన
కవిత్వం కనిపిస్తుంది
నవత్వం మెరుస్తుంది !

* * *

నిన్నరాత్రి ఒకతను మా యింటి కొచ్చాడు
పేరు? అన్నాను
మోనియర్ విలియమ్సు అన్నాడు
ఆంగ్లేయుడని అర్థమయిపోయింది
అతని చేతిలో పుస్తకం
ఆతనుడి చేతిలో పువ్వులాగుంది
శృంగారమా? బంగారమా? అన్నాను
నవ్వుతూ
'శాకుంతలం !' అన్నాడు !
నువ్వు రాశావా? అన్నాను
అబ్బే నా తర్జుమా అంటూ
విప్పి చదివి వినిపించాడు!
అబ్బా అన్నాను
అదృశ్యమైపోయాడు !

* * *

మంచుకొండా మబ్బు ముక్కా
కాదేదీ కవిత కనర్హం అంటూ
కాళిదాసు చెబితే ఆశ్చర్యంగా ఉండొచ్చు
కానీ నిజం!
మబ్బుతునక తన కావ్యసృష్టికి ప్రేరకం
అన్నాడు
అంతే! 'మేఘదూతం' మెరిసింది
ఇంతలో
భ్రమరదూతం, పవనదూతం
హంసదూతం, చంద్రదూతం
వంటివెన్నో నన్ను చూద్దాని కొచ్చాయి
ఏమిటా ఇదనుకున్నాను

అనుకరణే కదా అని నిట్టూర్చాను
పెదవి విరిచాను.

రామగిరిలో బయల్దేరి
అలకా నగరం వెళ్లింది మబ్బు
దార్లో ఎంతో దేశం చూసింది
ఎక్కడో ఒక అల్పకవి కనిపిస్తే
"నాయనా కాళిదాసులా దేశం తిరుగు
నీ లోకజ్ఞానం పెరుగు" అంది
అల్పకవికి ఆగ్రహం వచ్చి
కూపస్థ మండూకంలా
ఒక్క నగరంలోనే ఉండిపోయాడు.

* * *

అమ్మాయి అత్తవారింటి కెదుతోంది
అమ్మాయి వెళ్లిపోతే
వాకిట్లో తీగల్నెవరు చూస్తారు ?
ఈ లోటు పూడేదెలా ?
ఇవి ప్రశ్నలు కావు
వేదనా తరంగాలు !
కానీ
తీగ చెట్టుని చుట్టుకోబోతోంది
ఇది ఆనంద మకరందం !

ఇంతకూ ఎవరతను?
తానే కణ్వుడై పోయిన కాళిదాసు !
శృంగారానికేం
యథాశక్తి అందరూ పోషిస్తారు !
సత్తా బయటపడేది
సాత్త్విక ప్రవర్తనంలోనే!
ఆవేశ సంయమనాల మధ్య మెరిసే
కావిరంగు మనస్తత్వం
కాళిదాసుది!

* * *

ఉపమానాలు విపణివీథి నిండా ఉన్నాయి
కానీ
కొనుక్కునే సత్తా ఎందరికుంది
ఒక్క కాళిదాసు అయినవాడికే
ప్రణయం ప్రతిమనస్సునిండా ఉంది
కానీ
ఇచ్చే సమయజ్ఞత ఎందరికుంది
ఒక్క కవికుల గురువైన వాడికే

* * *

అయ్యా కవులారా బహుపరాక్
ముందు మీ విమర్శనేత్రం తెరవండి
ముందు ఔచిత్య తీరానికి నడవండి
ముందు పునాదులు కట్టండి
సంప్రదాయం తెలుసునని
గోతిలో పడకండి
ప్రయోగశిఖరం ఎక్కండి
ప్రయోగం ప్రియురాలితో కూడి
సంప్రదాయం తల్లిని తరిమేయకండి
ఎందుకండీ అలాచేస్తారు
ఊ ఇమిటేషన్
అది పొయిట్రీ కాదు
ఎవరి చొక్కానో తొడుక్కోడం
ఎవరి గిరజాలో అతుక్కోడం
వాగర్థాల అద్వైతం మన మతం
అంటున్నాడు కాళిదాసు
స్పష్టంగా విన్నాను
కానీ
మీకు కాళిదాసుకన్నా ఆత్మవిశ్వాసం జాస్తి
ఆత్మశక్తి మాత్రం నాస్తి
వినండి కాళిదాసు వినయం

"మందః కవియశః ప్రార్థీ
గమిష్యామ్యుపహాస్యతామ్"

---

# అనంతరాగం

( 43వ పేజీ తరువాయి )

కన్నడంలోకూడా ముద్రించవలసి ఉండడంవల్ల కాబోలు దీని పూర్తిముద్రణ మైసూరులోనే జరిగింది. తెలుగుప్రాంతం కానిచోట ముద్రితమైన భాగంకూడా సర్వాంగసుందరంగా తయారు కావడానికి సుందరంగారి శ్రద్ధ కారణంకావచ్చు. తెలుగుప్రాంతం కాకున్నా మైసూరులో తెలుగుముద్రణ రమారమి ఒక శతాబ్దం నుంచీ జరుగుతూనే ఉన్నది.

ఎంతో ముచ్చటగా ముద్రించబడి బహుజనోపయుక్తమైన యీ రాళ్లపల్లి అభినందనగ్రంథం ఆంధ్రులందరి ఆదరాభిమానాలను అందుకోగలదని ఆశిస్తున్నాను.

— శ్రీ బులుసు వేంకటరమణయ్య

---

# సప్తశతి

( 49వ పేజీ తరువాయి )

ప్రత్యేక పారాయణార్థత గోల్పోయినవి. "ఏకే నవా మధ్యమేన నైకేనేతర యో రిహ" అని చెప్పటలో అంతరార్థ మిదేనేమో?

ఎల్ల చిల్లర దేవతల మూలమంత్రములకును, ఆ యా గాయత్రి ఉండగా నవార్ణమంత్రమునకు గాయత్రి లేకపోవుటేమి?

బహుశః ఈ దుర్గే శ్లోకమున గాయత్ర్యర్థము నిబంధింపబడి యుండుటచేతనే కాబోలును. దారిద్ర్యదుఃఖభయహారిణీత్వము—సర్వోపకారకరణార్ద్ర సదార్ద్ర చిత్తత్వము—అకించనులకు—దుఃఖార్తులకు—భయార్తులకు—సకల విధ సాహాయ్యకాములకు— ఆ తల్లి తంగేటి జున్ను అను విషయమును విశదీకరించుచున్నది.

దుర్గాయై జయమంగళం.

శ్రీ కుంటముక్కల లక్ష్మీనారాయణశర్మ

# కనుబొమల్లో...భాషాశాస్త్రం

ఆధునిక భాషాశాస్త్రం అభివృద్ధి పొందుతున్న నవీన కాలంలో సాహిత్య సంబంధి విశ్లేషణలు అనేకం ఉత్పన్నమయ్యాయి. వీటిల్లో అధికభాగం కవిత్వాన్ని విడదీసి భాషాప్రాధాన్యాన్ని వివరించాయి. ఈ విశ్లేషణలు సాహిత్యాన్ని అర్థంచేసుకోవడానికి ఎంత వరకు తోడ్పడుతాయన్నది సందేహాస్పదమే. సాహిత్యాన్ని అర్థం చేసుకోవడానికి భాషాశాస్త్రం, సాహిత్య (విమర్శన) శాస్త్రం (కలసి లేదా విడి విడిగా) ఏ విధానంలో తోడ్పడుతాయో చర్చించటానికి మరొకవిభాగం, శైలీశాస్త్రం (Stylistics) పేరిట వెలసింది. ఈ వ్యాసము భాషాపరమైన విశ్లేషణను (శైలీశాస్త్రపు పూర్వ స్థితిని) తెల్పుతుంది. ఇందుకు లక్ష్యంగా 'యెంకి' కనుబొమ్మ (యెంకిపాటలు పేజీ—24) తీసుకొనడం జరిగింది.

(పాఠకుల సౌకర్యార్థం 'కనుబొమ్మ' ఇవ్వబడింది)

నన్ను తలుసుకు యెంకి కన్ను మూయాలి (1)<br>
కనుబొమ్మ సూడాలి<br>
కరగి పోవాలి<br>
నన్ను కలలో సూసి నవ్వుకోవాలి (4)<br>
కనుబొమ్మ సూడాలి<br>
కరువు దీరాలి<br>
నిదురలో సిగపూలు సదురుకోవాలి (7)<br>
కనుబొమ్మ సూడాలి<br>
కమ్మగుండాలి<br>
పిలుపేదో యినగానె తెలివి రావాలి (10)<br>
కనుబొమ్మ సూడాలి<br>
కతలు తెలియాలి (12)

గేయాన్ని నాలుగు మకుట (పల్లవి) పాదాలుగాను, నాలుగు ఖండభాగాలు (చరణాలు)గా విడదీయవచ్చును. చరణ భాగాలలోఉన్న మొదటిపాదం అనుపల్లవిగా మారి గేయమంతటా పునరుక్తమవుతోంది. తద్ద్వార అనుపల్లవి, పల్లవి ప్రయోజనాన్ని సూచిస్తోంది.

జానపదగేయ ఛందస్సు దృష్ట్యా ఈ గేయం అసమ ద్విరద ఖండగతిలో ప్రయుక్తమయిందని గమనించవచ్చును. సంప్రదాయ దృష్టితో ప్రస్తరించి చూస్తే గురులఘు వినిమయ నియమం ప్రకారం అసమ భాగాలలో చివర 'ర'గణ లోపం కన్పిస్తుంది.

భాషాశాస్త్రదృష్ట్యా గేయాన్ని మూడు దశలలో విశ్లేషించవచ్చును.

## 1) వర్ణ నిర్మాణదశ (Phonological level)

ఈ దశలో నిర్ణీతక్రమ వర్ణసంయోగాన్ని విచ్ఛేదించి చూపడం జరుగుతుంది. నిర్ణీతక్రమ వర్ణసంయోగాన్ని లెక్కించడంలో 'పౌందిక' (కావ్యనిర్మాణంలో కొన్ని అంశాల నియతమైన పునరుక్తి) సహాయపడుతుంది. వర్ణనిర్మాణ దశలో 'వర్ణాలు' అంశాలుగా మారి పౌందిక సూచిస్తాయి. వర్ణవిభాగాన్ని అనుసరించి పౌందిక రెండుగా విభజితమవుతుంది. కన్పించే తీరునుబట్టి పౌందిక అసంపూర్ణంగాను, సంపూర్ణంగాను తిరిగి విభజించుకోవచ్చును.

ఈ క్రింది సూచిక చెప్పిన విషయాల్ని సూచిస్తుంది.

### వర్ణ నిర్మాణదశ - పౌందిక<br>వర్ణ పునరుక్తి సూచిక




వర్ణ పునరుక్తి పరిశీలన గేయంలో రెండు స్థానాలలో చేయవచ్చును. ఆ స్థానాలు 1) పాద ప్రారంభాన 2) పాదాంతాన.

పాద ప్రారంభంలో హల్వర్ణ పునరుక్తి చరణాలలో సంపూర్ణంగా పాటింపబడింది. మకుటపాదాలు మొత్తం నాల్గింటిలో పూర్వార్ధభాగం (1, 4 పాదాలు) సంపూర్ణంగాను, ద్వితీయార్ధ భాగం (7, 10 పాదాలు) అసంపూర్ణంగాను హల్వర్ణ పునరుక్తి ఇమిడిఉంది. మకుటం అసంపూర్ణ హల్వర్ణ పునరుక్తికి, చరణాలు సంపూర్ణ హల్వర్ణ పునరుక్తికి ప్రాతినిధ్యం వహిస్తున్నాయన్నమాట. అజ్వర్ణ పునరుక్తి చరణాలలోను, మకుటంలోను సంపూర్ణంగా పాటింపబడింది. మకుటంలో మొదటి సగభాగం (1, 4 పాదాలు) ఒక అచ్చును ('అ' వర్ణము), రెండవ సగభాగం (7, 10 పాదాలు) మరొక అచ్చు ('ఇ' వర్ణము) పునరుక్తమయ్యాయి.

పాదాంతాన చరణంలోను, మకుటంలోను హల్వర్ణ సంపూర్ణ పునరుక్తి ('ల' వర్ణ సంబంధి) కన్పిస్తుంది. అదేవిధంగా అజ్వర్ణ సంపూర్ణ పునరుక్తి ('ఇ'కార సంబంధి) గమనించవచ్చును. ఈ విషయాలను సంగ్రహంగా పట్టిక రూపంలో ప్రదర్శించవచ్చును.

## వర్ణ పునరుక్తి పట్టిక-1

| స్థానం → / ↓ వర్ణాలు* | | పాదప్రథమం | పాదాంతం |
|---|---|---|---|
| అచ్చులు | అసంపూర్ణ | — | — |
| | సంపూర్ణ | 6 | 6 |
| హల్లులు | అసంపూర్ణ | 1 | — |
| | సంపూర్ణ | 5 | 6 |

* విభిన్నాచ్చుల పునరుక్తి సంపూర్ణంగానే స్వీకరించబడింది.

ఉదాహరణలు :—

| | | పాదప్రథమం | పాదాంతం |
|---|---|---|---|
| అచ్చులు | సంపూర్ణ | కనుబొమ్మ... | ...సూడాలి |
| | (పాదాలు 5, 6) | కరువు... | ...పోవాలి |
| | ( ,, 2, 3) | | |
| | అసంపూర్ణ | నిదురలో... | — |
| | (పాదాలు 7,10) | పిలుపేదో... | |
| హల్లులు | సంపూర్ణ | నన్ను తలుసుకు... | ...సూడాలి |
| | (పాదాలు 1, 4) | నన్ను కలలో... | ...తీరాలి |
| | ( ,, 5, 6) | | |

గేయంలో వాడిన భాష ధ్వని మార్పులతో ప్రామాణిక భాషనుండి భిన్నతను సూచిస్తోంది.

# ధ్వని మార్పులు

## 1) మహాప్రాణత్వలోపం

ప్రామాణిక భాషలో పాటింపబడే మహాప్రాణత్వ లక్షణం, సజాతి అల్ప ప్రాణత్వంగా మారింది.

కథ → కత

శిఖ → శిగ

## 2) స్వర భక్తి

సంయుక్తంగాఉన్న వర్ణాలు అసంయుక్తంగామారటం.

న్రిద → నిదుర

## 3) స్పర్శలోపం

(i) తాలవ్య అనాద స్పర్శోష్మం స్పర్శత్వం కోల్పోయి స్థాన భ్రంశం చెంది దంత్యోష్మంగా మారింది.

తలుచుకు → తలుసుకు

చూడాలి → సూడాలి

చూసి → సూసి

(ii) అభిహిత తాలువర్త్స్య ఊష్మం వ్యవహారంలో అనభిహిత దంత్యోష్మంగా మారింది.

శిగ → సిగ

## 4) వర్ణసమత

ఒక వర్ణంకానీ, వర్ణసమూహం కానీ పొరుగున ఉన్న వర్ణం (సమూహం)తో, కనీసం ఒక అంశంతో అయినా సమానం కావటం.

తలచుకు → తలుసుకు

కరవు → కరువు

కరగి → కరిగి

నిదుర → నిదర

## 2) వాక్యనిర్మాణదశ (Syntactical level)

గేయనిర్మాణంలో ప్రతిఖండం మొదటిపాదం 'అనుపల్లవి', గేయ 'విషయం' (Subject)గాను, పలవి, ఇతర ఖండవాక్యాలు 'విషయి' (Attribute) గాను ప్రవర్తిస్తున్నాయి.

ఈ గేయంలో ప్రయుక్తమయిన వాక్యాల వివరాలు —

సంశ్లిష్ట వాక్యాలు — (4)
అకర్మక వాక్యాలు —

'ఉద్దేశ్యం' (1)*
'విధేయం' (4)

*ఒకే ఉద్దేశ్య అకర్మక వాక్యం నాలుగు మారులు గేయంలో కన్పిస్తుంది.

సంశ్లిష్టవాక్యాలు (లక్షణాలకు తెలుగువాక్యం 26–73) శత్రర్థక (1వ పాదం), క్త్వార్థక (4వ పాదం), అనుభవార్థక (7వ పాదం), హేత్వర్థక (10వ పాదం) ప్రతిపాదకాలుగ గేయంలో కన్పిస్తున్నాయి.

ఒకటవపాదం మకుటంలో ప్రయోగింపబడిన శత్రర్థక సంశ్లిష్టవాక్యం ప్రాధాన్య వివక్షను సూచించే నిమిత్తం కర్తృ పదం క్రియాపదానికి దగ్గిరగా ఉంది.

వాక్యనిర్మాణ దశలో 'పొందిక'లో పాల్గొనేవి వాక్యాలు. మకుటంలో సంశ్లిష్టవాక్య పునరావృత్తి సంపూర్ణంగాను, ఖండ భాగాల అకర్మక వాక్య సంపూర్ణావృత్తి కలసి గేయభాగంలో అసంపూర్ణావృత్తికి స్థానాన్ని కల్పిస్తున్నాయి. ప్రతిపాదాంతాన ప్రకమవిహిత (Processoriented) సమాపక్రియలు ప్రయోగించబడ్డాయి.

| స్థానం → / వాక్యాలు ↓ | మకుటం | ఖండభాగాలు |
|---|---|---|
| సంశ్లిష్ట | 4 | — |
| *అకర్మక | — | 5 |

## (వాక్యపునరుక్తి పట్టిక-2)

*ఉద్దేశ్యంయొక్క విధేయము, విధేయంయొక్క ఉద్దేశ్యం ఒక్కటిగా ఉండటంవలన అకర్మక వాక్యాల భేదాల్ని సంపూర్ణ పునరుక్తిగా పరిగణించాను.

(ఉదాహరణలు పట్టిక 1 వలెనే గ్రాహ్యం కనుక మళ్ళీ ఇక్కడ ఈయలేదు)

## 3) అర్థ సంబంధి దశ (Semantic level) -

మకుట పాదాంతాన ప్రయోగింపబడిన క్రియలు ప్రక్రమ విహితాలయినప్పటికీ, 1, 7 పాదాంత సమాపక క్రియలు భౌతిక మూర్తార్థ బోధనాన్ని, 4, 10 పాదాంత సమాపక క్రియలు మానసిక అమూర్త అర్థ బోధనాన్ని కలిగింపచేస్తూ తమలోతాము సంపూర్ణ పునరుక్తి కలిగి, చివరికి అసంపూర్ణ 'పొందిక' లో పరిణమిస్తున్నాయి.

ప్రతి ఖండభాగపు మొదటి పాదం ప్రక్రమ విహిత సమాపక క్రియ భౌతికార్థాన్ని, రెండవపాదం ప్రక్రమవిహిత సమాపక క్రియ మానసికార్థాన్ని బోధిస్తూ అసంపూర్ణ 'అర్థ పొందిక' తెలియ చేస్తోంది.

## అర్థ పొందిక పట్టిక-3

| క్రియలు → / స్థానం ↓ | | ప్రక్రమ విహిత సమాపక క్రియలు | |
|---|---|---|---|
| | | భౌతికార్థం | మానసికార్థం |
| మకుట పాదం | 1 (గే..సంఖ్య 1) | రైటు | |
| | 2 (గే. స. 4) | | రైటు |
| | 3 (గే. స. 7) | రైటు | |
| | 4 (గే.స. 10) | | రైటు |
| ఖండ పాదం | 1 (గే. సం.లు 2,5,8,11) | రైటు | |
| | 2 (గే. సం.లు 3, 6, 9, 12) | | రైటు |

పద సమూహ సంబంధియైన మార్పులు ఆర్థిక విజ్ఞానపర మైనవి కొన్ని కన్పిస్తున్నాయి.

ఈ గేయంలో కార్యకారణ సంబంధాన్ని దృష్టిలో ఉంచు కొని భిన్న లక్ష్యార్థాలుగా రూఢి కెక్కడం జరిగింది.

| | ప్రయోగింపబడిన పదం | మార్పు చెంది బోధిస్తున్న అర్థం |
|---|---|---|
| 1) | కరిగి | ఆకర్షింపబడి |
| 2) | కరువు | కోరిక |
| 3) | కమ్మగ | బాగుగా |
| 4) | కతలు | మాటలు |

విశ్లేషించి చూపబడిన మూడు దశలు గేయ నిర్మితిలో భాగంతీసుకొని సౌష్టవాన్ని కూర్చి పెడుతున్నాయి. మూడు దశల్లో పునరుక్తి పట్టిక లందించిన వివరాల్ని సేకరించినట్టయితే వర్ణనిర్మాణదశలో ఈ గేయం సంపూర్ణ పునరుక్తిని బలపరుస్తూ, రానురాను (వాక్య నిర్మాణ, అర్థ సంబంధి దశలలో) అసంపూర్ణ పునరుక్తి దశకు తావిస్తోంది. దీని మూలంగా గేయం బహుజన రంజకత్వం కావటానికి, కాకపోవటానికి వీలుంటుంది.

ప్రతి దశలో చూపిన భాషా శాస్త్ర విశ్లేషణ, సాహిత్య శాస్త్రాన్ని ఆధారం చేసుకొని, శైలీ శాస్త్ర సిద్ధాంతాలకు ప్రాతి పదికలై సాహిత్యాధ్యయనంలో ఏ విధంగా తోడ్పడుతాయో మరొక మారు విపులంగా చర్చిద్దాము.

## రిఫరెన్సులు :


1) తెలుగు వాక్యం—డా॥ చేకూరి రామారావు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ,
హైదరాబాదు, 1975.

2) యెంకి పాటలు—నండూరి వెంకట సుబ్బారావు
ఉదయభాస్కరా పబ్లికేషన్స్,
విజయవాడ, 1953.


(అక్కడక్కడ కన్పిస్తున్న పారిభాషిక పదాల తెలుగు వాడకం తెలుగు ఎకాడెమీ పరిభాష పట్టికలోనివి)



శ్రీ బి. జి. ఎల్. స్వామి

# తమిళ దేశంలో గోళకీ శైవమతము

*(గతసంచిక తరువాయి)*

## గోళకీ మఠము

### గోళకీ మత సంబంధమైన సంస్థలు, గురువులు :

ప్రధాన గోళకీ వంశాన్ని గురించి, దాని శాఖా వంశాలను గురించి మాత్రమే తెలిపే పైన పేర్కొనబడ్డ శాసనాలేకాక, దీనితో సంబంధము కలిగినా, ఏ వంశానికి చెందినవో అసందిగ్ధంగా నిర్ణయించడానికి వీలులేని సంస్థల, గురువులను గురించిన సమాచారం పుష్కలంగా గల శాసనాలు అనేకం ఉన్నాయి. అయితే ఈ శాసనాలు వీటికి ప్రధాన గోళకీ వంశంతో లేక ఈ పద్ధతి శైవంతోగల సన్నిహిత సంబంధాన్ని సూచిస్తాయి. ఈ సమాచారం చాలా ముఖ్యమైనది. ఎందుచేతనంటే 11వ శతాబ్దంనుంచి 14వ శతాబ్దంవరకు తమిళ దేశమంతటా ఈ మతానికిగల ప్రజాదరణను, వ్యాప్తిని ఇది తెలియ చెప్తుంది. (మాప్—2)

11వ శతాబ్దం—ఈ కాలానికి చెందిన శాసనాలన్నీ రాజేంద్రుడు I నుంచి కులోత్తుంగుడు I వరకుగల చోళరాజులు వేయించినవే. రాజేంద్రుడి గురువుపేరు, ఆయన పేరుమీద సర్వదేవన్ మఠం స్థాపించబడడంద్వారా తెలియచేయబడింది. అక్కడ మాహేశ్వరులు నివసించేవారు. (103—1925, క్రీ. శ. 1040). రాజాధిరాజు శాసనాలు రెండు మఠాలకు భూమి అమ్మకాన్ని స్పష్టంగా పేర్కొంటున్నాయి. వాటిలో ఒకటి పవిత్ర మాణిక్కం అనే పేరుతోసహా ఒక మఠాన్ని పేర్కొంటున్నది (251—1915, క్రీ.శ. 1041; 247—1915, క్రీ.శ. 1251). ఈ శాసనాలు ఉ. ఆర్కాటు జిల్లా, బ్రహ్మదేశంలోని చంద్రమౌళీశ్వరాలయంలోని గోడలమీద చెక్కబడ్డాయి. అందుచేత ఈ రెండు శాసనాలలోని మఠము ఒకటే అయివుంటుందనుకోవచ్చు. ఇక్కడే కులోత్తుంగుడు I కాలంలో రాజనారాయణ మఠమనే ఇంకొకమఠం ఉండేదనడానికి ఆధారం ఉన్నది (179–1918 క్రీ. శ. 1075). ఈ రాజు ఇతర శాసనాలు కొన్ని తిరువావడు మలైలోని తిరువిడి మఠాన్ని, (147–1925, క్రీ. శ. 1084) తిరుక్కడైయూర్‌లోని మార్కండేయ మఠాన్ని (243–1925, క్రీ. శ. 1096) పేర్కొంటున్నాయి. ఈ రెండు మయూరం తాలూకాలో ఉన్నాయి. బహుశా ఇదే శతాబ్దానికి చెందిన తారీకు లేని శాసనం ఒకటి, ద. ఆర్కాటుజిల్లా, తిరునామనల్లూరులోని గుడిలో చండీశ్వర విగ్రహాన్ని ప్రతిష్ఠించిన, వామశివుడనే గురువును పేర్కొంటున్నది.

12వ శతాబ్దం—తిరువావడుమలైలోని మరికొన్ని మఠాల పేర్లు వింటాం:- తిరునీల విటంకన్ మఠము (144–1925, క్రీ. శ. 1101), శివలోక నాయకన్ మఠము (148–1925, క్రీ. శ. 1116), పరమాణవాచకన్ మఠము (155–1925, క్రీ. శ. 1109). వీటిలో శివలోక నాయక మఠము విక్రమ చోళ దేవుడి కాలంలో మరికొంత ఆదరణను పొందింది. (149–1925, క్రీ. శ. 1121). తిరుచ్చి జిల్లా, కుళిత్తలై తాలూకా, రత్నగిరిలో శివయోగులకు, తపస్యులకు భోజన సదుపాయార్థము ఎళునూట్రువన్ పేర ఒక మఠము ఉండేది. (179–1914, క్రీ. శ. 1109). కులోత్తుంగచోళన్ మఠము, కులోత్తుంగుడు I పేర స్థాపించబడి వుంటుంది. అది కుంభకోణం తాలూకాలోని శివపురంలో, మాహేశ్వరుల భోజన సదుపాయంకోసం కట్టబడింది (277–1927, క్రీ. శ. 1075). ఈ సంస్థ విక్రమచోళుడి కాలంలో కూడా ఉండేది. అపుడు అది మాహేశ్వరుల భోజనార్థం అనేక దానాలను పరిగ్రహించింది (272–1927, క్రీ. శ. 1122). శాసనాలలో పేర్కొనబడిన విక్రమచోళుడినాటి ఇతర మఠాలు.

ఐంగ్రేట్రిణన్ మఠము (60–1930/1, క్రీ. శ. 1121)—తంజావూరుజిల్లా, కుంభకోణం తాలూకా, కుంజనూర్.

పరసమయ కెళరి మఠము (534—1918, క్రీ. శ. 1121)—తంజావూరు జిల్లా, అచ్చపురము.

తిరుచ్చిట్రంబలముడైయాన్ మఠము (438—1918, క్రీ. శ. 1122)—తంజావూరుజిల్లా, శియలి తాలూకా, తిరుక్కురుకవురు.

ఆచారశీలన్ మఠము (33—1932/3, క్రీ.శ.1123) చింగల్పట్టుజిల్లా, సాలూరు.

ఈ మతగురువులలో, మంగలక్కుడికి చెందిన 'స్వామి దేవర్' శ్రీకంఠ—శివుడు కులోత్తుంగుని శాసనంలో పేర్కొనబడ్డారు (301–1907). రంగాచార్య (1915) బ్రహ్మమీమాంస భాష్యం వ్రాసినవాడు. ఈ శాసనంలో పేర్కొనబడిన వాడే అని అభిప్రాయపడుతున్నారు. విక్రమచోళుడి శాసనాలు జ్ఞాన—శివుడు లేక అళగియ—విటంకన్—ఉయ్యవందన్ అనే గురువును

పేర్కొంటున్నాయి (144–6–1926, క్రీ.శ.1112). ఇంకొక జ్ఞాన–శివుడు, ఉమాపతి–దేవుడనే మరొకపేరుగలవాడు రాజాధి రాజు (?II) శాసనంలో కనపడతాడు. ఈయన గౌడదేశంలోని దక్షిణ – రాఢరాష్ట్రానికి చెందిన వాడుగా పేర్కొనబడ్డాడు. (20–1899, క్రీ.శ.? 1168) కులోత్తుంగుడు III కాలంలో దక్షిణ–రాఢరాష్ట్రం నుంచే వచ్చిన మరొక గురువు శ్రీకంఠ–శంభువు, సోమేశ్వరదేవుని విగ్రహప్రతిష్ఠ చేశారని చెప్పబడుతోంది (402–1925, క్రీ.శ. 1182). బహుశా ఈ శ్రీకంఠ — శంభువు శిష్యుడే అయివుంటే, సోమేశ్వరుడు–కులోత్తుంగుడుIIIకు గురువు–కుంభకోణంలోని తిరుభువనంలో శివ పార్వతుల విగ్రహాలను ఆ రాజు కాలంలోనే ప్రతిష్ఠించాడు (54—1914).

13వ శతాబ్దం— ఈ కాలంలో గోళకీ వ్యవస్థలు చోళ, పాండ్య రాజ్యాలంతటా బాగా వ్యాప్తిచెందాయి. రాజరాజు IIIరాజ్య కాలంలో, ఉత్తర రాష్ట్రంలోని, ఉత్తరాగ్రహారానికి చెందిన, స్వామిదేవర్ అని పిలువబడే సోమనాథ దేవుడనే గురువు, చిదంబరంలో ఒక పువ్వులతోటను పెంచడానికి, దానికి కావలసిన నలుగురు తోటమాలులను నియమించడానికి కొంత దానాన్ని పరిగ్రహించాడు (9–1935/6, క్రీ.శ. 1219). తంజావూరు జిల్లా, తిరువలంగాడులోని వణ్ణార–మాదేవ–ఆండారు మత అధిపతులలో ఆండార్–విదివిటంక–ప్పెరుమాళ్ ఒకడు (96–1926, క్రీ. శ. 1227). శిరుత్తొండ మతాధిపతి అయిన నమశ్శివాయ దేవన్‌ను గురించికూడా మనంవింటాం. ఈయన ఆండార్–మరుదప్పెరుమాళ్ వంశానికి చెందినవాడని చెప్పబడుతోంది. ఈ శాసనం తంజావూరు జిల్లా, నన్నిలం తాలూకా, నియత్తునంగైకు చెందినది. (76 — 1922, క్రీ. శ. 1232). తిరువావడుతురైలోని గోముక్తేశ్వ రాలయానికి అనుబంధంగా ఒక మఠము ఉన్నట్లు, దానికి ఈ ఆలయంతో సన్నిహితసంబంధం ఉన్నట్లు తెలుస్తోంది. దాని అధిపతి కూట్రున్ కుడైయాన్–తిరువేకంబి ముడైయాన్ లేక తిరువావడు తురై యాన్ (156–1925, క్రీ. శ. 1237).

ఉ. ఆర్కాటుజిల్లా, వాలాజీపేటలోని వీరగండ గోపాలుడి శాసనం ఒకటి ముదలియార్–నందికేశ్వర – శివుడు, అరుంత నంశైదార్ మఠము నిర్వహించడానికి కొంతభూమిని దానంగా పరిగ్రహించాడని చెప్తుంది (60–1945/6). వీరగండ గోపాలుడి కాలంలో చెంగల్పట్టు జిల్లాలోని, తిరుక్కచ్చియూర్‌లో త్యాగవినోదన్ మఠంఉండేది. విశ్వేశ్వరదేవముదలియార్‌అనే గురువుకు ఆ మఠంతో సంబంధం ఉండేది (58–1932/3).

జటావర్మన్ సుందరపాండ్యుడి కాలంలో కుంభకోణం తాలూకాలోని ఉద్దైయలూరులో అభిముక్తన్ మఠం అనే మఠ ముండేది. దీనిని శివపాదశేఖరమంగలంకు చెందిన తపస్వి విద్యాశివ పండితుడు లేక తిరుచ్చిట్రం బలముడైయార్–తిరుత్తైగూర్–నాయనార్ కట్టించాడు (311–1927). ఈ స్థలం విక్రమ–చోళుడి కాలంలో శ్రీ–మహేశ్వర స్థానంగా ప్రాముఖ్యం వహించినదనే విషయం గమనించదగింది (303–1927). ఈ సుందర పాండ్యుడిదే ఇంకొకశాసనం కవిరాజ బిరుదమున్న ఈశ్వర–శివుడి గురించి చెపుతుంది (47–1924). రామనాథపురం జిల్లా, తిరుపుత్తూరులోని తిరుజ్ఞానసంబందర్ మఠాధిపతి శ్రీకంఠ–శివుడు (129—1908). భవితాచార్యుడు లేక దక్షిణామూర్తి—శివుడు మిలైయార్–పట్టణంలోని మఠంలో నివసించేవాడు (52—1946/7).

గంగోళి—జ్ఞాన—శివుడు లేక స్వామిదేవుడు అనే గురువు విశ్వేశ్వరుడికి గుడికట్టించాడు. పల్లవ కొప్పెరుంజింగడు దానికి దానాలు ఇచ్చాడు (242—1939/40. క్రీ.శ. 1235). ఈ రాజుదే ఇంకొక శాసనం దక్షిణ—రాఢరాష్ట్రానికి చెందిన గంగోళి–ఈశ్వర–శివుడు లేక తిరుచ్చిట్రంబలం—ఉడైయార్ అనే ఇంకొక గురువును గురించి చెపుతుంది (105—1934/5, క్రీ శ. 1252 ప్రాంతం).

ఈ గురువులు, మఠాలుకాక గోళకీ సంస్థలకు సంబంధించిన మఠాలు ఇంకా చాలా ఉండేవి. ఇవి ప్రధానంగా ప్రజాసేవకు సంబంధించినవి. ఇవి చోళ, పాండ్య దేశాలలో వ్యాపించి ఉండేవి.

## చోళ-

వల్మరావన్ మఠం, చెంగల్పట్టు జిల్లా, సాలూరు
26—1922/3 క్రీ. శ. 1209.

తిల్లైవాళందనాన్ మఠం, ఉ. ఆర్కాటుజిల్లా, తిరువేంకాడు 404–1922, క్రీ. శ. 1211.

అంబరక్కడైయార్ మఠం, చెంగల్పట్టు జిల్లా, తిరుప్పలైవనం
350—1928/9, క్రీ. శ. 1223.

వణ్ణార—మాదేవ—ఆండన్ మఠం, తంజావూరు జిల్లా, తిరువాలంగాడు
93—1926, క్రీ. శ. 1227.

గండగోపాల–మాణిక్కమఠ, చెంగల్పట్టుజిల్లా, తిరుప్పలైవనం
330—1928/9, క్రీ. శ. 1234.

వడిక్కిళ్‌మఠం, తంజావూరు జిల్లా, తిరుమక్కోట్టై
262—1917 క్రీ. శ. 1247.

మనువిళంగప్పెరుమాళ్ మఠం, తంజావూరు జిల్లా, కోయిల్–దేవరాయన్ పెట్టై
278—1923, క్రీ. శ. 1251

## పాండ్య-

వీరపండితన్ మఠం,తిరునల్వేలి జిల్లా, తిరువాలేశ్వరం
357—1916

ముదలియార్ మఠం, రామనాథపురం జిల్లా, తిరుక్కలక్కుడి 35—1916

శేరమాన్—పెరుమాళ్ మఠం, రామనాథపురంజిల్లా, ఇరని యూర్ 8—1926

నరలోక సూరిరన్ మఠం, మధుర 4—1915

14వ శతాబ్దము, తరువాత ఈ కాలంలోను, తరువాతి శతాబ్దాలలోను గోళకీ మఠాన్ని, దానికి సంబంధించిన సంస్థలను గురించిన ప్రస్తావనలు శాసనాలలో కొంత హఠాత్తుగానే తగ్గి పోయి కనిపిస్తాయి. అంతరించిపోక మిగిలిన ఆ కొద్ది సంస్థలు, వారిచే జయింపబడిన తమిళ ప్రాంతాల్లో విజయనగర రాజవంశీ యులచేత పోషించబడ్డాయి. ఇంకా దక్షిణాన ఉన్నవాటిని పాండ్య రాజులు ఆదరించారు.

కంపన ఒడయార్ 305—1919 (క్రీ. శ. 1359) శాసనం విజయనగర రాజుల శాసనాలలో ఈ మతగురువుల ప్రస్తా వన కల వాటిలో మొదటిది. దీనిలో తిరువణ్ణామలైలో పెరియ మఠముకు చెందిన విశ్వేశ్వర—దేవుడు పేర్కొనబడ్డాడు. ఒక్క II శాసనం ఒకటి చెంగల్పట్టు జిల్లాలోని రామగిరిలోగల మఠానికి అధి పతియైన సత్యదర్శని కొంత భూమిని దానంగా పరిగ్రహించిన సంగతి చెపుతుంది. (642–1904, క్రీ. శ. 1382). సాళువ వంశీయుల కాలంలో అఘోర—నాయనార్ అనే గురువు తిరువెణ్ణై నల్లూర్‌లోని మఠంలో నివసించేవాడు; (408–1921, క్రీ. శ. 1478), తెర్కిల్ మఠానికి చెందిన నమశ్శివాయదేవుడు ఆ కాలం లోనే జీవించాడు (95-1942/3). సదాశివరాయల కాలంలో, కడలూరు తాలూకాలోని తిరువడిలో కందస్వామి మఠం వర్ధిల్లింది (411–1921, క్రీ. శ. 1562),

ఆమర్దాశ్రమ వంశానికి చెందిన మహాగణపతి నాయనార్—లేక వామదేవ నాయనార్ అనే గురువు 15/16 శతాబ్దాలకు చెందిన పాండ్యరాజులనుంచి భూదానం గ్రహించాడు. (465, 516–1917) ఊరుడైయ—ముదలి వంశానికి చెందిన శెంప కవన్—పెరుమాళ్ 582–1917లో పేర్కొనబడ్డాడు. ఉమై యోరు భాగ—ముదలి తిరునల్వేలి జిల్లాలోని కుత్తాలంలో ఒక మఠం నిర్వహించేవాడు (601–1917, క్రీ. శ. 1572ప్రాం).

## తిరుజ్ఞాన సంబందన్ మఠము, ఆళుడైయ పిళ్లై

ఈ మఠాన్ని పేర్కొనే శాసనాలలో అతి ప్రాచీనమైనవి 13వ శతాబ్దానికి ముందులేవు. ఈ క్రింది శాసనాల పట్టికను బట్టి ఈ పేరుగల మఠాలు తమిళదేశంలో చాలా ప్రాంతాలలో విస్తరించుకుని వుండేవని గ్రహించవచ్చు.

| | | |
|---|---|---|
| 585—1908 | రాజరాజు III | తిరుచి |
| 199—1932/3 | ,, | తంజావూరు |
| 392—1908 | ,, | ,, |
| 126—1910 | కులశేఖరుడు I | మధుర |
| 13—1894 | ,, | ,, |
| 311—1927/8 | కులోత్తుంగుడు III | రామనాథపురం |
| 129—1908 | సుందరపాండ్యుడు I | ,, |
| 98—1924 | వీరపాండ్యుడు | ,, |
| 359—1916 | వీరపాండ్యుడు | తిరునల్వేలి |
| 132—1894- | సుందరపాండ్యుడు | ,, |
| 131—1894 | ,, | ,, |

తిరువ్వలుత్తురైలోని మఠము (585–1908) మాహేశ్వ రుల భోజన వసతికై ఉద్దేశింపబడింది. మిగిలినవి అక్కడి మఠాధి పతులద్వారా, అక్కడ నివసించే గురువుల ద్వారా మతవ్యాప్తి చేయడం కోసం స్థాపించబడ్డాయి. చాలా శాసనాలు మఠాధిపతులను పేర్కొంటున్నాయి. వారిపేర్లు ఈ ఈ విధంగా వుంటాయి : ఈశాన—దేవుడు (311–1927/8), శ్రీకంఠ—శివుడు (129–1908), జ్ఞాన—శివుడు (392–1908), తత్పురుష—శివుడు (**SII V. No. 301**), వాగేశప్పెరుమాళ్ (199–1932/3), పుకళిప్పెరుమాళ్ (359 – 1916), పరమాత్మ — దేవుడు (98—1924) మొ॥. వీరిలో తత్పురుష—శివుడు తిరువారూరు లోని దక్షిణ గోళకీ మఠానికి పీఠాధిపతి. పుకళిప్పెరుమాళ్ జ్ఞానా మృతాచార్య వంశానికి చెందినవాడు. జ్ఞాన—శివుడు తిరుచ్చత్తి ముట్టం వంశానికి చెందినవాడు. మధురజిల్లా తెన్‌కరైలోని మఠము పండరంగవాణర్ వంశానికి చెందినది. మనము పూర్వమే ఈ వంశాలన్నీ గోళకీ ప్రధానవంశపు శాఖలని గ్రహించాము. అంతే కాక 131, 132—1894, ఈ వంశాలకూ, గోళకీ మఠానికీ గల సన్నిహిత సంబంధాన్ని స్పష్టంగా నిరూపిస్తున్నాయి.

సమయాచార్యులని పిలువబడేవారిలో ప్రథముడైన ఆళు డైయ పిళ్లైకు, "తిరుజ్ఞాన సంబంధన్" అనే పేరు 11 వ శతాబ్దంలో మొదట పెట్టబడిందనే విషయం వేరొక స్థలంలో (స్వామి, 1971) చూపించబడింది. తరువాతి శతాబ్దాలలో ఈ పేరుకు ఎంత ప్రాచుర్యం కలిగిందంటే, ఆ పేరుమీద మఠాలు, గుడి తోటలు [నందవనాలు], దేవాలయాలలో ప్రత్యేకమంటపాలు కట్టబడ్డాయి. ఈ పేరు పెట్టుకొన్న వారు చాలామంది ఉండేవారు [అల్వై దొరస్వామి పిళ్లై, 1958; సింగారవేలన్ 1969]. దీనిలో గమనించదగిన ముఖ్యవిషయం గోళకీ వంశానికి చెందిన గురు వులు కూడా ఈ పేరును పెట్టుకొనేవారు [ఉ॥131, 132 — 1894]. దీనినిబట్టి తమిళదేశంలో ఈ మతం స్థిరపడే సమ యంలో ఈ సమయాచార్యుడు ఈ మతవ్యవస్థలోకి స్వీకరించ బడ్డాడు అని గ్రహించవచ్చు. ఆళుడైయ పిళ్లైకి ఈ కొత్త పేరు

పెట్టబడడం ఈ విధంగా గోళకీ మతానుయాయులచేత చేయబడింది.

## తిరుచిజిల్లా, జంబుకేశ్వరంలోని శైవ మ తా లు

తిరుచి జిల్లాలోని జంబుకేశ్వరం [తిరువశైక్క] 13, 14 శతాబ్దాలలో శైవమత కార్యకలాపాలకు కేంద్రంగా ఉండేది. ఆ కాలపు శాసనాలు అక్కడవుండే ఈ క్రింది మఠాలను, వాటి పీఠాధిపతులను పేర్కొంటాయి.

1. తిరుజ్ఞానసంబందన్ మఠం 585–1908, క్రీ.శ. 1237
2. అఖిలాండేశ్వరి మఠం 196 — పుదుక్కోట [విశ్వేశ్వర—శివాచార్యుడు] సంస్థానం, క్రీ.శ.1340
3. సింగముదేవర్ మఠం 5—1937/8, క్రీ. శ.1241
4. ఆండార్—ఎంపిరాశార్‌మఠం 584–1908, క్రీ. శ.1251
5. నార్పత్తెణ్ణాయిరవన్‌మఠం 486, 487—1908
6. నదునిల్ మఠం 352—1914

(వ్యాపక—శివుడు)

ఇంతే కాక 18వ శతాబ్దంలో ఏకవీర్ాంబా మఠాధిపతీ, సదాశివ వాజపేయ యాజి మనుమడు, శ్రీకంఠ దీక్షితునికొడుకు అయిన చంద్రశేఖర దీక్షితుని గురించి వింటాము. [C. P. P. 23—1937/8—క్రీ. శ. 1754]

పైన చెప్పబడిన మఠాలన్నీ శైవమతానికి సంబంధించినవే. అయినా వేరువేరు శైవశాఖలకు చెందినవి. పై పట్టికలోని 1, 4, 5, 6, గోళకీ లక్ష్మాధ్యాయి వంశానికి చెందినవని ఇదివరకే నిరూపించబడింది. 3 దేనికి చెందినదో తెలియదు. 2 కీ, ఏక వీరాంబా మఠానికీ, గోళకీ లక్ష్మాధ్యాయి వంశానికి ఏవిధమైన సంబంధము ఉన్నట్లు సాక్ష్యం లేదు. ఈ రెండు మఠాలగురువులూ వైదిక కర్మలు ఆచరించినట్లు వర్ణించబడ్డారు. వారు శ్రుతి, స్మృతులను అనుసరించినవారు; పాశుపత—వ్రతము పట్టినవారు. వీరు చేసిన గొప్ప పనులలో పాశుక- చాతుర్మాస్యము వాజపేయము చేయడం, [మహాలింగం, 1957] అనేక ఆలయాలు, మంట పాలు, స్తంభాలు కట్టించడంతోపాటు పేర్కొన బడ్డాయి. వీటన్నింటిని బట్టి ఈ మఠాలకు చెందిన గురువులు వైదిక పాశుపత మతానుయాయులని అనుకోవచ్చు.

13వ శతాబ్దంలో తిరుచ్చత్తిముట్రం వంశపువారి ఆధి పత్యంలో ఉన్న నార్పత్తెణ్ణాయిరవన్ మఠం గురించిన ప్రస్తావన తరువాతి శతాబ్దాల శాసనాలలో కనిపించదు. ప్రస్తుతము ఈ కట్టడం కామకోటి పీఠాధిపతియైన శంకరాచార్యుల ఆధీనంలో ఉన్నది. విజయరంగ—చొక్కనాథ నాయకుని 1708 సంవత్సరపు శాసనం ఇది శంకరాచార్యుల "స్వంత" మఠము అని చెప్తుంది. ఈ శాసన పరిష్కర్త విశ్వనాథ ఈ 'స్వంత' అనే పదము ఉద్దేశ్య పూర్వకంగా చేర్చబడిందని అభిప్రాయపడుతున్నారు. [1921/2 అక్కడ ఉన్న దీనికంటే ప్రాచీన శాసనాలు 13వ శతాబ్దానివి. [486, 487—1908] ఈ కట్టడము గోళకీ మతానికి చెందినదని నిరూపించడంచేత ఈ పదం చేర్చబడిందని ఆయన అభిప్రాయం.

## గోళకీ మఠాల నిర్మాణం

లక్ష్మాధ్యాయి, ఇంకా ఇతర గోళకీ వంశాలకు చెందిన మఠా లలో చాలా భాగం భోజనవసతి కల్పించడను మొదలైన ధర్మ కార్యాలను నిర్వర్తించే ఉద్దేశ్యంతో స్థాపించబడ్డాయి. ఇవి మధ్య యుగాలలో తమిళ దేశమంతటా వ్యాపించి వుండేవి. (Map 3) వీటికి సంబంధించిన శాసనాలను పరిశీలిస్తే వీటిలో మాహేశ్వరులు నివసించేవారనీ, ఇవి పీఠాధిపతుల ఆధిపత్యంలో ఉండేవని తెలు స్తుంది. [అనుబంధం I లో వివరించబడింది] వీరే దాన పరిగ్రహీతలలో ముఖ్యులు. అన్నవసతి కల్పించడమే ముఖ్యో ద్దేశ్యముగాగల దానాలు వీరిని ఉద్దేశించే చేయబడ్డాయి. తపస్యులు, అపూర్వులు, శివయోగులు కూడా కొన్ని మఠాలలో నివసించేవారు. దేశాంతరులకు తఱుచు ఈ మఠాలలో వసతి భోజన సదుపాయాలు ఏర్పరుచబడేవి. ఆండార్లు అనబడేవారు కూడా వీటిలో నివసించే వారు. వీరు తక్కినవారికంటె కొంత తక్కువ హోదాలో ఉండే వారు. ఆ యా మఠాలకు సంబంధించిన ఆలయాలలో వివిధాలైన సేవలు చేయడం వారి విధి. స్తోత్ర పాఠకులు, పేదలు, దేవరడి యార్లు, పరదేశులు కూడా కొన్ని మఠాలలో పోషించబడేవారు.

మాహేశ్వరులను, రుద్రులను గురించి శైవ ఆలయాల, మఠాల నిర్వహణలో వారి పాత్రను గురించి వివరమైన పరిశీలన ఇంకొక వ్యాసంలో చేయబడుతుంది. ఇక్కడ ఇవి మొత్తంమీద ఈ సంస్థల నిర్వహణ భారాన్ని వహించేవని గమనిస్తే చాలు. మఠా నికి ఇచ్చిన దానాలే కాక, దానికి సంబంధించిన ఆలయాలకు ఇచ్చిన దానాలను కూడా మాహేశ్వరులే గ్రహించేవారు—దీపాన్ని వెలిగించ డానికి (నొందవిళక్కు) ఇచ్చిన దానాలుతప్ప. ఈ దీపం వెలిగించ డానికి ఇవ్వబడిన దానాలను శివ—బ్రాహ్మణులే గ్రహించేవారు. వీరు ప్రధాన ఆలయంలోను, ఉపాలయాలలోను లింగమూర్తికి నిత్య సేవలు చేసేవారు. మాహేశ్వరులకు శివ—బ్రాహ్మణులను నియ మించడము, ఆలయంయొక్క ఆస్తి వ్యవహారాలను చూడడము, దాని నిర్వహణ మొదలైన విషయాలలో అధికారముండేది. 'ఆలయ మఠ' వ్యవహార నిర్వహణలలో వారే సంపూర్ణాధికారము గలవారుగా ఉండేవారు. ఈ విషయం దానాలను గురించి చెప్పే తమిళ దేశంలోని మధ్యయుగపు శాసనాలలో తఱుచు కనిపించే "పణ్మాహేశ్వరర్— రక్షై" అనే సమాసం తెలుపుతుంది.

గోళకీ మఠానికి చెందిన గురువులు అనేకులు దేవాలయాలను, మఠాలను కట్టించారని చెప్పబడుతోంది. 'జ్ఞానాత్మన్' అనే గురువు ఉ॥ ఆర్కాటు జిల్లాలోని తిరువల్లమ్‌లో నాయక-శివాలయాన్ని నిర్మించాడని తెలుస్తోంది. (3-1890, క్రీ. శ. 1314); ఈశాన-శివుడు అదే జిల్లాలో, కులంబందల్ అనే ఊరిలో ఒక శివాలయాన్ని కట్టించాడు. (414-1902, క్రీ. శ. 1034). కులోత్తుంగచోళుడి (I) రాజగురువైన శ్రీకంఠ-శివుడు కులోత్తుంగ-చోళీశ్వరంలోని గుడిలో శివలింగాన్ని ప్రతిష్ఠించాడు. 301-1907. అదే పేరుగల ఇంకొక గురువు తంజావూరు జిల్లాలోని అచ్చుతమంగలంలో 'సోమనాథ' ప్రతిష్ఠ చేసాడు. (402-1925, క్రీ. శ. 1182) వామ-శివుడు ద॥ ఆర్కాటు జిల్లాలోని తిరునామ నల్లూరులో తను కట్టించిన చండీశ్వరాలయంలో లింగప్రతిష్ఠ చేసాడు (241-1939/40.) అక్కడే గంగోలి-జ్ఞాన-శివుడు ''విశ్వేశ్వర'' ప్రతిష్ఠ చేసాడు. (242-1939/40, క్రీ. శ. 1235) కులోత్తుంగుడికి (III) సమకాలీనుడైన ఈశాన-శివుడు తిరుజ్ఞాన సంబందన్-గుహై అనే పేరుగల మఠాన్ని కట్టించాడు. (311-1927/8, క్రీ. శ. 1207); శ్రీ మాహేశ్వరస్థానం [శివపాద శేఖర మంగలం]కు చెందిన విద్యా-శివుడు తంజావూరు జిల్లాలోని ఉద్దైయలూర్‌లో అభిముకన్ మఠం కట్టించాడు [311-1927, క్రీ. శ. 1283] వాగీశప్పెరుమాళ్ ఆ జిల్లాలోనే నాడియూర్‌లో తిరుజ్ఞాన సంబందన్ మఠాన్ని స్థాపించాడు [199-1932/3, క్రీ. శ. 1236]

ఈ మఠాలకు సంబంధించిన గురువుల ప్రతిభా పాండిత్యాలను గురించి ఈ శాసనాలద్వారా కొంత తెలుస్తోంది. కులోత్తుంగుడి [III] గురువైన ఈశ్వర-శివుడు శైవ-దర్శనాలలోను, పద్దెనిమిది విద్యలలోను [శివ-పురాణాలు] గొప్ప పాండిత్యము కలవాడు. ఆయన శివుని మహత్త్వమును ఉపనిషత్తులను అనుసరించి ఉపదేశించేవాడు [190-1907]. తిరుక్కొడైయూర్‌లోని మార్కండేయన్ మఠంలో నివసించే శివయోగులు గొప్ప వేదపండితులు [243-1925, క్రీ. శ. 1096] అఘోర-శివుడికి వైద్య-చక్రవర్తి అనే బిరుదు ఉన్నది. ఇది ఈయనకు వైద్య శాస్త్రంలోగల వైదుష్యాన్ని తెలుపుతుంది [575-1902, క్రీ. శ. 1287]. తిరువావడుతురైలోని మఠంలో వైద్యశాస్త్రంలో శిక్షణ నిచ్చేవారు [159-1925, క్రీ. శ. 1120].

''తిరుజ్ఞానం'' గోళకీమతాన్ని అనుసరించిన వారికి గౌరవ పాత్రమైన మతగ్రంథమని మనం గ్రహించవచ్చు. దీనిలోని విషయము, దాని ప్రమాణము తెలియకపోయినా ఇది ఆళుడైయపిళ్లై వ్రాసిన తిరుప్పదియములకు సన్నిహితంగా ఉంటుందని వేరొకచోట చూపించబడింది [స్వామి, 1971, 1972]. గోళకీ గురువైన పుగళిప్పెరుమాళ్ వాళీశ్వరంలోని తిరువాళీశ్వరన్ గుడిలో 'తిరుజ్ఞానం' పఠించేవాడు [359-1916, క్రీ. శ. 1256]. గోళకీ మఠానికి సంబంధించిన వేరు వేరు మఠాలకు చెందిన 11గురు ఈ గ్రంథాన్ని తిరునల్వేలిలోని నెల్లియప్పర్ గుడిలో చదివేవారు. [131, 132-1894]; దీనినే తిరుచెందూరు తాలూకాలోని, అత్తూరులో సోమనాథ ఆలయంలో ఉపదేశించేవారు [463-1929/30].

# గోళకీ ధర్మము

గోళకీవంశముగురించి మఠంగురించిన ప్రస్తావనలు అనేకం శాసనాలలో కన్పించినా ఆ మతసిద్ధాంతాలను స్పష్టంగా వాటి ద్వారా తెలుసుకొనే వీలులేదు. రామనాథపురం జిల్లా, తిరుప్పత్తూరులోని 'కల్లు' మఠంలో నివసించే ఈశాన-శివుడు లక్ష్యాధ్యాయి వంశానికి, గోళకీ ధర్మానికి చెందినవాడని చెప్పబడింది [178-1935/6]. ఇక్కడ 'ధర్మ'మనే పదము పద్ధతి అనే అర్థంలో వాడబడిందనుకున్నా, ఆ పద్ధతికి సంబంధించిన ప్రత్యేకమైన సిద్ధాంతాలు, ప్రమాణ గ్రంథాలు ఉండి వుండాలి. కాకతీయ రుద్రమదేవి గురువైన ఇంకొక గోళకీ ఆచార్యుడు విశ్వేశ్వర-శివుడు 'శుద్ధ-శైవ' మఠాన్ని కట్టించారని చెప్పబడుతోంది [94-1917, క్రీ. శ. 1261; రామయ్యపంతులు, 1930].

కాలచూరి-చేది యుగపు శాసనాల నన్నింటిని సవిమర్శకంగా సంపాదించిన మిరాశి [1955] ''మత్తమయూర తెగకు చెందిన ఆచార్యులు శైవులుగాని పాశుపత శాఖీయులు కారు'' అని అభిప్రాయపడ్డారు. 'మత్తమయూర' తెగకు చెందిన ఆచార్యులు, శంఖమఠము, తేరంచిమఠము, ఆమర్దకమఠము మొదలైన అనేక మఠాలను స్థాపించారు. గోళకీ మఠముకూడా వీటిలో ఒకటే. దీనికి 'మత్తమయూర' తెగకు చెందిన సద్భావ-శంభువు స్థాపించాడు. కనుక వీటి మూలసిద్ధాంతాలలో అంతగా భేదముండి వుండదు.

ప్రా॥ మిరాశిగారి బృహద్గ్రంథం 'మత్తమయూర', గోళకీ శాఖలకు చెందినవారు ఎన్నో ఆలయాలను, మఠాలను కట్టించారని తెలుస్తోంది. వారు పువ్వుల తోటలను పెంచేవారనీ, అన్నసత్రాలను నిర్వహించేవారనీ, వైద్యశాలలను నడిపేవారనీ, పేదలకు ఆవాసము కల్పించేవారనీ, మతగ్రంథాలనేకాక, సాహిత్యము, వ్యాకరణము మొదలైన శాస్త్రాలను బోధించేవారనీ ఈ గ్రంథము మనకు తెలుపుతోంది. తమిళ, ఆంధ్రదేశాలలోని గోళకీ ఆచార్యుల కార్యకలాపాలు దాహళ [చేది] దేశంలోని ఆచార్యుల కార్యకలాపాల ననుసరించినవే అని జ్ఞాపకముంచుకోవాలి.

'మత్తమయూర' తెగకు చెందిన గురువులు తపస్సంపన్నులు. శిఖా-శివుడు ''తన తపశ్శక్తిచేత'' మోక్షమార్గానికి వెలుగుచూపే అజ్ఞానమనే చీకటిని పారద్రోలే దీపమువంటివాడని వర్ణింపబడ్డాడు [ప్రశాంత-శివుని చంద్రాహే శాసనం, **E. I. XXI. No. 23**] ఈ ఆచార్యులు గొప్ప సిద్ధికలవారే కాక ఈ మతానికి సంబంధించిన వాఙ్మయములో గాఢమైన పాండిత్యము కలవారు. కాలచూరిరాజు జయసింహుని రాజగురువైన విమల-శివుని వంశమువారు గొప్ప వేదపండితులు. ఆయన కూడా వేదపండితుడే. ఈ ఆచార్యులు శైవులయినా సంకుచితమైన దృష్టికలవారు

కారు. వారు వైదికపత గ్రంథాలనేకాక అవైదికములైన మత గ్రంథాలను కూడా పఠించేవారు. కాలచూరి జజల్లదేవుని [I] గురువైన రుద్ర—శివుడు తన మతానికి సంబంధించినవే కాక ఇతర మతాల సిద్ధాంతాలు బాగా తెలిసినవారు. దిబ్నాగుడు మొదలైనవారి ప్రమాణ గ్రంథాలను చదివినవాడు. ఇదేవిధంగా 'మత్తమయూర' తెగకు చెందిన ప్రబోధ—శివుడు, 'పంచార్థిక' పద్ధతి పాశుపతులతో కాలం గడిపేవాడు.

మత్తమయూర/గోళకీ ఆచార్యుల సైద్ధాంతిక పద్ధతి మూడు పదార్థాలను గుర్తిస్తుంది. అవి పతి [పరమాత్మ], పశువు [జీవాత్మ], పాశము. ఈ పద్ధతి నాలుగు 'పాదా'లుగ విభజించబడ్డది. అవి విద్య [ఈ మూడు పదార్థాలను గురించినజ్ఞానము], క్రియ [దీక్ష, మొదలగు కర్మలు], యోగ [ధ్యానము], చర్య [విధించబడిన నియమాలను పాటించడము, నిషిద్ధమైనవాటిని చేయకుండా ఉండడము] దీనినిబట్టి ఇది— ఆగమమైన తత్త్వదర్శనము కల శైవ మతమని తెలుస్తోంది. కాని ఈ ఆగమ శాస్త్రాలు ఆ కాలానికి ఆ తరువాతి కాలపు పూర్ణ పరిణత స్థితిని పొందక పోయి ఉండవచ్చు.

9—12 శతాబ్దాలలో శైవమతానికి సంబంధించిన తత్త్వ వాఙ్మయం సంస్కృతంలో ఈ గ్రంథాల రచయితలకు, గోళకీ మతంతో, దాని మూల మతాలతో, దాని సోదర మతాలతోగల సంబంధము స్పష్టంగా కనిపిస్తుంది. వీరిలో కొందరు ఆంధ్ర తమిళ దేశాలలో నివసించేవారు. వీరిలో సద్యోజాతి, భోజరాజు ప్రాచీనులై ఉంటారు. ఎందుచేతనంటే వీరిద్దరినీ గ్రంథకర్తలైన శిష్యులనేకులు భక్తి ప్రపత్తులతో తమ గ్రంథాలలో పేర్కొన్నారు. సద్యోజాత—శివుడు మోక్షకారిక, పరమోక్ష నిరసకారిక, తత్త్వ క్రమ నిర్ణయము, తత్త్వ సంగ్రహము, రౌరవాగమముమీద ఒక వృత్తి మొదలైన అనేక గ్రంథాలను రచించాడని చెప్పబడుతోంది. తత్త్వ త్రయ నిర్ణయము పతి — పశు — పాశను గురించి చర్చిస్తుంది. తత్త్వసంగ్రహము 36 తత్త్వములను గురించి చెపుతుంది. వీటి రెండింటికి వ్యాఖ్య వ్రాసిన అఘోర—శివుడు ఇవి స్వాయంభువాగమము ఆధారముగా వ్రాయబడినవని వ్రాసారు. భోజరాజు అనే ఆచార్యుడు (మాళవ దేశపురాజు, సరస్వతీ కంఠాభరణ కర్త ఈయన కాదు)తత్వ ప్రకాశమనే గ్రంథం వ్రాసాడు. దీనికివ్రాసిన వ్యాఖ్యలో అఘోర—శివుడు భోజరాజు వింధ్యప్రాంతంలో నివసించిన ఉత్తుంగ—శివుని శిష్యుడని వ్రాసారు. [సాయన—మాధవులు వ్రాసిందని చెప్పబడే సర్వదర్శన సంగ్రహం ఈ అఘోర—శివుడి వ్యాఖ్యలను ధారాళంగా ఉపయోగించుతుంది.] శ్రీ కంఠ—సూరి వ్రాసిన రత్నత్రయము 'శివ—శక్తి—బిందువులను' వివరిస్తుంది.

సోమ—శంభువు కర్మ—క్రియా కాండ కర్త [క్రీ. శ. 1073] దీని నుంచి అఘోర—శివుడు ఈశాన—శివుడు, సర్వదర్శన సంగ్రహకర్త. ఈయన గురువు ఈశాన—శివుడి శిష్యుడైన స—శివుడు గోళకీమత స్థాపకుడైన సద్భావ—శంభువు [?స—శివుడు] వంశానికి చెందినవాడు సోమ—శంభువు అని తెలుస్తోంది.

ఈశాన—శివుడు [బహుశా రాజరాజచోళుని రాజగురువై ఉంటాడు]ఒక"పద్ధతి" వ్రాసారు. ఇది ఆయన పేరుమీదగా ఈశాన శివ—గురుదేవ—పద్ధతి అని పిలువబడుతోంది. అఘోర—శివుడు క్రియాక్రమ ద్యోతిక [అఘోర—శివ—పద్ధతి అనికూడా పిలువబడుతుంది. క్రీ. శ. 1158] రత్నత్రయ వృత్తి, తత్వ నిర్ణయ వ్యాఖ్య, దీక్షావిధి—మృగేంద్ర—వృత్తి—దీపిక ఇంకా కొన్నిగ్రంథాలను వ్రాసాడు. కొందరి [ఉ॥ నందిమర్, 1944] అభిప్రాయంలో ఈ ఆచార్యుడు చిదంబరంలో నివసించేవాడు, ఆమర్దక వంశానికి చెందినవాడు. ఈయన శ్రీ కంఠుడు, ధ్యాన—శివుడు, హృదయ శంకరుడు, పరమ—శివుడు లేక సర్వాత్మ —శివుడు—వీరికి తన పూర్వీకులుగా తన మహోత్సవ విధిలో పేర్కొన్నాడు.

త్రిలోచన—శివుడు ప్రాయశ్చిత్త సముచ్చయము, సిద్ధాంత సారావళి, రత్న త్రయోద్యోతముల రచయిత. ఆయన తాను అఘోర—శివుడి వంశానికి చెందిన వాడనని, ఆమర్దక మఠవాసినని చెప్పుకున్నాడు. ఈయన దుర్వాస, వ్యాపకేశన, సర్వేశ, ఉత్తుంగ శంకర, సోమేశాప, సర్వాత్మ, అఘోర శివులను తన గురుపరంపరగా పేర్కొన్నాడు.

శైవమత తత్త్వము గురించి తమిళంలో వ్రాయడం 12వ శతాబ్దంలో ప్రారంభమయి, తరువాత రెండు శతాబ్దాలలో కొనసాగింది. 14 సిద్ధాంత గ్రంథాలు [ఇప్పటి పరిభాషలో శైవ—సిద్ధాంత గ్రంథాలు] ఈ కాల పరిధిలోనే వ్రాయబడ్డాయి. ఈ గ్రంథాలలో చాలావరకు పైన పేర్కొనబడిన సంస్కృత గ్రంథాలలోని విషయాలే పతి—పశు—పాశాలు. 36 తత్త్వాలు, పంచాక్షరాలు మొ॥ సరిగ్గా అదే అర్థాలలో, అవే సన్నివేశాలలో పేర్కొనబడ్డాయి. కొన్ని సూత్ర రూపాలలో వ్రాయబడ్డాయి. కొన్ని ఈ సూత్రాలకు వివరించే వ్యాఖ్య రూపంలో వ్రాయబడ్డాయి. వీటిలో రెండు మూడు వేరువేరు శైవమత శాఖల, ఇతర మతాల సిద్ధాంతాలను తమ ప్రత్యేక శాఖ సిద్ధాంతాల సత్యాన్ని నిరూపించే ప్రయత్నంలో—పేర్కొని పోల్చి చర్చిస్తాయి.

తిరువీయలూరు ఉయ్యవంద — దేవ [12వ శతాబ్దం, క్రీ. శ.? 1147] "తిరువందియార్" ను వ్రాసాడు. దీనిలో పతి—పశు—పాశాలను గురించి, మోక్ష సాధనను గురించి ఆయన వ్రాసాడు. తిరుక్కడవూర్ — ఉయ్య వందార్ [తిరువియలూర్ ఉయ్య వందార్ శిష్యుడని చెప్పబడువాడు] "తిరుక్కళి ట్రుప్పడియార్" [12 శతాబ్దము క్రీ. శ. ? 1177] ను వ్రాసాడు. ఇందులో "తిరువందియార్" లోని విషయాలే ఇంకా వివరంగా చర్చించబడ్డాయి. కాని ఇందులో మోక్షసాధనలో యోగానికి ప్రాముఖ్యం ఇవ్వబడింది. మెయ్‌కండర్ "శివజ్ఞాన బోదమ్" అనునంది శివాచార్యుని "శివజ్ఞాన—సిద్ధియార్", "ఇరుపా—ఇరుపదు" తిరువడికై మణవాచకమ్—కండార్ "ఉణ్మై విళక్కమ్" 13వ శతాబ్దంలో వ్రాయబడ్డాయి. తక్కిన 8 గ్రంథాలు 14వ శతాబ్దం పూర్వార్థంలో జీవించిన ఉమాపతి శివాచార్యుల పేరుమీద ఉన్నాయి. [కాని ఉమాపతి—నెఱివిళక్కమ్‌కర్తృత్వం గురించి సందేహం

వ్యక్తపరచబడింది]. ఇవి కూడా శైవ మతానికి సంబంధించిన కొన్ని మూలసిద్ధాంతాలను సవ్యాఖ్యానంగా చర్చించి వివరిస్తాయి.

"శివజ్ఞాన బోధమ్" గురించి దురదృష్టవశాత్తు వివాద మేర్పడింది—అది మౌలికమైన రచనా లేక వేరే ఏదైనా గ్రంథానికి గాని, గ్రంథభాగానికిగాని అనువాదము లేక అనుసరణ అయి వుంటుందా? రౌరవాగమములో పాశవిమోచ పటలంలోని సూత్రాలకు ఇది తమిళ అనువాదమని, "తిరువావడుతురై అధీనమ్" పీఠాధిపతుల అభిప్రాయమని వారి అధికార ప్రచురణలవల్ల తెలుస్తోంది. [ఉదా॥ Anon, 1962]. స్వామి వేదాచలం, సుబ్రహ్మణ్య పిళ్లై, బాలసుబ్రహ్మణ్య ముదలియార్, ఇంకా అనేకులు [వీరందరి పేర్ల చూ॥ రాజమాణిక్కమ్, 1958] ఇది మౌలిక రచన అని గట్టిగా నమ్ముతున్నారు. వీరి దృష్టిని ప్రతిఫలించే పూర్ణలింగం పిళ్లై [1927] ఇలా వ్రాసారు: "దీనిలోని ఆలోచనలు ప్రాచీనమైనవి. కాని వాటిని వ్యక్తీకరించిన పద్ధతి కొత్తది. చాలావరకు ఆర్య ఇదే చాలామంది పండితులకు మెయ్‌కండర్ గ్రంథము రౌరవాగమములలోని పాపవిమోచనమనే 12 శ్లోకాలకు అనువాదము మాత్రమే అనే దురభిప్రాయం కలగడానికి కారణం. ఈ రెండింటిని సరియైన దృష్టితో పోల్చిచూస్తే మెయ్‌కండర్ రచనను పూర్తిగా అర్థంచేసుకోని వాడెవరో దీనిని ఆర్య "భాష" లోనికి అస్పష్టంగా అనువాదం చేసాడనే నిజం గ్రహించవచ్చు. సదాశివ పండరత్తార్ (1963) ఇవే భావాలను ఇంకా ఆవేశంతో చెప్పారు.

తమిళంలో మొదటి సిద్ధాంత గ్రంథాన్ని వ్రాసినవాడు మెయ్‌కండర్ కాదనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. శైవసిద్ధాంతాలలో కొన్నింటిని చర్చించే "తిరువందియార్," "తిరుక్కళిఱ్ఱుప్పడియార్" 12వ శతాబ్దంనాటికే తమిళదేశంలో ప్రచారంలో ఉండేవి. గోళకీ ఆచార్యుల ప్రబోధ ప్రచారాలద్వారా అప్పటికే, శైవమత సిద్ధాంతాలను చర్చించే సంస్కృత గ్రంథాలు అనేక తమిళదేశపు మత, ఆధ్యాత్మికకు సుపరిచితాలే అనే విషయం మనం ఇంతకు పూర్వమే గుర్తించాము. మెయ్‌కండర్ గోళకీ ఆచార్యుడనీ, తిరువణ్ణామలైలోని ఒక గోళకీ మఠానికి పీఠాధిపతి అనీ మనకు తెలుసు. (దురస్వామి పిళ్లై, 1968). ఈ విషయాన్నా గుర్తుంచుకుని విచారిస్తే "శివజ్ఞాన బోధమ్" మత్తమయూర–గోళకీ శాఖకు సంబంధించిన సంస్కృత గ్రంథాలలోని సిద్ధాంతాలకు తమిళ అనుసరణ మవడం సహజమే కాకుండా అనివార్యం అని తోచక మానదు. మెయ్‌కండర్ "రౌరవాగమం" లోని విషయాన్ని గ్రహించాడా లేక భోజరాజును అనుసరించాడా, సద్యోజ్యోతిని గాని లేక ఏ ఇతర సంస్కృత గ్రంథకర్తను గాని అనుసరించాడా అన్నది అంత ముఖ్యంకాదు. "శివజ్ఞానబోధమ్" శైవతత్త్వమును వివరించేది గోళకీ మతస్థులకు ప్రామాణికమైనది అయిన గ్రంథము. గోళకీమతాన్ని వివరించే సంస్కృత గ్రంథాలకూ, శైవసిద్ధాంత సూత్రాలుకల తమిళ గ్రంథానికీ న్యాయం చేకూర్చాలంటే ఈ రెండుభాషల గ్రంథాలూ అభిన్నమయినవని గ్రహించాలి.

తమిళదేశంలో శైవమతం వ్యాపించడంలో మెయ్‌కండర్ ప్రముఖపాత్ర వహించాడనేది నిర్వివాదం. ఆయన తన కాలంలో ప్రాచుర్యంలోఉన్న శైవమత సిద్ధాంతాలను వివరిస్తూ ఈ దేశపు ప్రజలు మాట్లాడే భాషలో వ్రాయడంవల్ల ఈ దేశంలో శైవమత వ్యాప్తి కావడమేకాక తమిళభాషలో ఈ మతానికీ, తత్త్వానికీ సంబంధించిన వాఙ్మయం తరువాతి శతాబ్దాలలో విస్తృత మవడానికి కారణమయింది.

భారతదేశంలో వివిధ ప్రాంతాలకు చెందిన, 9–14 శతాబ్దాలమధ్యకాలంలో జీవించిన రచయితలు చాలామంది సాధారణంగా 4 ముఖ్య శైవమత శాఖలను (sensu labu) పేర్కొంటున్నారు. 9వ శతాబ్దపు వాచస్పతి శైవ (sensu stridal) పాశుపత, కాపాలిక, కారుణిక సిద్ధాంతులనే 4 రకాల శైవులను పేర్కొన్నారు. ఈయన తరువాతి వారు వీరిలో మొదటి ఇద్దరినీ తప్పకుండా పేర్కొంటారు. కాని తరువాత రెండింటికి బదులుగా కాలాముఖ, భైరవ మహావ్రతధర, సోమ సిద్ధాంత మొదలైనవి (వీటిని గురించిన పూర్తి వివరాలకు చూ. హండికి, 1949: చిదానంద మూర్తి, 1966; సిన్హా, 1970) యీవిధంగా ఈ గ్రంథ రచయితలందరూ 'శైవ' 'పాశుపతా'లను పేర్కొనటం 9వ శతాబ్దంనుంచీ ఈ రెండిటికీ కర్మకాండ విషయంలోనూ, తత్త్వవిషయంలోనూ గల ప్రత్యేకతను స్పష్టంగా సూచిస్తోంది.

'శైవ' పద్ధతి సిద్ధాంతము—దీనిని మత్తమయూర–గోళకీ—ఆమర్దక శాఖలు అనుసరిస్తాయి—ద్వైతాన్నిబోధిస్తుంది. ఇది అద్వైత సిద్ధాంతాన్ని బోధించే కాశ్మీరదేశపు "తత్త్వభిజ్ఞ" దర్శనానికి విభిన్నమయినది. పాశుపతమువలె కాకుండా శైవము (సైద్ధాంతిక శైవము లేక శైవ సిద్ధాంతము) భగవంతుడు ఈ ప్రపంచానికి, 'కార్యోపయుక్త కారణము' అని చెబుతుంది. 'శక్తి' (భగవంతుడి సచేతన శక్తి) భౌతిక కారణము అనీ, ఆయన అచేతనశక్తి 'సాధక కారణము' ఇంకా మాయ అనీ చెబుతుంది. జీవాత్మలు శాశ్వతమనీ, అవి మోక్షము కలిగినపుడు శివునిలో ఐక్యతను పొందినా తమ ప్రత్యేకతను కోల్పోవని ఈ సిద్ధాంతము బోధిస్తుంది. కర్మకాండ విషయంలో పాశుపత శైవాలకు సామాన్యమైనవికొన్ని ఉన్నాయి; ప్రత్యేకమైనవి కొన్ని ఉన్నాయి. ఈ రెండు పద్ధతుల ననుసరించేవాడు దేవాలయాలలో ఆగమవిహితంగా ప్రతిష్ఠించబడిన శివ లింగాన్ని పూజిస్తారు. ఈ రెండిటిలోను ఈ పూజా విధానంలో వైదిక, ఆగమిక, తాంత్రిక అంశాలు కొంత వేర్వేరు నిష్పత్తులలో కనిపిస్తాయి. పాశుపతులు శరీరమంతా విభూతి అలదుకోవాలి. కాని శైవులు నుదుటికి మాత్రం పూసుకోవాలి. పాశుపతులకు, శైవులకు మధ్య ఉన్న పోలికలు, విభేదాలు, ఇవి చాలా ప్రాచీనకాలంలో ఒకే మూలంలోంచి ఉత్పన్నమయాయని కొత్త ప్రక్షిప్తాలవలన, చేర్పులవలన తరువాతి కాలంలో రెండుగా చీలాయని సూచిస్తాయి. (దివాన్జీ 1955)

(ఇంకా వుంది)

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

# *"నీరై పారిపోయింది:"

"జననాంతర సౌహృదాని..." శాకున్తలమ్‌లోని ప్రఖ్యాత శ్లోకాన్నీ, సందర్భాన్నీ ఉల్లేఖిస్తూ శ్రీమతి ఇందిరాదేవి ఈ కావ్యానికి వ్రాసిన పీఠికలో, ఇందులోని కవితలన్నీ జననాంతర స్మృతుల స్వేచ్ఛాభివ్యక్తిగా ఒక నిర్దేశం చేశారు. అటుపైన చేతనయొక్క అన్నమయాది పంచకోశాలను ప్రస్తావించి, ఆనంద మయ కోశాన్ని చేరుకున్న జీవుని స్థాయికి చెందిన రసజగత్తు ఈ కవితల్లో ఆవిష్కరింపబడిందన్నారు. చేతనలో వ్యక్తావ్యక్త విభాగాలను గూర్చి చెప్పే మనోవైజ్ఞానిక శాస్త్రవేత్తలను ప్రస్తావించి వ్యక్తావ్యక్త విభేదాల నధిగమించిన పూర్ణచేతన స్థాయినుండీ ప్రభవించిన కవితగా దీన్ని అభివర్ణించారు. శాస్త్రీయ దృక్పథంలో కాలానికీ (కార్యకారణ పరిణామశీలమైనదానికీ), వ్యక్తి చేతనలో కాలానికీ (భూతభవిష్యద్వర్తమానాల సంశ్లిష్ట స్వరూపమైన చైతన్య స్రవంతికీ) విభేదాన్ని గుర్తించి, మానవుని సృజనాత్మక శక్తికి అగ్రస్థానమిచ్చిన బెర్గ్‌సన్ సిద్ధాంతం కూడా ప్రసక్తమైంది. ఇన్ని విధాలుగా ఈ కావ్యవస్తువుని పరామర్శించడానికి వీలున్నది. పోతే, ఇందులోని భావచిత్రాలూ, కల్పనల పోకడలూ, అధివాస్తవిక (సర్రియలిస్ట్) లోకాన్ని ఆవిష్కరిస్తున్నాయనే విషయం ఒకరిద్దరు సమీక్షకులు గుర్తించారు కూడా. (ఉదా॥ 'చూచుకంలా మినమిన లాడే కృష్ణద్రాక్షలో వ్రేలాడుతున్న రక్తనాళాల జీవమండలం నక్షత్ర గుచ్ఛాన్ని పిలిచింది దిగిరమ్మని' పద్యం 5) ఈ కవితల్లో స్పృహణీయమైన వాక్యాలు, జీవితానుభూతిని గూర్చి వ్యాఖ్యానించేవీ, ఆణిముత్యాల్లా భద్రపరచుకోదగినవీ ఎన్నో లభిస్తాయి. (ఉదా॥ "ఈ జీవితంలో నీవు ఎన్ని రంగులలో ఆడుకున్నా ఒకనాడు నీవు అదృష్ట వంతుడివై నీ ప్రాచీన చీకటిని కలుసుకోక తప్పదు"— పద్యం—2. "నేను ఘనీభవిస్తే ఒక నామరూపాత్మక దేహం, నేను ద్రవీభవిస్తే ఒక జ్ఞాపకాల ప్రవాహం! నేనున్నచోట యిప్పుడులేను ఎప్పుడూ లేను"—పద్యం 6. దినం తర్కిస్తుంది రాత్రి కలలు కంటుంది పద్యం—11)

కవి స్వయంగా వ్రాసుకున్న పీఠికలో, ఈ కవిత్వాన్ని గూర్చి ఋవి తన అంతరాంతరాల్లోంచీ బహిర్ముఖమైన చేతనకు సాగి వచ్చిన ఏవో మార్మిక సందేశాలకు అక్షరరూపమే తప్ప వేరు కాదన్నారు. సంకల్పపూర్వకంగా తను చేసింది వాటిని ఏర్చి కూర్చి వాటికొక కళాస్వరూపాన్ని యివ్వటమేనని కూడా చెప్పుకున్నారు. The poems in this volume are I think an assortment of instructions of my inner psyche transmitted in its own mysterious code to my outer self; interpreted and transformed into human speech. My conscious effort was only to crease them out, arrange and organise them and give them a communicable shape to the extent possible.) ఇక్కడ ప్రధానంగా గమనించవలసిన విషయం ఒకటున్నది. మనోవిశ్లేషణాత్మక చికిత్సా పద్ధతిలో కూడా (psychoanalysis) అంతశ్చేతనమండి స్మృతులను, భావగ్రంథులను వెలికి తీయడానికి, తోచిన భావాలను యథాతథంగా స్వేచ్ఛగా ప్రవాహంలా చెప్పుకుపోవడం (free association) వున్నది. అవి బాల్యస్మృతులు కావచ్చు, జననాంతర స్మృతులు కావచ్చు. అటువంటి చైతన్యస్రవంతి, కేవలం స్వేచ్ఛాభివ్యక్తి కారణంగా, లేక అందులో అద్భుతమైన వైచిత్రిలో నిండిన ఏవో భావచిత్రాలూ, సూక్తులూ చెదురుమదురుగా మణిమాణిక్యాల్లా లభించడం కారణంగా, ఒక కావ్యరచనగా గాని, ఒక కళాస్వరూపంగా గాని అభిజ్ఞులచేత అంగీకరింపబడదు. శేషేంద్రశర్మ గారి రచన "నీరై పారిపోయింది" కవిత్వమా కాదా? ఇది ఏక కావ్యమా లేక ఖండకావ్య సంపుటియా? దీనికి ఒక కళాస్వరూపం ఉన్నదా లేదా? అనే ప్రశ్న వస్తువునుబట్టి లేక కృత్యాద్యవస్థను బట్టి—జననాంతర స్మృతులు, చైతన్య స్రవంతి, ఆనందమయ కోశానికి సంబంధించిన సంవేదన అంటూ ఎలా వర్ణించినా—కేవలం వస్తుసామగ్రిని బట్టి నిర్ణయం కానేరదు! శర్మగారు భావాలను ఏర్చి కూర్చి కళాస్వరూపాన్ని యిచ్చానని చెప్పుకున్నారు గాబట్టి వారు సంకల్పపూర్వకంగా ఏం చేశారో, దాని ఫలితంగా కృతకృత్యులయ్యారో లేదో, కావ్య స్వరూపం, అభివ్యక్తి, వ్యంజకత్వం, సంవిధానం ఎలా వున్నాయో పరిశీలించడంద్వారానే ఈ గ్రంథానికి కావ్యగౌరవం యివ్వగలం.

"One is not a writer for having chosen to say certain things, but for having chosen to say them in a certain way" Sartre (What is Literature)

"ఆకలి కవిత్వం రాయి, ఆవకాయి కవిత్వం రాయి...మాకు తగాదా లేదు. కానీ నీవు అసలు కవిత్వం రాయాలి— ఇదీ ఈనాడు తలఎత్తే ప్రశ్న...కవిత్వం రాసే విధి విధానాలమీద పట్టుదలలు వదలిపోయిన ఈ రోజు కవిత్వం రాసేవాళ్లకి మరింత ప్రమాదం ఏర్పడిందేగాని మరింత సౌలభ్యం దొరికిందనుకోవటం పొరపాటు"

—శేషేంద్రశర్మ : 'రక్తరేఖ'

ఈ కావ్యంలో కవితాభివ్యక్తి ప్రతీకల ద్వారా జరుగుతున్నది. ఆ పద్ధతి అంటే తనకెంత అభిమానమో 'రక్తరేఖ' లో శేషేంద్ర శర్మ చాల చోట్ల వ్రాశారు. "ఆలంకారికులు సాహిత్య పరాకాష్ఠగా చెప్పే ధ్వనికంటె 'సింబలిజం' చాల గొప్పది. సింబలిజం ఒక విరాట్ స్వరూపం అయితే, ధ్వని దాని పాదం వరకే వస్తుంది. ధ్వని కేవలం ఒక శబ్దశక్తి వ్యవహారం, కాని సింబలిజం ఒక దృగ్వ్యవహారం, సదసద్వివేక వ్యవహారం, వైదిక వ్యవహారం!" (48వ పుట 'రక్త రేఖ') "నదీం పుష్పోదు పవహాం" అని ఒక వాక్య శకలం. ఇది మన కళ్ళకు తెచ్చే దృశ్యంలో సారభూతమైన ఆత్మ—ప్రవహించే అందం. సౌందర్య లహరి. అదే సృష్టిలో ఎడతెగకుండా ప్రవహించే జీవనది. ఆ దృశ్యంలో యిదే దర్శించాడు మహర్షి వాల్మీకి...దృశ్యానికి జీవంనిచ్చే ప్రవహిమ ఏదైతే వుందో దాన్ని పట్టియిచ్చే గ్రథన కౌశలంలో బంధింపబడిన నాలుగు మాటలూ కవిత్వం అవుతాయి...పూల పడవలు, నదులు అన్న వస్తువుల్లోగాని వాటిని చెప్పే శబ్దాల్లోగాని కవిత్వం లేదు. ఆ శబ్దాలలో కవి ఒక సృష్టి చేస్తాడు. ఆ సృష్టే కవిత్వం. (38—39 పుటలు 'రక్తరేఖ')

"సింబలిస్ట్ వస్తువులో సింబల్‌ని చూస్తున్నాడు. కనుక సత్యమే సింబల్ అని వ్యవహరింపబడుతోంది ... సింబలిజమ్‌లో సింబల్స్ మన యిష్టం వచ్చినట్లు పెట్టుకునేవి కావు; ఏవో వట్టి గుర్తులు కావు. అవి సింబలిస్ట్ అనే ఒక ద్రష్ట చూచిన దృశ్యాలు. ఆ ద్రష్టకు సిద్ధించిన దార్శనిక అనుభూతులు" (49వ పుట—రక్తరేఖ)

శర్మగారు యిలా వెలిబుచ్చినవి కేవలం అభిప్రాయాలుకావు; కవితా వ్యాసంగంలో తాను అనుసరిస్తున్న పద్ధతులు. "నీరై పారిపోయింది" అనే కావ్యాన్ని 'సింబలిజమ్' పద్ధతి కావ్యంగా దర్శించలేక పోతే, మనం ఆ కావ్యానికి న్యాయం చేసినట్లుకాదు !

'నదీం పుష్పోదు పవహాం' అన్న వాక్యంలో మనం దర్శించేది పువ్వులూ నదీ కాదు, ప్రవహించే అందం, సౌందర్య లహరి ఎట్లాగో అట్లే 'నీరై పారిపోయింది' కావ్యంలో మనం దర్శించేవి కేవలం స్మృతులు కావు, అందమైన భావచిత్రాలూ కావు, కవి యొక్క తాత్విక దృక్పథాన్ని—అంటే కవి ఆత్మను. దాన్ని ఆవిష్కరించేందుకు తగిన 'గ్రథన కౌశలం' చూపడంలోనే కవి గొప్పదనం ఉన్నది. దాన్ని దర్శించి అనుభూతి పొందటంలోనే సహృదయుల కృతకృత్యత ఉన్నది.

* * *

"నీరై పారిపోయింది" విడి కవితల సంకలనం కాదు. ఇది ఒకే ఇతివృత్తంగల కావ్యం. దీనికి మొదలూ తుదీ ఉన్నాయి. ప్రతీకలూ, ప్రతీకల ద్వారా లభించే దర్శనమూ, ఈ ఇరవైరెండు కవితల్లోనూ ఒక చక్కని అర్థ సమన్వయంలో మానవుని అస్తిత్వానికి సంబంధించిన ఎన్నో ఆవేదనలనూ, మౌలికమైన ప్రశ్నలనూ వాటి సమాధానాలనూ స్ఫురింప జేస్తున్నాయి. అలా చెయ్యడానికి కవి ఉపయోగించిన 'గ్రథన కౌశలం' ఏమిటో సూచించడం మాత్రమే విమర్శకుడు చెయ్యగలడు. దారి కనిపించిన తర్వాత ఎవరి అనుభూతి, ఆలోచనా వారివే!

కావ్యారంభం: గుల్మొహర్ ప్రకటించిన ఒక 'నూతన రుతువు' ను దర్శించడంతో 'ఏవేవో స్మృతులన్నీ దూర దూరాల నుంచీ రక్తప్రవాహాల్లో పడి కొట్టుకు రావడంతో', కవి తన ఉనికినీ, అస్తిత్వాన్నీ గూర్చి ప్రశ్నిస్తాడు.

"ఈ భాష ఈ కాలం ఈ దేశం నాని అని ఎలా చెప్పను? ఇవి నేను కోరుకున్నవి కావు. వీటికోసం నేను పుట్టేముందు నా అంగీకారం ఒకరు తీసుకోనూ లేదు—నేను వాటి ఖైదీని.!' [1వ పద్యం.]

ఇటువంటి 'భ్రాంతి మూలచ్ఛేదక మైన' ప్రశ్నలో, స్వేచ్ఛ కోసం అలమటించే చిలుకలా, చేతనలో స్మృతుల ద్వారాలు తెరుచుకోగా ఎక్కడెక్కడో విహరిస్తాడు. ఆ విహారంలోనే జీవితాన్నిగూర్చి, సృష్టినిగూర్చి ఎంతో తాత్వికాన్వేషణ జరుగుతుంది. కావ్యం ముగింపులో 22వ పద్యం చివర అంటాడు:

"జీవితం నన్ను రాతిని చేసిందికానీ నేను రాళ్ళ సామ్రాజ్యానికి చక్రవర్తి నయాను. అజరామర పుష్పాల్లో అవతరించాను. చేతిలో కమలాలు క్రిందపడేసి ఆ చేతో గుండె వుచ్చుకున్నాను. నేను నా శరీరంలోనే పడుకుని నిద్ర పోతాను" (22వ పద్యం)

ఖైదీ తన ఖైదులో రాజీపడటంతో కావ్యం ముగుస్తుంది. ఈ రాజీపడటం, సమాధానపడటం ఎలా జరిగింది? ఇక్కడ ఒక సూచన చేస్తాను—ఈ కావ్యంలో 'పువ్వులు' దేనికి ప్రతీక అనే రహస్యం మనం గ్రహిస్తే ఆ కావ్యారంభానికీ, కావ్యాంతానికీ గల స్వారస్యం అవగతమౌతుంది. పువ్వులు మానవుని వాంఛా ప్రవృత్తి—అతని ఆశలు, కోరికలు, సహజాతాలైన ప్రేరణలు, అతనిలోని కళాభిజ్ఞత ఇలా అన్వయం. ప్రతీక అంటే నిజానికి ఒక 'కొండ గుర్తు' లాంటిది. అది సూచించే ఒకా నొక భావంలోనే ఎన్నో అర్థ విభేదాలు వుంటూ మళ్ళీ పరస్పర సంబంధం కలిగి అవి ఒక విషయానికి క్రమంగా సమగ్రతనూ పరిపూర్ణమైన స్ఫూర్తినీ కలిగిస్తూ వస్తాయి. కావ్యారంభంలో 'గుల్మొహర్' ఒక జాతి పువ్వు, అది రాజస ప్రవృత్తి ప్రధానమైన ఉద్వేగాన్ని సూచిస్తే, కావ్యాంతంలో 'కమలాలు' సాత్విక ప్రవృత్తిని, భారతీయ, హైందవ సంస్కార జన్యమైన సాధననూ కళాభిజ్ఞతనూ సూచిస్తుంది. కాని ఆ పువ్వుల్నీ క్రిందపడేసి కవి 'ఆ చేతో గుండె వుచ్చుకోవడం' తో ఆయన అన్వేషణ పరి సమాప్తి అవుతుంది. అంటే మనిషి అంతర్ముఖుడు కావడంలోనూ, సమాధినిష్ఠుడు కావడంలోనూ గమ్యం చేరుకున్నట్లుగా మనకు అవగతం అవుతున్నది. 'నీరై పారిపోయింది' కవితల్లోని ప్రతీకల సంవిధానం ఎలావున్నదో చూపడానికి ఇదొక ఉదాహరణ మాత్రమే! కావ్యంలో ప్రతి వాక్యానికి యిలా వ్యాఖ్యానం వ్రాయవచ్చు.

జీవుడు ఈ శరీరంలో, ఈ దేశకాల పరిస్థితుల్లో బందీ

అయి ఏదో అజ్ఞాతమైన ప్రేరణలో, సహజమైన వాంఛా ప్రవృత్తిలో స్వేచ్ఛకోసం, పరితృప్తి (fulfilment) కోసం, విముక్తి కోసం అన్వేషించడమనే ఇతివృత్తం కొత్తది కాదు. శేషేంద్రశర్మ 'నీరై పారిపోయింది' అనే యీ కావ్యంలో దాన్ని అభివ్యక్తంచేసిన పద్ధతి మాత్రం కొత్తదీ, విశిష్టమైనదీను. తన 'ఋతుఘోష'లో శేషేంద్రశర్మగారే—

"ఆసల్ దీరునె దృష్టిచే మహిత గాఢాలింగనా యుక్తిచే
నా సంయోగ నిరంత వేదనములే యద్వైత సంసిద్ధికో
నై సర్గంబగు నే యగాధ కుహరాంత ప్రజ్వలానంద కీ
లా సంతర్పణకో శరీరమొక కారాగారమై తోచగన్"

అంటూ జీవుని వేదనను ఎప్పుడో వ్యక్తం చేశారు. పద్యంలో అభివ్యక్తి ఎంత వాచ్యంగా వున్నదో గమనించండి. "నీరై పారిపోయింది" కావ్యంలో ఆ పద్ధతి మారిపోయింది. 'అగాధ కుహరాంత ప్రజ్వలానంద కీల' అనేదే 'గుల్మొహర్' అయింది యిక్కడ.

ప్రతీకల ద్వారా అభివ్యక్తి జరిగే కావ్యంలో, కావ్యం చదివి, అది 'ఆపాత మధుర'మైన స్థితినుంచీ, 'ఆలోచనామృత' మయ్యే స్థితికి వెళ్ళి, అందులోని ప్రతీకల్ని పెద్దవీ చిన్నవీ (అంటే నవలలో ప్రధాన పాత్రలూ, అప్రధాన పాత్రలూలాగ) గుర్తించి, మళ్లీ కావ్యం పరిశీలిస్తేగాని బోధపడదు కవిగారి 'గ్రథన కౌశలం' ఎలా తన పని నిర్వర్తించిందో ! అలా చేస్తే తప్ప కవిత్వాన్ని ముఖ్యంగా యిటువంటి కవిత్వాన్ని విమర్శించే అధికారం, గుణదోష పరామర్శ చేసే తాహతు మనకు లభించదు !

ఈ కావ్యంలో ప్రధానమైన ప్రతీకలు, అంటే ఇతివృత్త నిర్మాణంలో అనుసంధాన హేతువులై, కవి అన్వేషణను, దాని మార్గాన్నీ, గమ్యాన్నీ ఇదమిద్ధమని సూచించే ప్రతీకలు ఏవో మొదట పోల్చుకోవాలి. అవి మొదటి పద్యంలోనే వున్నాయి : చెట్టు, కొమ్మలు, పువ్వులు, ఆకులు, రాగం లేక గొంతు లేక గానం.

చెట్టు అంటే జీవుడు (self). కొమ్మలు చేతన. ఆకులు సంవేదన. పువ్వులు ప్రవృత్తి. రాగం సృజన శక్తి.

మొదటి పద్యంలో గుల్మొహర్ పువ్వు నూతన ఋతువును ప్రకటిస్తుంది. ఆత్మ జిజ్ఞాస ప్రారంభమౌతుంది. ఈ 'నూతన ఋతువు' అంటే ఏమిటో పద్యం చివర చెబుతున్నాడు. 'ఏ ఋతువు సృష్టి అనంతత్వాన్ని గానం చేస్తూవుందో ఆ ఋతువును'. మొదటి పద్యం సృష్టి అనంతత్వాన్ని గూర్చే చెబుతున్నది. చెట్టు ముందా, విత్తుముందా? అనే ప్రశ్ననే యిక్కడ చెట్టుముందా, పువ్వు ముందా? అన్న జిజ్ఞాసగా వ్యక్తం చేస్తాడు కవి.

"ఈ దినం మాత్రం చెపుతోంది, ఒకప్పుడు నా దేశం ఒక పువ్వనీ, అందులో నే నొక మకరంద శిశువునై ఊపిరి పీల్చాననీ".

ఋతువు అంటే కాలం అనంతత్వాన్ని గానం చెయ్యడం ఏమిటి? మనిషిలో బందీ అయిన జీవుడు పూర్వాపరాలను అన్వేషించడం, సృష్టిని అవగాహన చేసుకునేందుకు అతనిలోని జిజ్ఞాసా ప్రవృత్తి, యిదంతా ఆద్యంతాలులేని వలయం. ప్రకృతిలో యిది ఎలా కనిపిస్తుందో కవి ఈ పద్యంలో చెప్పినవైనం, ఒక వలయాన్ని ధ్వనిస్తూ వాక్యాన్ని తీర్చిన సొగసు గమనించండి :

"నేను ఏ అడవుల్లో తిరిగానో సింహ శార్దూలాల గర్భాల్లో నిద్రిస్తూ నన్ను ఏ అందమైన లేడి మేసిందో శాద్వలాల్లో తన రక్త మాంసాల్ని బుజ్జగిస్తూ నేను ఏ అడవి అనుభూతికోసం చెట్టునై కొమ్మలు చాపానో నా ఆకుల అంగుళులతో శూన్యం స్పృశిస్తూ".

అడవిలో చెట్లు, చెట్ల ఆకుల్ని లేళ్లు మేస్తాయి, లేళ్లను సింహ శార్దూలాలు భక్షిస్తాయి, సింహ శార్దూలాలను అడవి తనలో దాచుకుంటుంది. ఆత్మజిజ్ఞాస ఒక ఆవృత్తంగా పర్యవసిస్తుంది. ఇతివృత్త సారాంశాన్ని కావ్యం ఎత్తుగడలో మొదట్లోనే ధ్వనించడం ఒక సంప్రదాయం.

రెండోపద్యంలో కవి అన్వేషణ ప్రారంభమౌతుంది. మనిషిచేతన రెండు విభాగాలుగా వున్నది: వ్యక్తము, అవ్యక్తము. వ్యక్తచేతనకి (Conscious mind) పగలు లేక దినం ప్రతీక. అవ్యక్త చేతనకి (unconscious mind) చీకటి లేక రాత్రి ప్రతీక. ఈ రెండు ప్రతీకలూ ప్రధాన ప్రతీకల తర్వాత గుర్తించదగిన వాటిలో ముఖ్యమైనవి. వ్యక్తావ్యక్త చేతనల సంయోగాన్ని ప్రతిపాదిస్తున్నాడు కవి రెండో పద్యంలో.

"ఈ జీవితంలో నీవు ఎన్ని రంగులతో ఆడుకున్నా, ఒకనాడు నీవు అదృష్టవంతుడివై నీ ప్రాచీన చీకటిని కలుసుకోక తప్పదు."

అవ్యక్త చేతనలో పురాస్మృతులు, జనానాంతర స్మృతులు దాగివున్నాయి. కవి తన సంపూర్ణ చేతనని ఆకళించుకోకుండా, కేవలం వ్యక్తచేతననుంచే కవిత్వం వ్రాయలేను, వ్రాయను అని చెప్పడానికి యిలా అంటున్నాడు :

"నేను ఘూరుతూ సంతరించుకున్న నా కళ్ళలాన్ని నాణ్యాలుగా మలిచి లోకపు బజారుల్లో యివ్వలేను. నా అడుక్కిపోతా. నా చెవులో దూరి నా గుండెలో దిగులా. నా కన్నులో దూరి నాత్మలోకి దూకుతా".

ఇలా బహిర్ముఖమైన తన సంవేదననీ, అన్వేషణనీ అంతర్ముఖం చేసుకుంటానంటాడు. ఆ అనుభవాన్ని తర్వాతి రెండు పేరాల్లో వర్ణిస్తాడు. దాని ఫలితంగా అతనికి లోకమే 'కొత్త దృశ్యంగా మారిపోతుంది'. ఇప్పుడు సంపూర్ణ చేతనతో అన్వేషణ ప్రారంభమౌతుంది. దాన్ని అభివ్యక్తం చేసిన ఈ భావచిత్రంతో పద్యం ముగుస్తుంది.

"చెట్టు బుగ్గలు పూరించి రెండు శాఖలతో ఒక పువ్వు పుచ్చుకుని షహనాయీ ఊదుతుంది.

"ఒక్కరాగం విసిరి బుల్ బుల్ తోట తోటనంతా తన చిన్ని రెక్కలమీద ఎగరేసుకుపోతుంది."

"రెండు శాఖలు" ఎందుకంటే వ్యక్తావ్యక్త చేతనలూ రెండూ కలిసిన స్థితిలో కావ్యం వ్రాస్తున్నాడు. పువ్వు అన్వేషణా ప్రవృత్తి. షహనాయీ మంగళ వాయిద్యం. కవి ఆత్మజిజ్ఞాస పరమైన, విశ్వశ్రేయోదాయి అయిన కావ్యాన్ని వ్రాస్తున్నాడు. తన సృజనశక్తితో (రాగం) కవి (బుల్ బుల్)లోకాన్ని ఉర్రూత లూగిస్తాడు.

ఇలా ప్రతి పద్యాన్నీ వివరంగా వ్యాఖ్యానిస్తూపోతే కవి గ్రథన కౌశలం ఎటువంటిదో ప్రతి వాక్యంలో, ప్రతిపద్యంలో వ్యక్తమౌతూనే ఉంటుంది. అలాంటి వ్యాఖ్యాన గ్రంథం వ్రాయడం ప్రకృత ప్రయత్నం కాదు గాబట్టి మిగతా పద్యాల్లోని ఇతివృత్త విన్యాసాన్ని క్లుప్తంగా సూచిస్తూ ప్రతీకల్ని పేర్కొంటాను. ప్రతీకల వివరణ ఆధారంగా యింకా విపుల వ్యాఖ్యానానికి ఎవరైనా పూనుకోవచ్చు.

మూడవ పద్యంలో కవీ, విశ్వమానవుడూ, తన అస్తిత్వాన్ని గూర్చి ప్రశ్నించుకుని అంతర్ముఖుడై సంపూర్ణ చేతనతో అన్వేషణ సాగిస్తున్న వ్యక్తీ, ఒకటవుతారు. అందువల్ల యీ అన్వేషణ మానవత్వాన్ని గూర్చిన అన్వేషణ విశ్వజనీనమైంది. కేవలం వైయక్తికం కాదు. అందుకే యీ కావ్యం ఆత్మాశ్రయ కావ్యంగా, స్రరియలిస్టు కావ్యంగా, మనోభావాల స్వేచ్ఛాభివ్యక్తిగా పైకి భాసించినా, నిజానికి అంతస్సత్వంలో ప్రతీక పద్ధతిలో వ్రాయబడిన ఒక తాత్త్విక దార్శనిక కావ్యం.

మూడవపద్యంలో మానవుడు ప్రకృతి సహజమైన సృజనాత్మక శక్తిని మొదట్లో కలిగివుండి తర్వాత పోగొట్టుకోవడం వల్ల దుఃఖితుడయ్యాడనీ (రోజాల సముద్రాల్లా కన్నీటి బిందువులు), వ్యక్తచేతన ప్రాభవం అవ్యక్త చేతనను అణిచిపెట్టిందనీ (కిరణాలు నా కల్లో మొలకెత్తనీడం లేదు) మానవుడిట్లా ఆత్మహత్య (సమాధి, కీర్తిభరిత ఆత్మహత్యలు) చేసుకొన్నాడనీ చెబుతాడు. పరిష్కారం వ్యక్తచేతన ప్రధానంగా ఏర్పడిన అహంతను తెగవెయ్యడమే. (కాంతుల కుంతలాలతో నిండిన నా తల కోసి సమర్పిస్తాను). తద్ద్వారా పునర్జీవం ప్రారంభమౌతుంది. (ఎర్ర గులాబులు రాలుతాయి వగైరా)

నాలుగవ పద్యంలో మరో ప్రతీక వున్నది. దీపం అంటే మేధాగతమైన జిజ్ఞాస. ఆ దీపాన్ని కాస్త ఆర్పివేస్తే 'చీకటిచేత మింగబడిన గది'లో ఏం కనిపిస్తుంది? అవ్యక్త చేతనలోనుంచి ఏం వస్తుందో, తనకు తెలిసిన వ్యక్తిత్వం ఎలా రూపుమారి పోతుందో తెలీదు. తనకు ఏం జరుగుతుందోనని భయం. ఇలా సందేహించినా 'నేను, నా వ్యక్తిత్వం మారని దెప్పుడు?' అని సమాధానం చెప్పుకుని అంతర్ముఖుడై చరిత్రను దర్శించే ప్రయత్నం చేస్తాడు. (కాలుతున్న సిగరెట్టు)

ఐదవపద్యం సృష్టి తొలిపొద్దుల్ని వర్ణిస్తుంది. అది 'భూమ్యాకాశాల నాడీమండలం. సంతోష కేకల ప్రకంపనలతో నర్తించిన' దృశ్యం సృష్టిలో మానవుడు ప్రవేశించగానే వేదన ప్రారంభమైంది. మానవుని చేతన జాగృతం కావడంతో ప్రకృతి ముగ్ధత్వాన్ని కోల్పోయింది. ('నగ్నశిశువు గంగానది...తొలికిరణం తగులగానె నీరైపారిపోయింది'.)

ఆరవ పద్యంలో మనిషిలోని జాంతవ ప్రకృతి 'ప్రసక్తమైంది. 'ఒక రెక్కల జంతువు' గా మనస్సు 'మలయా మర్మభూముల్లోకి ఆఫ్రికానేల మూలధాతువుల్లోకి' పయనిస్తుంది. ఈ అవచేతన (Lower consciousness) పౌరాణికము, అతీతము, అద్భుతము, మార్మికము, రాక్షస పదార్థము అన్నీ మిళితమై ఒక అలౌకిక మత్తు కలిగించే సీమ. దాని ప్రభావంతో వ్యక్తచేతన ఆత్మజ్ఞానం తాలూకు పరితృప్తిని పొందటానికి ప్రయత్నిస్తుంది. (నే నక్కడ సరస్సులో తేలే చందమామను పట్టుకోవడానికి వల విసిరేసి కూర్చున్న జాలరిగా...) చందమామ ఆత్మ ప్రతిబింబం అంటే ఆత్మజ్ఞానానికి సంకేతం. వెన్నెల ఆనందాన్ని సూచిస్తుంది. ఇక్కడ వ్యక్తచేతన, అవచేతనల సంయోగమూ, తద్ద్వారా మనస్సుపొందే అనుభూతీ వర్ణితమైంది. (పూల పండుగలు చేసుకుంటాయి ... బాధల అందాలు అడవులై అల్లుకుంటాయి...) ఇక్కడ కవి వాచ్యంగా చెప్పిన భావాన్ని జాగ్రత్తగా గుర్తించాలి. ఈ కావ్యానికి యిలాంటివి కీలకమైన తాళం చెవుల్లాంటివి. 'నా శరీరం నా యుగీన తర్కానికి ఖైదీ అయి నేను నా స్మృతియాన సుఖాలన్నీ కోల్పోయాను. కాని నాలో వున్న జంతువు సృష్టిపరంపరల తర్కాన్ని సమస్తమూ వాసనలుచేసి మోసుకుని వస్తుంది, గర్భంనుంచీ గర్భానికి నేను చేసే అనంత ప్రయాణంలో. నేను ఘనీభవిస్తే ఒక నామ రూపాత్మక దేహం. నేను ద్రవీభవిస్తే ఒక జ్ఞాపకాల ప్రవాహం ! నేనున్న చోట యిప్పుడు లేను ఎప్పుడూ లేను ! ఇది అన్వేషణలో ఒక మజిలీ, బందీ అనుకున్న జీవాత్మ స్వేచ్ఛను దర్శిస్తోంది. ఆ స్వేచ్ఛ తాను ఒక జ్ఞాపకాల ప్రవాహాన్నని పోల్చుకోవడంలో వుంది. కాని ఇక్కడితో ఆత్మాన్వేషణ పూర్తికాలేదు. ఇది కాదు గమ్యం.

ఏడవ పద్యంలో జీవాత్మ పొందిన స్వేచ్ఛ తనలోకి తను పారిపోవడంగా, 'అంతర్లోక చిత్రాల రంగులతో' ఒక భావనా జగత్తును నిర్మించుకోవడంగా రూపొంది, వాస్తవ జగత్తుకు దూరమౌతున్నది అనే విషయాన్ని గుర్తిస్తాడు కవి. (వంకర టింకర్లుగా ఎగురుతున్న సీతాకోక చిలుక శూన్యంలో గీతలుగీచి, నా జాగృతి లోకాలకు రంగు రంగుల సరిహద్దులు నిర్మించింది) సీతాకోక చిలుక అంటే కాల్పనిక కవి (Romantic poet.) దార్శనికుడైన కవి వేరు.

ఎనిమిదవ పద్యంలో కూడా కాల్పనిక లోకాల్లో విహరిస్తున్న కవే దర్శన మిస్తున్నాడు. ఈ కాల్పనిక కవికి వాస్తవ జగత్తుతో సంబంధం లేకపోవడంతో సదసద్సంశయం తీరదు. ''నేనేమో దేశ కాలాలు విడుదల చేసిన పాటనై, మాటనుంచి విడుదలైన గొంతునై, గొంతునుంచి జారిపోయిన స్మృతినై దిగంతాల్లోకి కలిసి పోదామని కలలు కంటున్నాను''. ఈ కలల్లోనే వుండిపోవడం ఒక రకమైన మృత్యువనే స్పృహ కలుగుతుంది పద్యం చివర. ''నా కల పూర్తి గాక ముందే సూర్యుడు ఉదయిస్తుంటే ఒక రంగుల హిమబిందువు రక్షించింది నా అస్తమిస్తున్నప్రాణాన్ని''— సూర్యుడు ఉదయించడమంటే వ్యక్తమానసం నుంచీ వచ్చిన హెచ్చరిక అన్నమాట.

తొమ్మిదవ పద్యంలో మొదటి సారిగా'తామర పువ్వు' ప్రతీక దర్శన మిస్తుంది. తామర పువ్వు భారతీయ సంస్కృతికి చిహ్నమని వేరుగా చెప్పనక్కరలేదు. పద్మం లేనిది మన దేవుళ్ళూ దేవతలూ లేరు, మన కవిత్వం లేదు, శిల్పం లేదు. భారతీయ

సంస్కృతి కవిని సమ్మోహితుణ్ణి చెయ్యడం, యిది అన్వేషణలో రెండవ మజిలీ. సంస్కృతి తాలూకు స్మృతులు యిప్పుడు జీవాత్మను చుట్టుముట్టాయి. కవి అంటాడు : "నేనెప్పుడూ ఒక రాగానికి మేళవించిన తీగెనని తెలుసుకున్నా" జ్ఞాపకాల ప్రవాహం దాన్ని ఆలంబనం చేసుకునే సృజన శక్తి ఒక దిక్కులోనే వెళ్తున్నాయి. అదే సంప్రదాయం. ఆ సంప్రదాయంయొక్క అభివ్యక్తి మానవుడు. దీన్ని గుర్తించడమే ఆత్మజ్ఞానమా ?

పదో పద్యంలో సంప్రదాయమే తనుగా తాదాత్మ్యం ఊహించిన కవికి తర్వాత ఏమైందో చెబుతున్నాడు. అతని "నోట్లో వాగ్దేవత ఒక పిప్పరమింటులా నిలిచిందట". "ఉపమానాలూ ఉత్ప్రేక్షలూ, పనిముట్లుగా టేబిలుమీద పెట్టుకున్నాడట." కాని వీటికి తనలో ఉన్న ఆవేశానికీ సంబంధం లేదు! "ఇంతలో రోడ్డులో గాలివాన కిటికీలోనుంచి వచ్చి అన్నిటినీ ఎగర గొట్టేసింది." గాలి అంటే సమకాలీనమైన సామాజిక రాజకీయభావ సంచలనం. ఏడో పద్యంలోనే "పాలికేకలు పోగుచేసుకొంటూ వచ్చే హోరుగాలి" అంటూ తప్పించుకొనే ప్రయత్నం చేశాడు కవి. పాలికేకలు అంటే నినాదాలు; గాలి అంటే రాజకీయ భావ సంచలనం. సంప్రదాయాన్ని ఆశ్రయించిన కవి మనస్సు ఈ గాలి వానతో కల్లోలమైపోయింది. తన్ను తాను గుర్తించే అన్వేషణయొక్క దిశలు తికమక చెందేయి. "చంద్రమండలాలు వెండికంచాల్లా దొర్లుతూనే ఉన్నాయి." చంద్రుడు వెండికంచం అయ్యేడంటే మానవుడు ఆర్థిక మానవుని స్థితికి దిగజారేడని ధ్వని. జీవాత్మ "ఆవారా" అయింది. ఆత్మజ్ఞానం హుళక్కి అయింది. చేతనలో చెలరేగిన ఈ ఆందోళనకు కవి స్వస్తి చెప్పాడు. అది తన మార్గం కాదని తెలుసుకున్నాడు.

పదకొండో పద్యంలో కవి మేధాగతమైన జిజ్ఞాస అసంపూర్ణత్వాన్ని గ్రహించి మళ్ళీ అంతర్ముఖుడవుతాడు. "దైనిక తుఫానుల్లో పలిగిన నా ఆకుల గాయాల్ని కడిగి కట్లుకడుతున్నాయి నా నిశీధ స్వప్నాలు" అంటాడు. బాహ్యప్రపంచంద్వారా వ్యక్తచేతన పొందే నిరాశా నిర్వేదాలకు అంతర్ముఖుడైనప్పుడు పూర్ణచేతసలో సాంత్వనం లభిస్తోంది. అంతకంటె ప్రధానమైన సత్యాన్ని కూడా గ్రహిస్తాడు. "పూలల్లో నైతిక దండయాత్రలు చేసే సోమరిగాలి వెదురు పొదల్లో చిక్కుకున్నప్పుడే రాగాలు తీసే విద్య నేర్చుకుంటుంది." వాంఛాప్రవృత్తిపై నీతి—అవినీతి అనే విమర్శతో దాడిచేసే భావాలూ, ఆదర్శాలూ, జీవిత యథార్థాలలో చిక్కి స్వధర్మంగా రూపొందినప్పుడే నిజమైన జీవితపు విలువలూ, సృజనాత్మకమైన భావాలూ అవుతాయి, అంటున్నాడు ప్రతీకల భాషలో. అంటే నేర్చుకున్న విజ్ఞానం నుంచి అనుభవంరాదు, అనుభవంనుంచే జ్ఞానం రూపొందుతుంది. కవి తన లక్ష్యమైన ఆత్మదర్శనాన్ని మళ్ళీ గుర్తుతెచ్చుకుంటాడు. "గాలి వానల గాలికి గగనంలోనుంచి ఆ చంద మామ ఎక్కడ ఎగిరిపోతుందో అని నా భయం" అంటాడు. దుఃఖాలకూ, ప్రేమలకూ ప్రాధాన్యం ఇవ్వడం మాని, మళ్ళీ ఆత్మాన్వేషణకు పూనుకుంటాడు.

పన్నెండో పద్యంలో కవి తన రచనద్వారా లోకంతో సంబంధం ఏర్పరచుకోవడం గురించి చెబుతున్నాడు. తను మరణించినా తన కవిత్వం నిలుస్తుందికదా, తన కవిత్వమే తన ఆత్మ ప్రతిబింబం కదా, ("ఒక సౌందర్యమూర్తి అద్దంలో మునిగి స్నానం చేస్తోంది," వగైరా) అనుకుంటాడు. కాని వ్రాసిన కవిత్వం ఒక "ఊహాయాన దుకాణమే" కాని అది తన 'గృహం' కాదు. గృహం 'నక్షత్ర లోకాల్లో' ఉన్నది, ఆకాశమే తన గమ్యం అని నిర్ణయించుకుంటాడు. ఆకాశం అంటే కేవలం (Absolute) పరమ సత్యానికి ఆకాశం ప్రతీక.

పదమూడో పద్యంలో కవి సౌందర్యాన్నే 'కేవలం'గా భావించి దానిలో తను లీనం కావడంద్వారా గమ్యం చేరుకోవాలని చూస్తాడు. ఈ పద్యంలో 'సంధ్యామహూర్తు' శృంగారపరమైన ఆవేశానికి ప్రతీక. సంధ్య దివారాత్రాల కలయిక. 'పశ్చిమాన పూచిన తార ఆకాశ నీలిమకు చెల్లెలు' అనడంలో శృంగారానుభూతిలో అద్వైతానుభూతిని ఆకాంక్షిస్తాడు. "ఆ సంయోగ నిరంతవేదనములే అద్వైత సంసిద్ధికో" అన్న ఋతుఘోషలోని పద్యాన్ని ఇక్కడ మళ్ళీ జ్ఞాపకం తెచ్చుకోవాలి. కాని ఆ సౌందర్యానుభూతి స్వరూపమేమిటో వాచ్యంగా ఇక్కడ చెబుతాడు. "సౌందర్యానుభూతి కండలోకి గుచ్చిన కత్తిలా ఉంటుంది...సుఖ దుఃఖాల హద్దులు రద్దయిపోయిన ఆ అనుభూతిలో నాకు సౌందర్యభరిత బాధలతో చావు దగ్గరకు వస్తుంది." ఇదీ మృత్యువే. ఆత్మసాక్షాత్కారంకాదు. ఇక్కడితో మరో మజిలీ పూర్తి అయింది. 'మరో పువ్వు అస్తమించింది' అంటాడు. అది ఒకానొక ప్రవృత్తికి స్వస్తి.

"పద్నాలుగో పద్యంలో కవి మళ్ళీ దీపాన్ని, మేధాగతమైన జిజ్ఞాసను ఆశ్రయించడం కనిపిస్తుంది. దాని వెలుగులో జీవితం ఒక 'ద్రాక్షారస మేనక'గా దర్శనమిస్తుంది. ఆకాశాన్ని (కేవల సత్యాన్ని) వదలి 'ఆఖరి బొట్టుకూడా అదృశ్యమైపోయిన సీసాలోకి ద్రవమై ప్రవహించి పోతాను' అంటాడు. ఆశలు వట్టిపోయిన జీవితంలోనే మళ్ళీ నిమగ్నుడవుతాడని ఊహించాలి. ఇక్కడ విషయ లాలస కూడా ధ్వనిస్తోంది.

పదిహేనవ పద్యంలో కవి నిర్వేదం, దైన్యం వర్ణితమయ్యాయి. "మనిషి అసహాయుడై ఆక్షణపు నిరంకుశత్వానికి లొంగి పోతాడు. అప్పుడు రెండు కళ్ళలోనుంచి గంగాయమునలు కారుతాయి." ఇక్కడ పరిస్థితిని కవి వాచ్యం చేశాడు. ఈ మనఃస్థితి తాత్కాలికమే. దీని నుంచి తప్పించుకునే మార్గాన్ని అన్వేషిస్తూ ఉన్నట్లు పద్యం చివర స్పష్టం చేస్తాడు.

పదహారో పద్యంలో కవి తన కవిత్వం ద్వారా నిర్మించే స్మారక చిహ్నం ఫారోవా నిర్మించిన పిరమిడ్ కంటె గొప్పది అంటాడు. కారణం తాను "పుస్తకాలతో మనిషి పశుత్వానికి ఆనకట్టలు కడతాడు, వాడు పశుత్వంతో మనిషికే ఆనకట్టలు కడతాడు." కవి కవితా వ్యాసంగాన్ని సాగిస్తున్నాడు.

పదిహేడో పద్యంలో చెట్టు మళ్ళీ దర్శన మిస్తుంది.అంటే జీవాత్మ. చేతనలో ఏదో స్ఫురిస్తోంది. "కిటికీలో సంధ్యా రెండు పక్షులూ కలిసి ఒక తైలవర్ణ చిత్రం కనిపించింది. అవి రెండు బిందువులై కాషాయగగనం మిగిలింది కిటికీలో వ్రేలాడుతూ".—ఊహా పథంలో కనిపించిన ఆ పక్షులు ఉపనిషత్తులోని "ద్వా

సుపర్ణా.'' 'కాషాయ గగనం' అంటే నివృత్తిమార్గాన గోచరించే కేవల సత్యం. 'కుక్షిలో కోట్లాది బ్రహ్మాండా లున్నాయనీ, సృష్టి అనంతత్వాన్నిగూర్చి ఆలోచిస్తాడు. జీవితంలో ఎదురైన నిరాశలు వేదాంతాన్ని తెస్తాయిగాని, ఆ వేదాంతంకంటె ప్రేమ అనే పువ్వులో విషాదమే మకరందంగా (ప్రేమ ప్రవృత్తిలో విషాదమే మాధుర్యం) అంగీకరించి తృప్తిపడతానంటాడు. కాని లోకంమీద విరక్తి పద్యం చివర ధ్వనిస్తుంది.

పద్దెనిమిదో పద్యంలో అన్వేషణకు ప్రయోజనం, సిద్ధి అన్వేషణే నంటాడు. ''ఆకాశం (కేవల సత్యం) శూన్యపు బీడుకాదు· అది పక్షులనే రెక్కల గాయకుల గూడు, గాలి నిరంతరం మబ్బుల శిల్పాలు చెక్కే మాయానగరం.'' కేవల సత్యం అంటే అనుభూతి పరిపూర్ణత; అందులోనిదే మనిషి చేతన; తత్వశాస్త్రాలూ శిల్పాలు మాయాకల్పితాలు, అనే అవగాహన రాగానే 'కఠిన జీవనఖైదీ' అయిన జీవునికి విముక్తిమార్గం లభించినట్లవుతుంది. ''ఊచల కావల ఎగురుతున్న ఆ చిన్న ఆకాశపు చింకి పీలికే చాలు'' అంటాడు. అన్వేషించిన సత్యం ఎక్కడో లేదు అనుభూతిలో నిత్యమూ తన్ను స్పృశిస్తూనే ఉన్నదన్న అవగాహన ఇది.

పందొమ్మిదో పద్యంలో సత్యాన్ని తనలోనే దర్శించిన కవి, జీవితాన్ని గూర్చి ప్రవచనాలు పలుకుతున్నాడు. ''మనిషి జీవన శిఖరాలు అందుకోవాలని పరిగిడుతుంటే మృత్యువు మనిషి జుట్టు పట్టుకోవాలని పరిగిడుతోంది. ఈ సమస్య ఏదైతే ఉందో అదే కన్నీటికి జన్మస్థానం'' ఇదే జీవుని వేదన **(existential anxiety)** అంతరార్థం. ''మృత్యువు ఆకులై రాలుతూ ఉంటుంది హేమంత వృక్షాల్లో'' అంటే సంవేదనల్లో వచ్చేమార్పే కాలంగానూ, మృత్యువుగానూ భాసిస్తుంది. కాబట్టి నిజంగా మృత్యువు అనేది లేదు. అన్వేషణలో, వేటలో 'మృత్యువే మృత్యువుకు దొరుకుతుంది' అంటాడు. ఇక్కడితో భ్రాంతి సమాప్తమవుతుంది.

ఇరవయ్యో పద్యంలో కవికి సృష్టే ఒక మహావృక్షంగా తోస్తుంది. ''అందరమూ ఏ చెట్టుకో పుట్టిన ఆకులం. ఏ శాఖకో పూచిన పువ్వులం. అందరమూ అన్నీ విడిచిపోతాము, మరికొన్నిటికి తావిస్తాము, కాని జీవిస్తాము.'' సృష్టి శాశ్వతంగా సాగిపోతూనే వుంటుంది. మనుష్యులు పుట్టినా గిట్టినా సృష్టికి మృత్యువులేదు. ''విశ్వశూన్యంలో పరుగెత్తే ఈ బ్రహ్మాండమైన చక్రాన్ని ఎవడాపగలడు?'' ఈ సృష్టి రహస్యం తెలిశాక 'సిద్ధాంతి పంచాంగమూ,' 'రాజకీయ ప్రభువు లౌడ్ స్పీకరూ' హాస్యాస్పదంగా కనిపిస్తాయి. ఈ పద్యంలో కవి లేక జీవాత్మ (వృక్షం) తానొక మహావృక్షశాఖగా గుర్తించడం అద్వైతానుభూతికిసూచన.

ఇరవయ్యొకటవ పద్యంలో కవి తన జీవితాన్నీ అన్వేషణనూ వెనక్కి తిరిగి చూచుకొని ''జీవన తరంగాలు వస్తూ పోతూ... అమూర్త స్థితినుంచీ వచ్చిన నన్ను మళ్ళీ అమూర్తస్థితికి చేరుస్తున్నాయి'' అంటాడు: ఒక దినం గడిచింది. ఒక జీవితం ముగిసింది. ''నదిలోకి జారిపోతున్న సూర్యుడు గుండ్రంగా ఉన్నాడు. సూర్యబింబం నదిలో కొట్టుకుపోతోంది. చెట్ల నీడలు కొండల నీడలు కూడా నీటిలో కంపిస్తున్నాయి. నదీప్రవాహానికి లోకం కంపించే ముక్కలే, లోకం తానొక స్థిరమహత్తు ననుకోవచ్చు గాక'' దృశ్యప్రపంచం, సృష్టిసర్వమూ ఒక ఆభాస **(appearance)** మాత్రమే. మాయ, లీల అనే వేదాంత సత్యాన్ని చేరుకున్నాడు. ''కానీ రోజూ ఆకాశం సూర్యుడనే ఎర్రటి గ్రుడ్డు పెడుతూనే ఉంటుంది.'' సృష్టి ఆభాస అయినా శాశ్వతంగా సాగుతూనే ఉంటుంది. సృష్టి నిత్యం.

ఇట్లా వేదాంత సత్యాన్ని దర్శించిన కవి చివరిదైన ఇరవై రెండో పద్యంలో మానవుని అస్తిత్వాన్ని గూర్చి ప్రవచిస్తున్నాడు. చివరి సత్యం ఏదైనా మానవుడు మానవుడే! ''ఒక విలాస రేఖల శలాకలాంటి స్కాచ్ సీసాలో ఒక బంధింపబడిన తరళద్రవ రాక్షసుడు, వాడిముందు నేను.'' బంధితుడే అయినా మానవుడు తన అనుభూతివల్ల, అన్వేషణవల్ల, స్వేచ్ఛాప్రియత్వంవల్ల, భావనాశక్తివల్ల, ధార్మికుడై, విజేతయై, రసజ్ఞుడై, గగన విహారియై విజృంభిస్తున్నాడు. మానవుని బంధాలే అతణ్ణి గొప్పవాణ్ణి చేశాయి. అతనిలోని విజిగీష సంస్కృతిని సృష్టించింది. కాని ఆ విజిగీషకంటె అతని హృదయం గొప్పది. విజిగీష ఇవ్వలేని ప్రశాంతి హృదయం యిస్తుంది. ''చేతిలో కమలాలు క్రిందపడేసి ఆ చేతో గుండె పుచ్చుకున్నాను. నేను నా శరీరంలోనే పడుకుని నిద్రపోతాను.'' అంటాడు.

కావ్యం చివర కవి వాక్కు గమనింప దగింది. ఒక 'నిట్టూర్పులా వెలువడిన' ఈ కావ్యం 'సరియలిస్టు పిచ్చివాగుడు' గా కనిపిస్తుంది. కాని యిది కవిత్వమేనని సూచిస్తూ ముగించాడు.

* * *

ప్రతీకన్ని ఆలంబనం చేసుకున్న అభివ్యక్తి ధ్వనీ ప్రధానమైన ఈ కావ్యాన్ని సవ్యంగా వ్యాఖ్యానించుకుంటే యిందులో కనిపిస్తున్నది తాత్త్వికమైన ఇతివృత్తం. జీవుని వేదన **(Existantial Agony)**, భ్రాంతి మూలచ్ఛేదకమైన అన్వేషణా ఆ ప్రయాణంలో కవి చేసిన మజిలీలు, చివరకు చేరుకున్న గమ్యం యిందులో స్పష్టంగా ఉన్నాయి. దీన్ని కేవలం జననాంతర స్మృతుల స్వేచ్ఛాభివ్యక్తిగా ఎలా గ్రహించేది? ఇందులో జననాంతర స్మృతులు లేవు కానీ సృష్టి తొలిప్రొద్దుల దృశ్యాలు, వర్ణనలు, భావచిత్రాలు, ఉన్నాయి. కవి వాటిని తన యితివృత్తానికి సామగ్రిగా, సాధనాలుగా వాడుకున్నాడు. కవి నగరం వదలి ప్రకృతిమధ్య కూర్చున్నాడు కావ్యం వ్రాయడానికి. కాని వ్యక్తంచేసిన ఆవేదనలు అన్నీ ప్రకృతినుంచీ ప్రత్యాఖ్యానం చెందిన మానవుడు **(alienated man)** పొందుతున్న అస్తిత్వ పరివేదనలే **(Existential anxieties,)** ఈ కావ్యం వ్రాయడం ద్వారా కవి ప్రకృతితో, సృష్టితో తాదాత్మ్యన్ని మనసా వాచా కర్మణా సాధించాడు. ప్రకృతిలో లీనమైన కవి ఆంతర్యంలో జరిగిన యీ అన్వేషణ ఆధునిక మానవునికి మార్గదర్శి శేషేంద్రశర్మ ఈ విషయం స్పష్టంచేశారుకూడా పీఠికలో—

**"....the poet developes that consciousness by which he wakes up those genetic memories flowing in his blood streams in common with his fellow**

**beings and revives the story of man again in him. The poet becomes at that singular moment the epihome of mankind."** ఇక్కడ **'genatic memories'** అంటే జనని యైన ప్రకృతితో మానవుని సంబంధాన్ని పునరుద్ధరించే పురిటి స్మృతులే తప్ప వేరు కావు. మానవుల్లో వ్యక్తికీ సమిష్టికీ గల సంబంధంకూడా ప్రకృతినీ సృష్టినీ అన్వేషించడం ద్వారానే అవగాహన అవుతుంది. అలాంటి వేదాంతపు ప్రశ్నలతో అవసరం లేకుండా ఉత్పత్తి సాధనాలు ఎవరిచేతుల్లో ఉన్నాయి? అనే ప్రశ్నతో, రాజకీయ దర్శనంతో, పరిష్కారాలు అన్వేషిస్తే ఆధునిక మానవుని సమస్యలు 'అన్నీ' తీరవు, అనే మాటకూడా శేషేంద్రశర్మ పీఠికలోనే స్పష్టంచేసి ఉన్నారు. (పుట **XXVI**). ఈ కావ్యేతివృత్తానికి జన్మ పరంపరతోగాని, ఆధ్యాత్మిక సాధనతాలూకు పంచకోశాలతోగాని సంబంధం వున్నట్లు నాకు తోచదు. కవి అభివ్యక్తి కోసం ప్రకృతిని ధ్యానించడంలో, దృశ్యంతో తదాత్మ్యం చెందడంలో, అహంతను అధిగమించిన సమాధ్యవస్థ పొంది ఉంటే పొందిఉండవచ్చు. దాన్ని పరిశీలించడం కావ్య విమర్శకు అప్రస్తుతం. "ఒక స్థూలదృశ్యం ఐన ఒక భౌతిక దృశ్యంలోనుంచి దాని తాత్త్విక దృశ్యాన్ని చూడడం అంటే ఒక వస్తువులోనుంచి దాని వాస్తవికతను పిండుకోవడం, "సింబలిజమ్" అని శర్మగారే తన పద్ధతిని "రక్తరేఖ" లో వివరించారు. (పుట 62). ఆ పద్ధతినే "నీరై పారిపోయింది" కావ్యంలో అక్షరాలా ఆచరించి చూపారు.

" 'అహం వృక్షస్య రేరివా' (తైత్తిరీయం) నేను ఈ చెట్టు యొక్క లోపలి ప్రేరేపకుడిని. ఈ సుఖ దుఃఖమయ జీవిత మూ, జీవితం తర్వాత జీవితం, యిట్లా జీవి అనుభవించే దుఃఖ పరంపరా, అంతా వృక్షంగా కనిపించింది ఈ మంత్రద్రష్టకు. తొలుత ఈ సుఖదుఃఖమయ జీవితం ఒక్క శుక్ల శోణిత బిందువే. అదే శిశువై, బాలుడై, యువకుడై, వృద్ధుడై, పెరిగేకొద్దీ తన వెంబడి నానారూపాత్మక సుఖదుఃఖాలను పెంచుకుంటూ వస్తుంది. అక్కడ బాలుడా, యువకుడా అన్నదికాదు ప్రధానం. చిన్నది పెద్దదై, పెద్దది మరింత పెద్దదై ఎట్లా సుఖదుఃఖాత్మక జీవితం కొమ్మలు రెమ్మలు గుస్తరించుకుంటూ చివరకు మహా వృక్షంగా తయారవుతుందో అదీ వాస్తవదృశ్యం". (రక్తరేఖ, 50వ పుట) రక్తరేఖలో ఒక ఉపనిషద్వాక్యానికి శేషేంద్రశర్మ వ్రాసిన ఈ వ్యాఖ్యానాన్ని చదివితే తెలుస్తుంది, 'నీరైపారిపోయింది' కావ్యానికి ప్రతీకలూ ఇతివృత్తమూ ఏ ఆలోచనలనుంచి వచ్చాయో... 'రహస్యమంతా ఎక్కడుందంటే, ఈ బింబాలు ప్రతీకలు అలంకారాలు పుట్టే జన్మస్థలంలో వుంది. బయటిగాలి రేపుతుంది సూక్ష్మ తరంగాల్ని—ఎక్కడ? ఎక్కడో జీవకుహరాంతరాల్లో. వాడికే తెలీని లోతుల్లో. అందులోనుంచి ఏవో చందమామలు సూర్యబింబాలు తారామండలాలు లేస్తాయి ఆ ఆంతరిక వెండిజలాల లోతుల్లోనుంచి. మరొక అపరిచిత ప్రపంచం సంపూర్ణిమతో ఉదయిస్తుంది. ఒక అద్భుతసృష్టి ఉద్భవిస్తుంది మిలియన్ల కాంతిచ్ఛటలతో. దాని బుడగలు, దాని కిరణాల తునుకలు, దాని రౌప్యతేజస్సు, ధూళి అన్నీ ఎగిరి పడతాయి మనిషి ఊర్ధ్వచైతన్య మండలం మీద. రెక్కలు దాల్చిన శబ్దాలై మళ్ళీ గాలిలోకే ప్రవేశించి ఎగిరిపోతాయి. కవి చెయ్యవలసిందల్లా వాడి దహరాంతరాలను బహిరంతరిక్షాల వాయువులకు ఆవిష్కరించడమే—ఆ శక్తి, ఆ స్థితి వాడు పొందవలసినది. అప్పుడొస్తాయి ఈ ప్రతీకలూ ఈ బింబాలూ ఉల్కల్లా ఉషస్సుల్లా... ఈ శబ్దాలకు అర్థాలు వ్యావహారిక ప్రపంచంలో దొరకవు. కవికి కూడా ఆయన వ్యావహారిక స్థాయికి వచ్చిన తర్వాత, అవి అపరిచిత అతిథులే." ('నిశాంతం' కావ్యానికి శేషేంద్రశర్మ పీఠిక) ప్రతీక పద్ధతిలో కావ్యం వ్రాయడమంటే కొన్ని గుర్తులు పెట్టుకొని ఒక ప్రహేళికను నిర్మించి ఒక గూఢ కావ్యాన్ని తయారుచేయడం కాదు. ఆకృత్యావస్థ ఎలాఉంటుందో స్వీయానుభవాన్నే శేషేంద్రశర్మ పై వాక్యాల్లో వర్ణించారు. ఈ రెండు ఉద్ధరణలూ ఈ సందర్భంలో చూపడానికి కారణం—"నీరై పారిపోయింది" కావ్యానికి ఈ వ్యాసంలో చేసిన వ్యాఖ్యానం, వివరణా, విమర్శకుడు స్వోపజ్ఞతో చేసిన ఊహానిర్మాణం కాదని మనవి చెయ్యడానికే. అలా అని చెప్పడంతో కావ్యంయొక్క బహుళ వ్యంజకత్వాన్ని ఈ వ్యాఖ్యానం పరిధిలో బంధించి వెయ్యడమూ కాదు. వచనానికీ, కవిత్వానికీగల భేదం యిక్కడే ఉంది. వచనంలో నిర్దిష్టమైనభావం, అర్థం ఉంటుంది; కవిత్వంలో శబ్దసృష్టి, కళాస్వరూపం మాత్రమే ఉంటుంది. **"Poetry is not made with ideas, it is made with things or words that signify things"** అంటాడు మల్లార్మే. **A Poem should not mean but be"** అంటాడు మెక్లీష్. వచన కవిత్వం అనే ప్రక్రియ ధ్యేయం కూడా కవిత్వం నిజతత్త్వాన్ని మరుగుపరిచే ఛందస్సు వగైరా లక్షణాలను వర్జించడంద్వారా దాని నిజతత్త్వాన్ని నిరూపించడమే తప్ప, దాన్ని వచనం స్థాయికి దిగజార్చడంకాదు! అందువల్ల ఆధునిక కవిత్వంలో కవిత స్వీయరూపం ప్రస్ఫుటమయ్యే కొద్దీ దానిలోని శబ్దసృష్టి వాచ్యార్థానికి దూరమై, సంభ్రమాశ్చర్యాలు కలిగిస్తూ, 'పిచ్చివాగుడు' లాగే కనిపిస్తుంది. వచనానికి వ్యాఖ్యానం అక్కరలేదు. నిఘంటువు చాలు. కవిత్వానికి సహృదయుని వ్యాఖ్యానం కావాలి. ఆ వ్యాఖ్యానం అర్థనిర్దేశంలా కనిపించినా అది అర్థనిర్దేశం కాదు. కవిత్వంయొక్క కళాస్వరూపాన్నీ, అభివ్యక్తినీ, స్పృశించి, అనుశీలించి, గుర్తించడమే అవుతుంది. వచనం అవగాహన అయితే కవిత్వం అనుభవం. ఆ అనుభవాన్ని నిరూపించడానికి విమర్శకుడు చేస్తే ప్రయత్నమే వ్యాఖ్యానం.*

'నీరై పారిపోయింది' కావ్యసృష్టిద్వారా శేషేంద్రశర్మ తను అచ్చమైన కవినని మరోసారి నిరూపించుకున్నారు.

---

* "నీరైపారిపోయింది": శేషేంద్రశర్మ. ప్రచురణ: ఇండియన్ లాంగ్వేజస్ ఫోరమ్, గోషామహల్, హైదరాబాద్–12

* **New Criticism studies the Symbolism of a poem as an ambiguous structure of interlocking motifs; it sees the poetic pattern of meaning as a self-contained 'texture' (Northrop Frye : Anatony of Criticism)**

# కలగూరగంప

## దశరథ భూదానము

వివిధ రామాయణ గ్రంథములలో బాలకాండమున వేర్వేరుగా నున్న భూదాన విషయమునుగూర్చి తెలుపుచుంటిని. దశరథుడు అశ్వమేధ యాగమును ముగించి తనకున్న రాజ్యమును దానము గావించెను. ఈ విషయమున వాల్మీకి రామాయణ మిట్లు చెప్పు చున్నది. బాలకాండ—14వ సర్గ. 43, 44 శ్లోకములు చూడుడు—

"ప్రాచీం హోత్రే దదౌ రాజా దిశం స్వకుల వర్ధనః ।
అధ్వర్యవే ప్రతీచీం తు బ్రహ్మణే దక్షిణాం దిశం ॥
ఉద్గాత్రే తు తథోఽదీచీం దక్షిణైషా వినిర్మితా ।
అశ్వమేధ మహాయజ్ఞే స్వయంభూా విహితే పురా ॥

హోతకు ప్రాచీ దిశను, అధ్వర్యునకు ప్రతీచియు, బ్రహ్మకు దక్షిణమును, ఉద్గాతకు నుదీచియు, (ఉత్తరము) నొసంగెను. ఇది స్వయంభువు పెట్టిన నియమము కాబట్టి దశరథుడట్లే దానము గావించెను. కల్పసూత్రము లీ విషయమును సమర్థించు చున్నవి. "ప్రతి దిశం దక్షిణాం దదాతి ప్రాచీ దిగ్ హోతుర్దక్షిణా బ్రాహ్మణః ప్రతీచ్యధ్వర్యోరుదీచ్యుద్గాతుః." భాస్కర రామాయణము—బాలకాండము—126వ పద్యములోనిదే విషయము గలదు.

"వన హోతకుం బ్రాగ్దేశం, బును బ్రహ్మకు దక్షిణంపుం బుడమియు నధ్వ, ర్యునకుం బశ్చిమదేశం, బును నుద్గాతకు నుదీచ్యభూమియు నిచ్చెన్"— దీనికి భిన్నముగా రంగనాథ రామాయణమున చెప్పబడినది. "అధ్వర దక్షిణకై పూర్వదేశ, మధ్వర్యు నకును బ్రహ్మకు దక్షిణంబు, పొసరంగ పశ్చిమ భూమి హోతకును, దనర నుత్తర భూమి నుద్గాతకు నిచ్చె."

ప్రాచీ దిక్కు హోతకును, ప్రతీచి దిక్కు అధ్వర్యునకు ఇచ్చినట్లు మూలములో నుండగా గోన బుద్ధ భూ విభుడు పూర్వదేశ మధ్వర్యునకు, పశ్చిమ భూమి హోతకు నిచ్చినట్లు మార్చి వ్రాసెను. ఈ మార్పునకు కారణమేమో, ఆధారమేమో బోధ పడదు. ఏకవింశతి (21) యూపములని చెప్పట, 300 జంతువులను, ఒక శ్రేష్ఠమగు అశ్వమును విశసించిరని చెప్పట— అన్నింటిలో సమానముగా నున్నది. భూమి దానము చేసిన దిశలను గూర్చి మాత్రమే బుద్ధభూవిభుడేల భిన్నముగా చెప్పెనో పండితులు పరిశోధించి, 'భారతి' ముఖమున వెల్లడింతురని ఆశింతును.

*శ్రీ వడిపినేని సూర్యనారాయణ*

## రావణుడేలిన లంక ఎక్కడున్నది ?

రామాయణ కాలమును గురించి వాదోపవాదాలు జరుగు తూనే వున్నాయి. రామాయణములో పేర్కొనబడిన స్థలాల గురించి బడిన లంకను గురించి భిన్నాభిప్రాయాలున్నవి. నర్మదా నదికి ఉత్తరంగా పశ్చిమ తీరమునకావల లంక వుండి యుండెనని ఒక అభిప్రాయము. అండమాన్, సుమత్రా, జావా, మొదలైన ద్వీప సముదాయాలలో ఒకటి రావణుడేలిన లంక కావచ్చునని కొందరు భావించారు. నేటి ఒరిస్సాలోని మహానది ముఖద్వారమునకు సమీపమున వుండినదని ఒక వాదము. కాని భారతదేశమునకు దక్షిణ దిశలో నున్న నేటి శ్రీలంకయే రామాయణములో పేర్కొనబడిన లంకా ద్వీపమని సామాన్యంగా భావింపబడుతున్నది. సింహళీయులు తమ దేశాన్ని లంకాద్వీపంగా భావిస్తున్నారు. ఈ వాదములలో ఒక్కటి కూడా వాల్మీకి రామాయణములోని లంకాద్వీపమునకు అనుగుణంగా లేదు. భారతదేశానికి దక్షిణంగా 100 యోజనాల దూరమున లంకా ద్వీపముండినట్లు స్పష్టమౌతున్నది. అందుకీ క్రింది శ్లోకం ఆధారము.

"పుత్రో విశ్రవసః సాక్షాత్ భ్రాతా వైశ్రవణ స్యచ
అధ్యాస్తే నగరీం లంకాం రావణో నామ రాక్షసః
ఇతో ద్వీపే సముద్రస్య సంపూర్ణే శత యోజనే
తస్మిన్ లంకాపురీ రమ్యానిర్మితా విశ్వ కర్మణా
సంప్రాప్య సాగర స్యాంతం సంపూర్ణ శత యోజనం
ఆసాద్య దక్షిణం తీరం తతో ద్రక్ష్యథ రావణం"

విశ్రవసువు పుత్రుడు, వైశ్రవణుని సోదరుడూ అయిన రావణుడను పేరుగలరాక్షసుడు లంకానగరములో నివసించుచున్నాడు. వంద యోజనముల దూరమునగల ద్వీపమున రమ్యమైన లంకా నగరము. విశ్వకర్మచే నిర్మింపబడినది. శత యోజన విస్తీర్ణమైన సముద్రాన్ని దాటిన తరువాత సాగరాంతము యొక్క దక్షిణ తీర మును చేరుకొన్న మీరు ఆ రావణుని చూడగలరు.

పై భావము మేరకు, భారత దేశమునకు దక్షిణంగా నూరు యోజనముల దూరమున సాగర మధ్యమున లంక వుండినట్లు విదిత మగుచున్నది. భారతదేశమునకు దక్షిణములో లంకా ద్వీపము తప్ప మరే ద్వీపము లేదు. శ్రీలంకను రావణ ద్వీపమన్నప్పటికీ మరికొన్ని కారణాలను పురస్కరించుకొని శ్రీలంక రావణలంక కానేరదని చెప్ప వచ్చు. భారతదేశ దక్షిణ తీరమునకు నూరు యోజనముల దూర మున లంకా ద్వీపముండినట్లు సేతుబంధ కావ్యము కూడ తెల్పు చున్నది. నలుడనే వాస్తు శాస్త్రజ్ఞుడు సేతువును నిర్మింపగ వానర సైన్యము దానిపై లంకను చేరినట్లు రామాయణములో వర్ణింపబడినది. మొదటి దినమున 14 యోజనాలు, రెండవదిన మున 20యోజనాలు, మూడవ రోజున 21 యోజనాలు, నాల్గవ రోజున 22 యోజనాలు, ఐదవ దినమున 23 యోజనాల నిర్మాణము పూర్తియై శత యోజనాల నిర్మాణము అయిదు రోజులలో పూర్తియైనట్లు వాల్మీకి వర్ణించినాడు. నారదుడు వాల్మీకి

"తతో గృధ్రస్య వచనాత్ సంపాతేర్హనుమాన్ బలీ
శత యోజన విస్తీర్ణం పుప్లువే లవణార్ణవమ్"

సంపాతియను గ్రద్ద యొక్క మాటలను బట్టి బలవంతుడైన హనుమంతుడు శత యోజన విస్తీర్ణమైన లవణ సముద్రాన్ని ఎగిరినాడు అని చెప్పినాడు. ఈ రీతిగ వాల్మీకి రామాయణములో పలుచోట్ల లంక నూరు యోజనాల దూరమున నున్నట్లు స్పష్టమవుతున్నది. 'యోజనము' నేటి ప్రమాణమునకు 5¼ లేదా 6 మైళ్ళ దూరమని భావింపబడింది. యోజనమనగా నాలుగు క్రోసులు. క్రోసు ఒకటిన్నర మైలు దూరము. రావణలంక భారతదేశము నుండి దాదాపు 600 మైళ్ళ దూరమున వుండినట్లు భావింపవచ్చును. జ్యోతిశ్శాస్త్ర గ్రంథములలో లంక 'నిరక్ష దేశము' అనగా భూమధ్య రేఖ పోవు ప్రదేశముగా పేర్కొనబడింది. భారత దేశానికి దక్షిణంగా సుమారు 6 వందల మైళ్ళలో భూమధ్యరేఖ వున్నది. ఆ రీతి చూచిన లంకా ద్వీపము మన దేశమునకు దక్షిణముగా 600 మైళ్ళ దూరమున వుండవలెను. ఇప్పటి శ్రీలంక భూమధ్య రేఖకు 5.56 డిగ్రీల ఉత్తరమున వున్నది. మన దేశ తీరానికి ముప్పది మైళ్ళ దూరములో వున్నది. వీటిని బట్టి సింహళము రావణుడేలిన లంకా ద్వీపము కాదని చెప్పవచ్చును.

వాల్మీకి మహర్షికి కాని, రామాయణ మందలి కొన్ని పాత్రలకు కాని దక్షిణ భారతదేశమును గురించి పూర్తిగా తెలియదని కొందరి అభిప్రాయము. హిమాలయ పర్వతముల మొదలు వింధ్యాద్రి వరకు మైదానము. వింధ్యపర్వతములనుండి దక్షిణమున కొంత భాగము వరకు మాత్రమే భూభాగముండినదని కొందరి అభిప్రాయము. ఈ వాదము సహేతుకమైనదికాదు. వాల్మీకి మహర్షి భౌగోళిక విజ్ఞానము విస్తృతమైనదని రామాయణ మందలి క్రింది శ్లోకములు స్పష్టం చేస్తున్నవి.

"విదర్భాన్ ఋషికాన్ శ్చైవ రమ్యాన్ మాహిష కానపి
కథా వంగాన్ కళింగాశ్చ కౌశికాంశ్చ సమం తతః
తదైవాంధ్రాంశ్చ, పుండ్రాంశ్చ చోళ పాండ్యాన్ హ కేరలాన్
త తస్తాయా పగాం దివ్యాం ప్రసన్న సలిలాం శివాం
తత్రద్రక్ష్యథ కావేరీం, విహితామప్సరో గణైః"

విదర్భ, ఋషిక, రమ్యమైన మాహిష్మక, వంగ, కళింగ, కౌశిక, ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య మరియు కేరళ మొదలగు దేశాలను అప్సర స్త్రీ గణములతో కూడిన స్వచ్ఛమైన నీటిలో నుండిన కావేరీ నదిని చూడగలరు. వీటిలో ఏ ఒకటి రెండు తప్ప మిగతావన్నీ దక్షిణ భారతదేశానికి చెందినవి. "తతస్తే నాభ్యను జ్ఞాతాః ప్రసన్నేన్న మహాత్మనా తామ్రపర్ణీం గ్రాహ జుష్టాం, తరిష్యథ మహానదీమ్."

'ప్రసన్న చిత్తుడూ, మహాత్ముడూ అయిన అగస్త్యమహర్షి అనుమతి పొందిన తర్వాత మొసళ్ళతో కూడుకొన్న తామ్రపర్ణి మహానదిని దాటెదరు.' దక్షిణ భారత దేశమందలి పెక్కు నదులను, దేశాలను వర్ణించిన వాల్మీకి మహర్షి పాండ్య రాజధానియైన కవాట నగరమును క్రింది విధంగా వర్ణించినాడు—

'తతోహేమమయం దివ్యం ముక్తామణి విభూషితం
యుక్త కవాటం పాండ్యానాం గత్వాద్రక్ష్యథ వానరాః'

ఆ తరువాత కనకమయమైన, ముత్యాలతోను, రత్నాలతోను భూషితమైన పాండ్య రాజుల కవాటపురమును చూడగలరు. దక్షిణ భారతదేశమును గురించిన భౌగోళిక విజ్ఞానము వాల్మీకి మహర్షికి అవగతమై యుండినది. అతడు చైన, పరమచైన, యవన దేశములను కూడా వర్ణించినాడు.

రావణలంక భారతదేశానికి దక్షిణంగా సముద్ర మధ్యమున వుండినదన్న అంశమును పై శ్లోకాలు స్పష్టం చేస్తున్నవి. ఆంజనేయుని సముద్రోల్లంఘనం ఈ విషయాన్ని ధృవ పరుస్తున్నది. నూరు యోజనముల సముద్రాన్ని దాటుటకుముందు మారుతి యిట్లన్నాడు:

"నేయం మమ మహీవేగం, లంఘనే ధార యిష్యతి
ఏతానిహ నగస్యాస్య శిలాసంకట శాలినః
శిఖరాణి మహేంద్రస్య స్థిరాణి చ మహాంతి చ
ఏషు వేగం కరిష్యామి మహేంద్ర శిఖరే ష్వహాం"

ఈ భూ ప్రదేశం నా లంఘన వేగానికి తగినది కాదు. పెద్ద శిలా ఖండాలతో కూడుకొన్న మహత్తరమైన మహేంద్ర పర్వతాన్ని అధిరోహించి అటునుండి లంకకు గంతువేస్తాను. సముద్ర తీర మందలి ఇసుకనేలపై నుండి నూరు యోజనముల సముద్రాన్ని దూకటం వీలుకాదని భావించి హనుమంతుడు మహేంద్ర పర్వతాన్ని అధిరోహించవలసి వచ్చింది. మహేంద్ర పర్వతము సప్తకుల పర్వతాలలో ఒకటి. త్రిభాగ ఋషికుల్య, ఇక్షుదా, అచలా, త్రిదివా మూలీ, శరవా, విమలా మరియు తామ్రపర్ణి అను నదులు ఆ పర్వతాలలో ఉద్భవించి ప్రవహిస్తున్నవి. తామ్రపర్ణి నది తిరునల్వేలి జిల్లాలో నేటికీ ప్రవహిస్తూనే వుంది. దీనిని బట్టి చూడగా మహేంద్ర పర్వతము భారత దక్షిణ భాగమున సముద్ర తీరమునకు చేరువగా వుండినదని చెప్పవచ్చును. మహేంద్ర పర్వత శిఖరము నుండి లంఘించి దక్షిణంగా వందయోజనముల దూరమున సముద్రము మధ్య నున్న ద్వీపమే రావణుడేలిన లంక.

కాని హిందూమహాసముద్రములో పై పేర్కొన్న లంకా ద్వీపము నేడు లేదు. ప్రకృతి వైపరీత్యాలు వివిధంగా వుంటాయి. కొన్ని భూభాగాలు సముద్రములో మునిగిపోవటం, మరికొన్ని కొత్తగా తలయెత్తటం జరుగుతున్నది. క్రీ. 1872లో సుమత్రా, జావా ద్వీప సముదాయాలకు చెందిన జనాకీర్ణమైన 'క్రాకాటోవా' అన్న ద్వీపము మునిగి పోయినట్లు చరిత్ర చాటుతున్నది. ఆర్కిటిక్ మహా సముద్రాన్ని, పసిఫిక్ మహా సముద్రాన్ని కలుపునట్టి బేరింగ్ జల సంధి ప్రాచీన కాలంలో లేదు. పరశురామ సృష్టి యనబడు భారత దేశ పశ్చిమ తీరము కొన్ని లక్షల సంవత్సరాల క్రితం సముద్ర గర్భములో వుండినట్లు భూగర్భ శాస్త్రజ్ఞులు స్పష్టం చేసియున్నారు. కృష్ణుని ద్వారకా నగరము సముద్రములో మునిగిపోయినట్లు మన పురాణాలు పేర్కొంటున్నవి. అట్లే రావణుడేలిన లంకా ద్వీపము

కూడా సముద్రములో మునిగియుండునని భావింపవచ్చును. భారత దేశమునకు దక్షిణముగా హిందూ మహా సాగరములో 'తమిళరవ్' అన్న ద్వీపముండినట్లు, అక్కడ నుండి తమిళులు ఉత్తరదిక్కుకు వలస వచ్చినట్లు కాలక్రమంలో ఆ ద్వీపము మునిగి పోయినట్లు ప్రాచీన తమిళ గ్రంథములు పేర్కొంటున్నవని తమిళ విద్వాంసుల అభిప్రాయము. భారతదేశమునకు దక్షిణముగా 'తిమూరియా' అను భూఖండము వుండినట్లు, కాలాంతరంలో అది మునిగి పోయినట్లు చారిత్రకుల అభిప్రాయము. 'తిమోరియా'యే రావణుడేలిన లంక కావచ్చును.

— *శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి*

## "నా తెలంగాణ కోటిరత్నాల వీణ"- కవిత్వ తత్త్వం

1977 మార్చి 'భారతి'లో శ్రీ శంకరగంటి రంగాచార్యులు గారు "నా తెలంగాణ కోటి రత్నాల వీణ" అనే తమ వ్యాసంలో, ఆ విషయం పైననే నేను వ్రాసినదాన్ని విమర్శించినారు. దీనికి పూర్వ భూమిక ఇది :

1976 ఆగస్టు 'భారతి'లో శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం గారు, "సాహిత్యంలో సృజన" అనే సిద్ధాంత వ్యాసంలో దాశరథి కావ్యవాక్యం "నా తెలంగాణ కోటి రత్నాల వీణ" లో సృజన అనే అంశం ఉదన్నారు. అదెట్లో వారి మాటల్లోనే తెల్పుతాను: ఈ వాక్యానికి మామూలు అర్థం ఏమీ లేదు. మామూలు మాటల అర్థాలను సమన్వయించుకొని చూస్తే ఏమీ బోధపడదు. తెలంగాణ అనగనే ప్రజలనీ, కోటి రత్నాలు అనగనే కోటి రత్నాల వంటి మనుషులనీ, వీణ అనగనే వారు స్వేచ్ఛకోసం ఎలుగెత్తిన కంఠ శ్రుతి అనీ బోధ పరుచుకున్నప్పుడు ఆ వాక్యంలో సృజనాత్మక శక్తి మనల్ని తాకుతుంది అని గ్రంథగ్రంథిని విడమర్చి చెప్పారు శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు.

నవంబరు 1976 'భారతి'లో నేను "సాహిత్యంలో సృజన, ఒక చర్చ" అనే వ్యాసంలో "నా తెలంగాణ కోటి రత్నాలవీణ"లో మామూలు అర్థం లేకేమి? స్పష్టంగానే ఉంది అన్నాను. ఈ నా "తప్పిదమే" శ్రీ రంగాచార్యుల ప్రస్తుత వ్యాసానికి మూలం.

నీకేమి అర్థమయింది? ఆ అర్థమేమిటో విప్పి చెప్ప చూద్దాం అని శ్రీ రంగాచార్యులు అడుగుచున్నారు.

అయ్యా సృజన సంగతి నా కేమీ తెలియదు. దాశరథి వాక్యంలో అర్థం స్పష్టంగానే ఉంది. తెలంగాణ తనదనుకొనే ఒక కవి అది కోటి రత్నాలవీణ వంటిది అనుచున్నాడు అని అర్థ మయింది అని నేను మనవి చేసితిని. వాక్యంలో రెండు అలంకారాలు కూడా కలవన్నాను. అవి ఉపమ, అతిశయోక్తి. తెలంగాణ వీణతో పోల్చబడ్డది. అది ఉపమానాలంకారమంటే, శ్రీ రంగాచార్యులు ఇందులో ఉపమావాచకం లేనందువల్ల, ఇది రూపకాలంకారము కాని ఉపమకాదన్నారు. ఒక వస్తు వింకొక వస్తువుతో పోల్చబడుట, ఉపమ లేక రూపకములతో కావచ్చును. ఒకటి ఉపమించుట, ఇంకొకటి రూపించుట. ఒకటి **Tweedledum.** ఇంకొకటి **Tweedledee.** ఉపమ కాదనీ, రూపకమనీ అంటే సృజన ఉంటుందా? మనకున్న ఉత్తమోత్తమ లౌకిక కవి ఉపమకే ప్రసిద్ధి కాని, రూపకాలంకారానికి ఆ గౌరవంలేదే? అతిశయోక్తి అసలుకు లేదు అని శ్రీ రంగాచార్యులు నిర్ధారించి చెప్పినారు. అతిశయోక్తి వేఱు. అతిశయోక్త్యలంకారం వేఱు. అతిశయోక్తి అంటే అదొక వాచక లోపం అనుకోవచ్చుగాని, అన్ని అలంకారాలకు తల్లివంటి దైన అతిశయోక్త్యలంకారం ఉందంటే సృజనావాదులంత జడుసుకుంటారెందుకూ? ఇక అతిశయోక్త్యలంకారం ఎచ్చటుంది అంటారా? 'కోటి రత్నాల వీణ'లో ఉంది. కోటి రత్నాలెచ్చటయినా ఒకేచోట ఉంటాయా? అందులో వీణలో! మ. ఘ. వ. నిజాం గారి ఖజానాలో ఉన్నాయంటే ఒప్పుకోవచ్చును. వీణలో ఉన్నాయంటే ఎట్లు ఒప్పుకొనేది? "నవ్రస్థలీ చుంబితాంబరమ్మై" ని ఎట్లు ఒప్పుకొన్నామో "కోటి రత్నాల వీణ"ను అట్లు ఒప్పుకొన్నాము. ఇదీ అదీ అతిశయోక్త్యలంకారాలే కదా?

శ్రీ రంగాచార్యులుగారు పాశ్చాత్య సంప్రదాయపు "ప్రతీక" పరిభాషను సాగించిరి. రత్నము మనిషికీ, తెలంగాణకు వీణ ప్రతీక అని వారి వాదం. ప్రాతినిధ్యం **(Representation)** కూ, ప్రతీక **(Symbolism)** కూ గల సున్నితభేదం శ్రీ రంగాచార్యులు గుర్తించలేదు. ఇచట ఉండేది ప్రాతినిధ్యమేకాని ప్రతీక కాదు. ప్రతీకే అయితే, కోటిమంది తెలంగాణీయులకు కోటి రత్నాలెందు కుండవలె. ఒక రత్నముంటే చాలదా? ఒక్కొక్కరికి ఒక్కరత్నం ఉండడం ప్రాతినిధ్యమవుతుంది. ఎంతమందికైనా ఒక్కటో అర్ధమో రత్నముండడం ప్రతీక అవుతుంది. "జటా కటాహ సంభ్రమ భ్రమన్నిలింప నిర్ఝరీ" అనే తాండవమాడిన లయకాల రుద్రునికి చిదంబరంలోని నటరాజమూర్తి ప్రతీకకాదు. ఆ దేవాలయం ప్రక్కనే పాడుపడియున్న చిన్న కోవెలలోని నల్లరాతి లింగం ప్రతీక అవుతుంది. ప్రతీక తత్త్వంలో ఇంకొక ముఖ్యాంశ ఏమంటే, మూలానికేది ప్రతీకయో, ఆ ప్రతీకకూడ మూలం యొక్క గౌరవాన్ని కల్గి ఉంటుంది. రావణ దర్బారులో రావణుని ఎదుట నిలబడ్డ హనుమంతుడు, నందీశ్వరుని ప్రతీకగా కనిపించి నాడు కాన భయావహుడైనాడు, రాముని ప్రతినిధిగా ఉన్నాడు కాన తిరస్కరణీయుడైనాడు.

"నా తెలంగాణ కోటి రత్నాల వీణ" అనే వాక్యం "ఆమె ముఖం చంద్రబింబం" వంటిదే. ఇందులో ప్రతీక ప్రసక్తి ఎచ్చటుంది? మామూలు మాటల అర్థాలను సమన్వయించుకొని చూస్తే ఏమీ బోధపడదు. తెలంగాణ అనగనే ప్రజలని బోధ పరుచుకొన్నప్పుడే సృజనాత్మక శక్తి మనల్ని తాకుతుంది అని ఆర్. ఎస్. గారు మూల వ్యాసంలో క్లిష్టంగా చెప్పినారు తెలంగాణ అంటే తెలంగాణఅనే ప్రాంతం అనో అందరి మనుషులనో, అర్థంకాక వేఱే అర్థం వచ్చే అ

కాశం ఉండదా? "భారత దేశం" అంటే భారతీయులని అర్థం చేసికొనుటకు సృజన శక్తి కావలెనా? పాఠకులంత బడుద్ధాయి లుందురా? తెలంగాణ అంటే అందరి ప్రజలకు ప్రతీక కాదు. తెలంగాణ అంటే అందరి ప్రజలే. దీన్నిబట్టి పద్యంలోని రెండు ప్రతీక స్థానాలలో ఒక్కటి భ్రంశం పొందింది. మిగిలింది "కోటి రత్నాలవీణ". దీంతో తెలంగాణ పోల్చబడ్డది, శ్రీ రంగాచార్యులు చెప్పినట్లు రూపకాలంకారంలో! రూపకాలంకారం ఉండడం మహాసృజన అవుతుందా? "నా తెలంగాణ కోటి రత్నాల వీణ" లో మరికొన్ని అసమంజస్యాలు లేకపోలేదు.

ఇందు శబ్దానుప్రాస (గాణ...వీణ) ఉంది. శబ్దానుప్రాస ఉత్తమ కవిత్వ లక్షణం కాదు.

అనుప్రాస ఆణ...ఈణ అని ఉంది. అచ్చులు మారినై. ఇది సౌష్ఠవ పద్ధతి కాదు. "నా తెలంగాణ కోటి రత్నాల వాణ" అని అయినా ఉంటే బాగు. వేదంలో వీణకు వాణ అని ఉంది. కోటి రత్నాల వీణ అంటే ఏమి? కోటి రత్నాలు పొదుగబడ్డ వీణ అనా? కోటిరత్నాల వెలచేసే వీణ అనా? ఆ వీణలో కోటి రత్నాలూ ఉండవలె లేకుంటే కోటిమంది మనుషులుండే తెలంగాణాకది ప్రతీక కాజాలదు. వీణయొక్క గొప్పతనం దాని నిర్మాణం బట్టి, తంతుల సంఖ్యబట్టి, మెట్ల విన్నాణం బట్టి ఉంటుంది కాని దాని కతికించబడిన రాళ్ళ(అవి ఎంత ఖరీదైనవూ) పై ఆధారపడి ఉంటుందా? ఎన్నో వీణ లున్నాయి. మహతి, బృహతి, సరస్వతి, రావణ, విచిత్ర, రుద్ర వీణలు యాభైవరకూ ఉన్నాయి. ఇవన్నీ తంతులు, మెట్లు మున్నగు వైణికాంశాలపై ఆధారపడి తమ వైశిష్ట్యం సంతరించుకొన్నాయి. రత్నాలవీణ స్మగ్లర్లకూ, రత్నాల వర్తకులకూ అమ్ముడు సరుకగునేమో కాని సంగీత ప్రియుల కారాధ్యవస్తువు కాజాలదు.

తెలంగాణ సజీవ చైతన్యవంత పదార్థం. వీణ నిర్జీవ జడ పదార్థం. మొదటిదాన్ని రెండో దానితో రూపించడం హీనోపమ అవుతుంది. తెలంగాణలో స్వేచ్ఛాగానం చేసేది కోటిమంది. వీణలోని కోటిరత్నాలు మేళగించలేవుకదా! మేళగించేవి తంత్రులే. దీన్నిబట్టికూడ తెలంగాణాకూ, కోటిరత్నాల వీణకు ఒద్దిక కుదుర లేదన్నది స్పష్టం.

1977 'భారతి'లో శ్రీ జి. సత్యనారాయణమూర్తిగారు సృజనా సిద్ధాంతాన్ని బలపరుస్తూ ఇట్లన్నారు :

"ఇది కేవలం ఉపమకాదు. ఉపమలో ప్రత్యక్షంగా గుర్తింపదగిన లక్షణాలు రెండింటా ఉంటాయి. తెలంగాణాకూ రత్నాల వీణకూ అటువంటివేవీలేవు." వీరి సమర్థన మూలసిద్ధాంతకారులు ఆర్. ఎస్. గారి వ్యాఖ్యానానికి విరుద్ధంగా ఉంది. వారి వ్యాఖ్యానంలో వీణ మేళగింపుకు, తెలంగాణీయుల స్వేచ్ఛా గాన శ్రుతికి లంకె ఉంది. ఇవ్విధంగా వీరిలో వీరికే అభిప్రాయభేదాలున్నాయి. వానిని సమన్వయపరుచుకొండని మనవి చేస్తున్నాను.

ఇంతకూ "నా తెలంగాణ..."లో ఉదాత్త భావం మృగ్యం. దీనిని శ్రీ రంగాచార్యులుగారు "వందే మాతరం"తో పోల్చినారు.

''వందేమాతరం'' కానీ, ''జనగణమన'' కానీ, ''సారే జహాఁసే అచ్ఛా హిందూస్తాన్ హమారా'' కానీ "Star Spangled Banner" కానీ, ఏదైనా ఒక ప్రాంతపు పొగడ్తే కదా! విశ్వమానవతను పెంపొందించే రచనలే గొప్పవికాని ప్రాంతీయాభిమానాలు రెచ్చగొట్టే రచనలు గొప్పవికావు. ఇదీ ''నా తెలంగాణ కోటి రత్నాలవీణ''లోని సృజనా విలసనం!

నేను ''ఫలానా సంఘ పరిస్థితులుండే కారణంవల్లనే మహాకావ్యం రాదు. మహాకవి ఉండినందువల్లనే మహాకావ్యం వస్తుంది'' అంటే, దానికి శ్రీ రంగాచార్యులు కవీ, సమాజం రెండూ కారణాలే అంటారు. కాదన్న మాదన్న ఎవడు? ఈ అర్థచ్ఛాయ నా వాక్యంలోనే కలదు. ఏతావతా నేను కవివైపు మొగ్గాను. పరిస్థితులేవో ఉండనే ఉంటాయి. వానిమీదంతా కవిత్వం వస్తుందా? పరిస్థితులు లేకున్నా కవి ఊహించి వ్రాయగలడు. 'సర్ థామస్ మోర్' ఎప్పుడో రాబోయే 'Welfare State'ను తన Utopiaలో వర్ణించినాడు. తర్వాత నాజీలు అనుసరించే 'Concentration Camp' విధానాలను Franz Kafka తన రచనల్లో రుచి చూపించినాడు. కవి లేకుంటే ఎన్ని పరిస్థితులుంటేమాత్రం ఏం లాభం? కిరాతకుడు ఒక పక్షిని కొట్టేటటువంటి పరిస్థితు లెన్నిచూడం? అయినా రామాయణంవంటి కావ్యం మళ్ళావచ్చిందా? తూర్పు చాళుక్యులు రాజనరేంద్రునకు కొన్నివందల ఏండ్లపూర్వంనుంచి పరిపాలిస్తున్నా మహాభారతం అప్పుడుకాక నన్నయకాలంలో ఎందుకు వచ్చింది? నన్నయ ఉన్నాడు కనుక వచ్చింది. సమాజమేలేని శూన్యంలో కూర్చుండి, కవి ఎవరికోసం తన కావ్యం వ్రాస్తాడని శ్రీ రంగాచార్యులుగారు సవాలు చేస్తున్నారు. దీనికి రెండు సమాధానాలిస్తున్నాను. ఒకటి—కవి తనకోసమే కవిత్వం చెబుతాడు. వారంతకుముందే ఉదాహరించిన ''మానిషాద'' శ్లోకం వాల్మీకి సమాజంలో కూర్చుండి సమాజంకోసం వ్రాసినాడా? రెండు--సమాజంలో కవిత్వం చెప్పడం వేఱు, సమాజంకోసం కవిత్వం చెప్పడంవేఱు. తనకోసమే చెప్పుకొన్న కవిత్వాన్ని సమాజపరంగా చెప్పి లోకానుద్ధరించమంటాడు వాల్మీకిని నారదుడు!

కవిత్వంలో మనకు అందకుండా పోయే ఏదోకిటుకుందబ్బా అని నేనంటే, శ్రీ రంగాచార్యులువారు ఇట్లంటారు: ''కవిత్వంలో ప్రత్యక్షమయ్యే భావ స్ఫోరకమైన శబ్దాల రసాయనిక సంయోగమే విమర్శకులనూ, కవులనూ ఆను నిత్యంతికం పెడుతూన్న అనిర్వచనీయమైన, అస్పష్టమైన, అనుంబితమైన అందం. అదే బ్రహ్మపదార్థమునకు సబ్రహ్మచారి.'' కవిత్వం గురించి ఏమి చెప్పినట్లయినది! వీరి వివరణ చదివితే **Net** అనే దానికి సామ్యూలు జాన్సను నిర్వచనం నెప్పనకు వస్తుంది. ఆ నిర్వచనం ఇది: **A net is a reticulated texture decussated at regular intervals with interstices between intersctions.**

''శ్రీ తిరుమలరావుగారు కూడా తక్కువరకపు విమర్శకులు కారు కదా. వారుకూడా తీవ్రంగా, గాఢంగా శ్రీ సుదర్శనంగారి కంటె ఎక్కువగా అన్వేషణచేసి త్వరలోనే ఆ కిటుకు కనుగొంటారని ఆశిస్తాను'' అని శ్రీ రంగాచార్యు లన్నారంటే అది వారికి నాపైగల వాత్సల్యానికీ, వారి హృదయ వైశాల్యానికీ గీటురాయే కాని నా కంత యోగ్యత లేదు. అయినా ఒకటి చెప్తున్నాను. ''ఇదేదో చిక్కకుండా పోతూ ఉందే'' అనే వాడు, ''సాహిత్యంలోని ముఖ్య మర్మం మూడుపంక్తుల సిద్ధాంతంలో ఇమిడ్చినాను'' అనే సైద్ధాంతికుని కంటె ఎక్కువగానే గవేషణ చేస్తూంటాడని మనవి చేస్తూన్నాను. కవిత్వాన్ని, అది కాని దాన్ని తెచ్చి యిస్తే కవిత్వాన్ని గుర్తు పట్టగలను. కవిత్వం ఎట్లుంటుంది అని మాత్రం చెప్పగలను. వాల్మీకిలో, తిక్కనలో, నెరూడాలో, రైలుపెట్టెలోని ''ముగ్గురు బిచ్చగాళ్ళ'' పాటలో, చీమను చంపినందువలన జతమానినానన్న మూడేండ్లబాలిక కోపంలో కవిత్వం చూచినాను. కవిత్వంలోని **that precarious element that intangible something** ప్రతీయమానం పునరన్యదేవలను పసి గట్టలేక పోతూన్నాను. హరివిల్లు ఎట్లుంటుందో నాకు తెలుసు. పట్టుకోబోతే దొరుకదు. కీట్సు **Ode to a Nightingale** ఎట్లు వ్రాసినాడో నాకు తెలుసు. **Ode to Nightingale** వంటి కవిత్వం ఎట్లా వ్రాయవలెనో తెలియదు. కవిత్వం మేటరులింకు నాటకం **Blue bird** లోని ''నీల విహంగం'' వంటిది. అది చిక్కదు. అది చిక్కదు. ఆ నాటకం చివరలో టిల్ టిల్ అనే పసిబాలుని పాత్ర పల్కిన భరత వాక్యంతో ముగిస్తాను.

> "Tyltyl : (Stepping to the front of the stage and addressing the audience)—
> If any one of you should find him (Blue Bird), would you be so kind as to give him back to us?..."

నా అభ్యర్థనా అదే.

*శ్రీ సర్దేశాయి తిరుమలరావు*

# లేఖ

మా పెద్దహరివాణం గ్రామంలో ఒక పెద్ద శిలాశాసనమున్నది. దానిని గూర్చి తెలుసుకోవలెనన్న జిజ్ఞాస నాకున్నది. చరిత్ర పరిశోధక విద్యార్థు లెవరైనా మా గ్రామమునకొచ్చి దానిని పరిశీలించిన యెడల వారికుపయుక్తమగు సమాచారము దొరకవచ్చును. అట్టి వారి కుచితమగు రీతిని సహాయపడుటకు యువజన సంఘముకూడ ఉన్నది. ఉత్సాహవంతులైన పరిశోధకులు క్రింది చిరునామాతో సంప్రదింపులు జరుపవచ్చును.

హెచ్. హరిశ్చంద్రారెడ్డి,
తండ్రి. హెచ్. రంగన గౌడు,
పెద్దహరివాణం పోస్ట్,
ఆదోని తాలూకా, కర్నూలు జిల్లా.

# గ్రంథ విమర్శలు

## గొరిల్లా

[ కవిత : రచన: గుంటూరు శేషేంద్రశర్మ. పేజీలు 113 వెల : రు.4—50; ప్రచురణ : ది యిండియన్ లాంగ్వేజెస్ ఫోరం. పాన్ మండి, హైదరాబాద్—500012; ప్రతులకు : ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, 3237, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్; విశాలాంధ్ర బుక్‌హౌస్, విజయవాడ: సి. ఎల్. ఎస్. 113, బుక్ షాప్, నాంపల్లి స్టేషన్ రోడ్, హైదరాబాద్ ]

'మండే సూర్యుడు' కవితా సంపుటిలో పదాలను పూలలా పాఠకుల హృదయాలపైకి విసిరేయడంలో ఓ విశిష్టతను సంతరించుకుని కొత్తతరహా కవిత్వాన్ని రాయడానికి అలవాటుపడ్డ శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ యిప్పుడు ఆ శైలినే యింకాస్త సాంద్రతరం చేసి "గొరిల్లా" పేరుతో వెలువరించారు.

ఐతే "మండే సూర్యుడు" లో సమస్య ఉంది. పరిష్కారం స్పష్టంగా లేదు. కాని 'గొరిల్లా'లో శ్రీ శర్మగారు సమస్యకు నిష్కర్షగా పరిష్కారాన్ని సూచించారు. యిది హర్షనీయం. శ్లాఘనీయం కూడా.

రామాయణంలోని కిష్కింధాకాండ, సర్గ 18, శ్లోకం 32—62, ను ఉటంకిస్తూ— Human Justice revolves on the fulcrum of pure voilence whose scientific character is the creative power—అని తన యీ గ్రంథానికి ఊపిరియైన మూల సిద్ధాంతాన్ని కవి తన ముందు మాటలో మనవి చేసుకున్నారు.

వేల సంవత్సరాల శాస్త్రీయ పరిణామం తర్వాత పశుత్వం నుండి మానవత్వాన్ని పొందిన మనిషిని అసలైన మానవ న్యాయం కోసం, నవసృష్టి చేయగల అపూర్వ శక్తికోసం స్వచ్ఛమైన హింసా ప్రధానవృత్తిగల గొరిల్లాను ఆవాహన చేయమంటున్నారు శ్రీ శర్మగారు. యీ ప్రాథమిక ఆశయంతో తన కవిత్వం కేవలం "మనిషి డిఫెన్స్" కోసమే అనికూడా సూటిగా చెప్పుకున్నారు.

యిక పుస్తకంలోకి వస్తే—

"A good poem may enable us to be more articulate, to perceive more clearly, and to distinguish more readily between sensitive and sentimental observation than before. But a poem may do more than that : even though we may not accept the poet's explicit doctrine, it may change the configuration of the mind and later our responses to certain situations — " అంటాడు Michael Roberts తను సంపాదకత్వం వహించిన 'The faber book of modern verse' (P. 5) లో

యీ దృక్కోణంలో పాఠకునిపై అనిర్వచనీయమైన రసానుభూతులను చిలకరించి ప్రభావితం చేసే మంచి కవిత్వపు లక్షణాలు యీ పుస్తకంలో కోకొల్లలుగా ఉన్నాయి.

అతి సున్నితమైన భావాలలోని సౌందర్యం చెడకుండా అందమైన పదాలను పొందుపరిచి ఎన్నోచోట్ల బహు రంజకంగా అందీయబడింది.

ఉదా :— "దేవత లొస్తుంటారు దేవతలు పోతుంటారు ఆకాశంలో; మనకందే దేవత మాత్రం మన చేతుల్లో ఉన్న నాగలి మన కండరాల్లో నిదురించే గొరిల్లా నీకు తెలుసా ! వ్యవసాయ కూలీల ఆకాశం వర్షాలే కురుస్తుందిగాని వసంతాలు కురవదు— (పద్యం 2—పే. 4)"

"నలుదిక్కుల్నించీ ముసురుకొస్తున్న నూతన వాయువులు నా శరీర రంధ్రాలన్నిటిలోకీ దూరి నా ఎముకలన్నీ పిల్లన గ్రోవులై నా నరాలన్నీ సితారులై (నరాలు తంత్రులవుతాయి, సితారులు కావు) పాటలగోల రేపుతున్నాయ్ నా కన్నుల్లో కనిపిస్తున్నాయి భావితరాలు ప్రభాతం రాల్చిన కిరణాల గింజలు ముక్కుతో పొడుచుకు తింటున్న కోడిపుంజుల కుటుంబాల్లా —" (పద్యం 7. పే—22)

"ఒరే ఏం చేస్తున్నారో తెలుసుకోండి: రైతుల్లారా రాజకీయవర్షం పడుతోంది మోసపోయి మీ విత్తనాలు చల్లకండి" (పద్యం 15. పే—56)

యిలాంటివి ఎన్నో.

కవి చెప్పదలుచుకున్నదాన్నంతా మార్మిక ధ్వనిగా (Mystic sound) అన్యాపదేశంగా (Symbolic) చెప్పడం జరిగింది. యీ రకమైన పదసంకేతాలు చాలాచోట్ల భావానికి పుష్టినిచ్చి సొగసును చిందించాయి.

ఉదా : "సముద్రం ఒకని కాళ్ళ దగ్గర కూర్చుని మొరగదు
తుఫాను గొంతు చిత్తం అనడం ఎరగదు
పర్వతం ఎవరికీ వంగి సలాం చేయదు
నేనింతా ఒక పిడికెడు మట్టినే కావచ్చు—కాని కలమెత్తితే నాకు ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది"— (పే. 4)

"ఓడ ఏం చెపుతుంది సముద్రపులోతు గురించీ, దాని కెరటాల గుణగణాల్ని గురించీ. తీరానికి కొట్టుకొచ్చిన శిథిలనౌక చెపుతుంది అసలు కథ"—(పే. 14)

"ఈ దేశపు వీధుల్లో భీరువులు నడవలేరు గుండె ఛాతీలో నుండి దూకి ఎక్కడ పారిపోతుందో అని భయపడుతూ ఎలా నడుస్తావు"—(పే. 34)

"యిక్కడ భూగోళాన్ని లేత మెడలతో మోస్తున్న పిల్లలు తరుగుతుంటారు"—(పే. 30)

శ్రీ శర్మగారి కవితాధారలో ఓ అంతర్లీనమైన రసస్పర్శ, ప్రేరణ, తనవెంట పఠితను లాక్కుపోయే ప్రశాంత గమన శీలతా ఉన్నాయి. పాఠకుడు తప్పకుండా ఓ మధురానుభూతిని పొంది ఆలోచనా సముద్రంలో మునిగిపోతాడు యీ కావ్యాన్ని చదువుతున్నపుడు. ఉత్తమమైన కవితకు యింతకంటే మించిన లక్షణాలు అవసరం లేదు.

ఐతే—

చందస్సు సంకెళ్ళను తెంచుకుని వచన కవిత ఆవిర్భవించడానికి మూలకారణం రచనాసారాన్ని పాఠకునికి సులభగ్రాహ్యం చేయడం కోసమనే విషయాన్ని విజ్ఞులు ఒప్పుకుంటారనుకుంటాను. కవి తన భావాన్ని సూటిగా పఠిత మనసులోకి ప్రవేశపెట్టగల సౌకర్యం వచన కవిత ద్వారా సాధించబడింది. అందుకే వచన కవిత బహుముఖంగా ఆదరణ పొంది ఓ అపూర్వ సాహిత్య ప్రక్రియగా పాతుకుపోయింది. ఐతే యీ పద్ధతి ద్వారా పాఠకునికి సంక్రమించిన పఠనాపరమైన సౌలభ్యం 'గొరిల్లా' గ్రంథంలో బద్ధలు చేయబడింది. పుస్తకంలోని కవితలన్నిటినీ గద్యరూపంలో పేరాలుగా రాసుకు పోయారు. వీటిలో వాక్యాలు లేవు. తుది మొదళ్ళు లేవు. భావానుగుణంగా పంక్తుల విరుపులూ లేవు. వ్యాకరణపరమైన విరామచిహ్నాలు కామాలు, ఫుల్‌స్టాప్‌లు లాంటివి కూడా వాడబడలేదు. ఒక్కో పేరా పేర్చి చేసిన పదాల కుప్పలా ఉంది. దీని వలన పుస్తకాన్ని చదివే పాఠకుడు ఎక్కడ ఆగి చదవాలో, ధారగా సాగే భావాన్ని ఎక్కడ విరిచి ఎలా అన్వయించుకుని గ్రహించుకోవాలో తెలియక తప్పకుండా తికమక పడతాడు. చదువరిని సాఫీగా చదువనీయకుండా భాషా పరమైన ప్రాథమిక సాంకేతిక చిహ్నాలను తీసివేసి రాయడం మాత్రం ప్రయోగంక్రిందికి రాదు.ఐనా తన యింగ్లీషు అనువాదానికి అవసరమైన కామా, ఫుల్ స్టాప్ వంటి యితర విరామచిహ్నాలు తెలుగు కవితలకు ఎందుకు అవసరం లేకుండా పోయాయో అర్థంగాదు. ప్రయోగాలు భావాలతో, సిద్ధాంతాలతో, శిల్పంతో, శైలీ వైవిధ్య విషయాలతో జరగాలిగాని పాఠకులను అస్తవ్యస్తపాలు చేసే యీ రకమైన భాషా సంబంధమైన తికమకలతో కాదు.

"It is impossible to read poems Gorilla without arriving at a new appreciation of Seshendra's prodigious talent—" అని పరిచయ వాక్యాలలో ఇందిరాదేవి ధన్‌రాజ్‌గిర్ గారన్నట్లు పఠిత రసహృదయుడై సాహిత్య పరిజ్ఞానాన్నీ, కవిత్వ వ్యక్తిత్వాన్నీ కలిగివుంటే తప్ప యీ ప్రయోగశీల కవితను ప్రశంసించలేరు.

మొత్తానికి 'గొరిల్లా' ఓ కొత్త ముద్ర.

శ్రీ శర్మగారు మక్కువ ఎక్కువగా ఉన్న కొన్ని పదాలను పదే పదే వాడడంవల్ల కావ్యంలో పునరుక్తికి సంబంధించిన బలహీనత అక్కడక్కడ రేఖామాత్రంగా తొంగిచూచింది. ఉదా :— తుఫాను (యీ పదం దాదాపు యిరవైసార్లు వాడబడింది.) జెండాలు, ఎగిరిపోవడం... etc.

పుస్తకాన్ని తెలుగువారికోసం కూడా రాశారు కాబట్టి ముందుమాటనూ, పరిచయవాక్యాలనూ తెలుగులో కూడా వెలువరిస్తే యింగ్లీషు అంతగా రాని పాఠకులుకూడా కవి భావనను సమగ్రావగాహన చేసుకునే వీలుంటుంది. పునర్ముద్రణలో యీ విషయాన్ని ప్రకాశకులు దృష్టిలో ఉంచుకుంటారని ఆశిస్తాను.

పుస్తక ముఖపత్ర ముద్రణా, లోపలి పేజీల ప్రచురణా శుభ్రంగా, అందంగా ఉంది.

కవితా ప్రవాహాన్ని ఓ కొత్త మలుపు తిప్పడానికి ప్రయత్నిస్తున్న శ్రీ శర్మగారిని అభినందిస్తున్నాను.

కవితాభిమానుల మనుకుంటున్న ప్రతివ్యక్తీ తప్పకుండా చదువదగ్గ పుస్తకం యిది.

## అనలకిరీటం

[కవిత : రచన : సోమసుందర్. పేజీలు : 100. వెల : 5 రు. ప్రచురణ: కళాకేళి ప్రచురణలు, పిఠాపురం,533450. ప్రతులకు : విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ–2: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాద్]

'వజ్రాయుధం'తో 1949లో తెలుగుగడ్డపై ఒక నవ కవితావేశంతో తన సొంత గొంతును వినిపించి—అటు తర్వాత ఎన్నో అభ్యుదయ గీతాసుమాలను వికసింపజేసిన ప్రముఖ కవి శ్రీ సోమసుందర్. వివిధ సందర్భాల్లో రచించి వివిధ పత్రికల్లో ప్రచురించి ప్రకటించిన కవితలను యిప్పుడు ఓ దారానికి గుచ్చి కవితా సమాహారంగా వెలువరించారు. సందర్భాలు ఒకలా ఎప్పుడూ ఉండవు. పరిస్థితుల ప్రకంపనాలకు స్పందిస్తూ తదనుగుణంగా అనుభూతి వశమైపోయే మనసు విభిన్నమైన భావాలతో రూపుదిద్దుకుంటుంది. బీహారు క్షామాన్ని చూచి కరిగిన హృదయంతో ఒక కవితా, కృష్ణశాస్త్రిగారి గొంతు మూగవోయినపుడు బాధతో రాసిన మరో కవితా, ప్రభుత్వంవాళ్ళ హద్దులుండే ఆకాశవాణి ప్రసారాల్లో చదవడానికి రాసిన యింకో కవితా, ఏ వారపత్రిక ప్రత్యేకసంచిక కోసమో తప్పనిసరై రాసిన క్రాంతి కవితా—యిలా రకరకాల గీతాలు 1964 నుండి '68 దాకా రాసినవి యీ గ్రంథంలో చోటు చేసుకున్నాయి. విస్తరిలో రకరకాల వంటకాలున్నప్పుడు రకరకాల భిన్నరుచులు తప్పవు. అలాగే సందర్భోచితమైన పరిధుల నడుమనుండి బయటపడ్డ యీ కవితలు సూత్రబద్ధమైన ఏకధారగాలేవు. ఆకాశంలో ఎగురుతున్న వివిధ విహంగ సమూహాన్ని ఏకదృశ్యంగా వీక్షిస్తున్న అనుభూతిని పొందుతాడు పాఠకుడు యీ పుస్తకాన్ని చదువుతున్నపుడు. ఐతే యీ మధ్యకాలంలో పత్రికల్లో ప్రచురితమవుతున్న శ్రీ సోమ

సుందర కవితలకూ, యీ కావ్యంలో ఆచ్ఛొత్తించబడిన కవితలకూ నడుమ ప్రస్ఫుటమైన భేదం కనిపిస్తుంది మనకు.

యిక శ్రీ సోమసుందర్ కవితాతత్వాన్ని విశ్లేషిస్తే—

తన 'భవిష్యద్గీత' గీతంలో తన గురించి తాను ప్రస్తావించుకుంటూ తనపై గురజాడ, కృష్ణశాస్త్రీ, శ్రీశ్రీలు బలమైన ముద్రను వేసినట్టు చెప్పుకున్నారు. అదే కవితలో భగవద్గీతలోని శ్రీకృష్ణభగవానుని తనలో ధ్వనింపజేస్తూ—

''నేనే కర్తని—భోక్తని నేనే
నేనే స్రష్టని—సృష్టిని నేనే
నవలోకానికి సుదర్శన చక్రధారిని నేనే
సామాన్యుని మాన్యతరునిగా చేయనవతరించిన
తారుణ్య శక్తిని నేనే—
యీ యుగానికి మకుటధారిని.'' (పే. 7)

అని అచంచల విశ్వాసంతో, మహదావేశంతో గొంతెత్తారు. బాగుంది. ఐతే ఆయనే ''ఇది భయంకర కాళరాత్రి'' అనే కవితలో

''నిద్రపోతున్న లోకంలో నేనొక్కణ్ణే ఎందుకు మేల్కొన్నాను?
ఉపద్రవాలిన్నింటికీ నేనొక్కణ్ణే ఎందుకు ఎర అవుతున్నాను?
ఇన్ని వేల శవాలమధ్య నేనొక్కడ్నే ఎందుకు మసలుతున్నాను
ఇంత సాంద్ర దరిద్ర తమస్సులో నేనొక్కణ్ణే
ఎందుకు బందీనయ్యాను—''
అని వాపోతూ

''బాబోయ్, ఇంక సూర్యోదయ మవదా ఏమిటి?
అమ్మోయ్ ఇంక ఆశాలేశం తోచదా ఏమిటి?''

అని గాఢ నిరాశాప్రవాహం **(Pessimism)** లోకి కొట్టుకు పోతున్నారు.

'రెల్లుదిబ్బలు' అన్న కవితలో

''ఎన్ని బొమ్మలు గీసినా ఫలితంలేదు—
కుంచెలూ రంగులూ ఉపయోగంలేదు
ఏలికల డెందాలు పెనురాతి బండలు!
కాలం వర్షాల వాగులలో సుడిగుండార వాగురలో
కవితలు భవిష్యత్తుల తెరచాపలులేని కత్తిపడవలు...''
అని ఒట్టి నిస్సహాయతను ధ్వనింప జేస్తున్నారు.

మరొకచోట ఆధునిక కవిత్వాన్ని నాగరిక వధూనికగా చిత్రిస్తూ—''వదిన'' అన్న పదానికి చిత్రవ్యాఖ్యానం చేశారు—

''వదిన అనగా
సౌమిత్రికి సీతవంటిది కాదు
సుగ్రీవుడికి తారవంటిది
సహదేవుడికి ద్రౌపదివంటిది—'' అని (పే. 66)

పుస్తకంలో...

''మృగమద కుంకుమ ఘనసార సంకుమద హిమంబు
కాలాగురు గంధసార ప్రభృతి సుగంధ ద్రవ్యంబు—'
(పే. 40) లాంటి వాక్యాలు శ్రీ సోమసుందర్‌గారి భాషాపాటవాన్ని ప్రదర్శిస్తాయి.

అంతా రాసి ఒకచోట—''ఎలిజీకాదు ఎపాలజీ'' గేయంలో
''ఇది కవిత్వంకాదు భగవన్—మమ్ము క్షమించు
''పదిలంకాని'' ఊహల్ని బట్వాడా చేస్తున్న కాగితం పడవ
... ... ... ...
చెబుతున్నాను పదే పదే ఇది కవిత్వంకాదు క్షమించు
... ... ... ...
కవిత్వం కాకపోతేనేంలే ఏదో
వ్రాస్తున్నాంకదా సంతోషించు—'' అంటున్నారు.

మరి యీ కవితను ఏ సభలోనైనా తనకు నచ్చని కవినీ, అతని కవిత్వాన్నీ మందలించడానికి రాశారో తెలియదు.

పుస్తకంలో యిదివరకే ఓ అచ్చుతప్పుల పట్టిక ప్రకటించబడింది. ఐనా యింకొన్ని తప్పులున్నాయి. ఉదా: సుతలామూ (పే. 57), విశాకాంధ్ర (పే. 42) ఆటలికంగా (పే. 79), పతప (పే. 66.) మమల్ని (పే. 8)—లాంటివి

ఐతే శ్రీ సోమసుందర్‌గారి అపూర్వమైన భావుకతా, శిల్పం కొన్నిచోట్ల ఎంతో రమ్యంగా దర్శన మిస్తుంది ఇందులో.

ఉదా :—

''కాలాగురు ధూపంగా నల్లగా మనోహరంగా
గ్రంథించబడిన రెండట్టల మధ్య
ఉద్దండమైన చెలియలి కట్టల మధ్య
రూపొందిన తమస్సాగర మహాకావ్యాని వీవు
ఒక అట్ట నింగి కాగా— వేరొకటి నేల
రెంటి నడుమా అక్షయ నక్షత్రాల అక్షరాలు—''
(స్వప్నవాసవ దత్త —పే. 67)

''......
మాడిన అప్పడంలా లుంగ చుట్టుకు పోయిందాత్తనికడుపు''
(సుప్తనదిలో తప్త జలాలు P. 77)

''ఎక్కడ త్రాగానో ఎన్నెన్ని పాత్రలతో త్రాగానో
పిసరంతైనా దప్పి తీర్చిందా కవితా పయస్సు''
(భవిష్యద్గీత పే. 1)

''వంతెన క్రింది నీళ్ళు ...
అతని గండ స్థల పానువుల్లో కన్నీళ్ళు..

సుప్తనదిలో తప్త జలాలు ...
జలతరంగిణి సోలో మ్రోగిస్తున్న బాష్పాలు...''
''నగ సానువుల పాషాణ భర ఏకాంతాలలో
భగవాను డరుస్తున్నాడు నిశ్శబ్దంగా''—
(సుప్తనదిలో తప్త జలాలు పే. 78)

పుస్తకాన్ని చూచిన తర్వాత దీని వెల ఐదు రూపాయలంటే కాస్త ఎక్కువే అనిపిస్తుంది. ప్రచురణకర్తలు తెలుగు పాఠకుల స్తోమతను దృష్టిలో పెట్టుకుని (లైబ్రరీలకు అంటగట్టాలనే దృష్టితో కాకుండా) ధరను నిర్ణయిస్తే పుస్తకాలను యింకో నలుగురు చదివే వీలుంటుంది.

యీ గ్రంథాన్ని శ్రీ సోమసుందర్‌గారు తమ ప్రియమిత్రులైన సాంఘిక, సంక్షేమ, సాంకేతిక విద్యాశాఖామాత్యులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారికి అంకిత మిచ్చారు. అభినందనీయమే.

—శ్రీ రామచంద్రమౌళి

# శ్రీ మయూర సూర్యశతకమ్

[అనువాదం : శ్రీ యామిజాల పద్మనాభస్వామి, క్రౌన్ సైజు 48 పేజీలు. వెల రూ 1–50. త్రివేణి పబ్లిషర్సు, మచిలీపట్టణము—521001.]

తెలుగులో వందలకొద్దీ శతకాలు ఉన్నవి. సంస్కృతంలో చాలా తక్కువ. తక్కువే అయినా ఒక్కొక్క శతకం ఒక్క కావ్యం వంటిదని చెప్పవచ్చు. సంస్కృతంలో చచ్చుశతకాలు లేవు. వాటి ప్రశస్తిని బట్టి అవి యితర భాషల్లోనికి అనూదితాలయి బహుళ ప్రచారాన్ని పొందాయి. ఉదాహరణకు భర్తృహరి సుభాషిత త్రిశతి, మయూరుని సూర్యశతకం, మహిషశతకం మున్నగు వాటిని చూపవచ్చును. తెలుగులో చాలా శతకాలున్నా, ప్రఖ్యాతిని పొందినవి వృషాధిప శతకం, శ్రీకాళహస్తీశ్వర శతకం, భాస్కర శతకం, ఆంధ్రనాయక శతకం, రామలింగేశ్వర శతకం, దాశరథీ శతకం, సుమతి శతకం మొదలైన కొన్ని మాత్రమే పేరు తెచ్చుకున్నవి. చాలా శతకాలు పేరుకు మాత్రం శతకాలు. వాటిలో కవితా చమత్కృతి మృగ్యం. ఇట్టి రచనలను బట్టే శతక వాఙ్మయాన్ని తేలికగా చూడడం జరుగుతున్నది.

సంస్కృత శతకాలలో మయూర మహాకవి రచించిన సూర్యశతకం మిక్కిలి ప్రసిద్ధి చెందినది. చాలా ప్రౌఢమైనది. మయూర మహాకవి కుష్ఠురోగంతో బాధపడుతూ, ప్రత్యక్ష దైవమైన సూర్య దేవునిపై యీ శతకం చెప్పి, రోగ నివారణ చేసుకున్నట్లు ప్రసిద్ధి. ''ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్'' అని గదా చెప్తారు. ఈ అనువాదకులుకూడా రక్తగ్రహణితో బాధపడుతూ, దీన్ని తెలిగించి, రోగ నివారణ చేసుకున్నట్లు పరిచయ వాక్యాలలో చెప్పుకొన్నారు.

మయూరుని యీ శతకంలోని పద్యాలు ఆలంకారికులచేత వివిధ లక్షణాలకు ఉదాహరణంగా స్వీకరించబడినవి. శ్రీనాథ మహాకవి తన కాశీ ఖండంలో సూర్యస్తుతికి ఇందలి శ్లోకాలనే కొన్నిటిని ఆధారంగా గ్రహించాడు. అతి ప్రౌఢమై, అక్కడక్కడ శ్లేషలతో కూడి ఉన్న ఈ శ్లోకాలను అనువదించడం చాలా కష్టం. అందువల్లనే కాబోలు సామాన్య కవులెవ్వరూ దీని జోలికి పోలేదు. ఇదివరలో ఆకుండి—వ్యాసమూర్తి శాస్త్రిగారివంటి ఇద్దరుముగ్గురు విద్వత్కవులు మాత్రం దీనిని తెలిగించారు.

పద్మనాభస్వామిగారు సంస్కృతాంధ్రాలలో పండితులు. చక్కని కవులు. అందువల్లనే మూలాభిప్రాయం చెడకుండా చక్కగా దీనిని తెలిగించడం వీరికి సాధ్యమయింది. ఆయన ముప్ఫయి రోజుల్లో దీన్ని ముగించడమే వారి శక్తి సామర్థ్యాలను తెలుపుతున్నది. ఇది మొదట 'సంజయ' వారపత్రికలో ప్రకటితమయింది. తర్వాత అనువాదకులు తమ మిత్రులు కె. టి. శేషయ్యగారి కోరికపయి దీన్ని శ్రీ లక్ష్మీ నరసింహస్వామివారికి కృతి యిచ్చారు. 'త్రివేణి' వారు చక్కగా ముద్రించి ప్రకటించారు.

మూలాభిప్రాయాన్ని అనువాదంలోకి యథాతథంగా తీసుకుని రావడం పండిత కవులకేకాని యితరులకు సాధ్యంకాదు. అనువాదం మూలమంత రసవంతంగా ఉండడమూ అరుదే! అయినా పద్మనాభస్వామిగారు ఎంతో శ్రమపడి మూలానికి దీటుగా తమ అనువాదాన్ని సాగించారు. శ్లేష ఉన్న శ్లోకాలను తెలిగించడంలో ఎంతో జాగ్రత్త వహించారు. ఉదాహరణకు—

'దత్తానందాః ప్రజానాం సముచిత సమయా
కృష్ట సృష్టైః పయోభిః
పూర్వాహ్ణే విప్రకీర్ణా దిశిదిశి విరమ
త్యహ్ని సంహారభాజః,
దీప్తాంశో ర్దీర్ఘదుఃఖ ప్రభవ భవ భయో
దన్వ దుత్తార నావో
గావో వః పావనానాం పరమ పరిమితాం
ప్రీతి ముత్పాదయంతు'.

అనువాదం —

''సమయస్ఫూర్తి పయస్సులన్ గురిసి యు
త్సాహమ్ము కల్పించుచున్
క్రమ వృత్తిన్ తొలి ప్రొద్దునన్ వివిధ ది
క్సంచారమున్ జేయు చ
స్తమయం బౌనెడ సంస్థితిం గనుచు సం
సారాబ్ధికిన్ నౌకయై
విమతఘ్నుం బిను పూతగోగణము సం
ప్రీతిన్ మమున్ గాచుతన్''

(పుటలు 10, 11)

ఇందులో సూర్యకిరణాలకూ, గోవులకూ, శ్లేష. అది మూలంలో వలెనే అనువాదంలోనూ చక్కగా సమర్థించబడింది.

అనువాదంతోకూడా మూలం చేర్చబడి ఉన్నది. ఇది పాఠకులకు ఎంతో అనుకూలమై ఉంటుంది. దీన్ని రచించిన పద్మనాభస్వామి గారు, వెలుగులోకి తెచ్చిన శేషయ్యగారు, ప్రకాశకులు అభినంద నీయులు.

"అంగీరస"

# విజ్ఞానేశ్వరము

[మూలఘటిక కేతన కృతము. ప్రస్తావన, లఘుటీక : డాక్టర్ సి. వి. రామచంద్రరావు. డెమ్మీసైజు 16+40పుటలు. వెల : 10రూ. ప్రకాశకులు—మానస పబ్లికేషన్స్, 435—4బి. తెక్కేమిట్ట, నెల్లూరు : 524003.]

ధర్మశాస్త్ర గ్రంథాలలో యాజ్ఞవల్క్య మహర్షి రచించిన యాజ్ఞవల్క్యస్మృతి ప్రామాణికమైనది. దీనికి విజ్ఞానేశ్వరుడు వ్రాసిన 'మితాక్షర'వ్యాఖ్య పరమ ప్రామాణికమైనది. ఆ స్మృతికి ఇతరవ్యాఖ్యానా లున్నా ఇప్పటికిన్నీ హిందూ లా విషయంలో న్యాయ స్థానాల్లో మితాక్షరవ్యాఖ్యయే ప్రామాణికంగా గ్రహింపబడుతున్నది. దానికి విజ్ఞానేశ్వరీయ మనే పేరు ప్రసిద్ధంగా ఉంటున్నది.

కేతన యీ విజ్ఞానేశ్వరీయాన్ని అనుసరించి 'విజ్ఞానేశ్వర' మనే పద్యకృతిని రచించాడు. గ్రంథాంతమునగల 'తజ్ఞులకు దెలియునట్లుగ, బ్రాజ్ఞులు మది మెచ్చ దెలుగు పద్యములను దత్త్వజ్ఞుడు మానయకేతన, విజ్ఞానేశ్వరము జగతి వెలయగ జెప్పెన్' అనే పద్యంవల్ల దీనికి విజ్ఞానేశ్వరమనే పేరు పెట్టినట్లు తెలుస్తున్నది. ఇందులో ఆచారకాండం, ప్రాయశ్చిత్తకాండం, వ్యవ హారకాండం అనే మూడు అధ్యాయా లున్నవి. ఇది సంస్కృతంలోని విజ్ఞానేశ్వరీయానికి యథామూలమైన అనువాదంకాదు. యాజ్ఞ వల్క్య స్మృతికి విపుల వ్యాఖ్య అయిన మితాక్షర వ్యాఖ్యలోని ప్రధా నాంశాల సారాంశాన్ని మాత్రమే కేతన యిందులో తెలియజేశాడు. అందువల్ల ఇది అనువాదం కాక సారం మాత్రమే అవుతుంది. ఇందులో కేతన తన కాలంలో ఆంధ్రదేశంలోని సాంఘిక పరిస్థితు లకు, ఆచార మత సంప్రదాయాలకు అనుగుణమైన విషయాలను సంగ్రహించియున్నాడు. శిక్షాస్మృతులు తెలుగు దేశానికి అనుగుణం గానే కానవస్తాయి. రచనలో—నిత్యవ్యవహారంలో ఉన్న తెలుగు పదా లనే ఎక్కువగా వాడినాడు. సరియైన తెలుగుపదం దొరకనప్పుడు మాత్రమే సంస్కృత పదాల వాడుక కానవస్తుంది. సంస్కృ తంలో ఉన్న చాలా పారిభాషిక పదాలకు అనుగుణమైన తెలుగు పదాలు ఈ చిన్న పుస్తకంలో చాలా దొరుకుతాయి.

కేతన విజ్ఞానేశ్వరాన్ని కడచిన శతాబ్ది చివర శ్రీ కందు కూరి—వీరేశలింగం పంతులుగారు తమ 'చింతామణి' పత్రికలో ప్రకటించారు. తర్వాత ఇది ప్రకటించబడినట్లు కానరాదు. ఇతని గ్రంథాంతరాలైన దశకుమార చరిత్ర, ఆంధ్రభాషా భూషణం మాత్రమే ప్రకటితాలైనవి. దీని ప్రతి ఏ ప్రాచీన గ్రంథాలయం లోనో తప్ప మరెక్కడా లభించదు. విషయ ప్రాధాన్యాన్నిబట్టీ, భాషాప్రాధాన్యాన్నిబట్టీ దీని పునర్ముద్రణ ఎంతో ఆవశ్యకమైనా, ఆ పనికి ఎవ్వరూ పూనుకోలేదు. ఇట్టి పరిస్థితులలో సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు, భాషావాఙ్మయాభిమానులు అగు డాక్టర్ సి. వి. రామచంద్రరావు (ఎం. ఏ. పి. హెచ్‌డి) గారు దీని ప్రతి నెట్లో సంపాదించి ఆంధ్ర పాఠకలోకానికి అందచెయ్యడం ఎంత హర్షదాయకమై ఉన్నది.

ఏతత్సంపాదకులు డాక్టర్ రామచంద్రరావుగారు విపులమైన తమ ప్రస్తావనలో యాజ్ఞవల్క్య మహర్షిని గురించీ, అతని స్మృతిని గురించీ, విజ్ఞానేశ్వరుణ్ణి గురించీ, అతని మితాక్షర వ్యాఖ్యను గురించీ కూడా చర్చించారు. ప్రస్తుత గ్రంథాన్ని రచించిన కేతనకవి కాలాన్ని గురించీ, తలిదండ్రులను గురించీ, అతని గ్రంథాలను గురించీ చాలా విషయాలను తెలియజేశారు. ధర్మశాస్త్ర విషయాలన పెక్కింటిని పాఠకులకు అందించారు. ఇవన్నీ వారి ప్రగాఢ పరిశీ నకు తార్కాణాలు. ఇవి సామాన్య పాఠకులకే కాక పరిశోధకులకూ విషయ జిజ్ఞాసువులకూ మిక్కిలి ఉపయోగకరమైనది. ఈ ప్రస్తా వన మూలానికి ఎక్కువ విలువను చేకూరుస్తున్నది. గ్రంథం చివర చేర్చబడిన లఘుటీకలో తెలుగులోని మారుమూల పదాలకూ, అప్పటికి వాడుకలో ఉన్న పదాలకూ అర్థం యిచ్చి సంపాదకులు పాఠకులకు ఎంతో సహాయం చేశారు.

మానస పబ్లికేషన్స్‌వారి యీ అమూల్య గ్రంథానికి మూల్యం కొంత ఎక్కువగా కానవచ్చినా, గ్రంథం విలువనుబట్టి అది సముచితంగానే ఉన్నదని చెప్పవలసి ఉన్నది.

—శ్రీ బులుసు వేంకటరమణయ్య

# రాయలసీమ రైతు

[కృషిక జీవనం వర్ణించే పద్య కావ్యం. భైరపురెడ్డి రెడ్డి నారాయణ రెడ్డి. డెమ్మి 70 పుటలు. వెల రు. 4— ప్రతులకు :— బి. ఆర్. నారాయణరెడ్డి—రాయవరం పోస్టు రాయచోటి తాలూకా, కడపజిల్లా. ]

మన కవులకు సామాన్యుల సంగతి వర్ణించడం, సామాన్యు లను కథానాయకులుగా చేయడం చాలా అరుదైనపని. కండకావ రంతో మదనతాపం బడే రాణుల విరహగాథలేగాని, కష్టజీవుల

చెమటలో దడిసిన నిష్కల్మష ప్రేమలీలలు రుచింపవని, ముందె వ్వడో, కట్టమంచి రామలింగారెడ్డి చేసిన ఎగతాళి ఈ నాటికీ కొత్తకరకు మాయకుండా ఉన్నది.

'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్నది నాలుక కొననుండివచ్చిన మాట. గ్రామీణ జీవితాన్ని గురించి గాని, ప్రజకు అన్నం బెట్టే సేద్యంచేసే రైతు సంగతిగాని అంతగా వర్ణింప బడలేదు. అభ్యుదయ కవులు కార్మికులమీదనే బడినారు. పట్టణాల సౌధాలు దప్ప మన పూర్వకవులు పల్లెటూరి పూరి గుడిసెలు దరిసి ఎరుగరు; ఆ పని పరువు తక్కువనిగూడ అనుకొన్నట్లున్నది. గ్రామీణ జీవితం మీద ఇంగ్లీషు కవులు చాలా మక్కువ చూపినారు. (ప్యాస్టరల్ పొయిట్రి) పోతనామాత్యుడు బృందావన లీలలో ఈ రుచి చూపినాడు. ఇక 50 ఏండ్లనాడు, కవికోకిల దువ్వూరు రామిరెడ్డి "కృషీవలుడు" అనే కావ్యం వ్రాసి, అకళంక కృషికుని ఆనందమయ జీవితాన్ని వర్ణించి మెప్పులందినాడు.

దాని తర్వాత ఇప్పుడు ఇంకొక సేద్యగాడు, రాయలసీమ రైతు కడగండ్లను, ఆయన సంఘసేవను, అరమరలులేని కాపురాన్ని రసవత్తర ఫణితిలో, భావ అర్థ గంభీర ధారాశోభితమైన శైలిలో పద్యకావ్యంవ్రాసి, గ్రామ్యజీవనాన్ని ఉదాత్తపరుస్తున్నాడు. ఆంధ్రమాత అన్నపూర్ణ; ఆ అన్నం కల్పించే ఆ సేద్యగాని— చెమటన దడసి ముద్దయిన జీవితానికంటె తగిన కవితావస్తువు ఇంకొకటి ఉంటుందా?

రెడ్డి నారాయణరెడ్డి సిసలైన గ్రామీణుడు. పగలెల్లా దున్ని ఒళ్ళంతా బురద బూసుకొని, సంజెలో ఇల్లుజేరి,స్నానమాడి పశువులప్రక్కన మంచం వేసుకొని, ఆలుబిడ్డలతో అతిథి సత్కారాలతో ఆనందించే జీవనం ఈ పండితకవిది. ఈ వృత్తేగదా భారతీయ సాంఘికవ్యవస్థకు మూలకందము. పాండిత్యమబ్బినా కవిత్వంలో బాగా చేయిదిరిగిన గ్రామీణకవి—అంటే, లోకకవి ఈ రెడ్డి. సాహిత్యక్షేత్రంలో మేలిమిపంటనే పండించి రాశిబోసినకృషీవలుడు.

రాయలసీమ ఆనాడు, శౌర్యలక్ష్మి కవితాలక్ష్ములకు ఆలవాలమై, ఈనాడు క్షామదేవతకు నాట్యరంగమై ఉన్నది. పిలువకుండానే ఈ రాళ్లసీమలో కరువులు వస్తుంటవి.

ఈ రైతుకథలో, కృషిసౌభాగ్యము, క్షామ దౌర్భాగ్యము, మేఘాన్ని చూచిపడిన ఆనందము, గ్రామీణజీవనము, రైతుల తృప్తిని మనోజ్ఞంగా వర్ణించినాడు—ఈరైతుబిడ్డ. వరపువరదల ఈతిబాధ ఆయన అనుభవించి పాఠకుని అనుభవింపజేస్తున్నాడు. ఈకవి పండితుడు, సరసమైన భావుకతగలవాడు.నుడికారపుసొంపు గల పద్యరచన, సంస్కృత గంభీరసమాసము ఈ కావ్యానికిముఖ్యాలంకారాలు. పల్లెజీవనఘనతకు ఇట్లా మురిసిపోతున్నాడు:—

అడుసువడుటమేలో
యడుగులకున్ మడుగులొత్తి యధికారుల వెం
బడి భిక్షాటన మేలో
తడయక యోచింపుడయ్య—— అంటున్నాడు

ప్రౌఢిపరికింపండి:—

బర్హి యాడెను, కోయిల పాటబాడె,
చిలుక స్వాగతపద్యంబు కలిసిచదివె,
శారికాస్తవ మభిజాత సరసరుతము
మేఘరంజినిరాగమై మేళవించె,

ఈ కవితాపాఠం పూర్తిగా చదివి ఆనందించవలసినది.

**శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి**

# గ్రంథస్వీకారం

* భగవద్రామానుజ స్తుతి (దివ్య ప్రబంధము) పరిష్కర్త : శ్రీ చక్రవర్తి వేంకట నృసింహాచార్యులు. పేజీలు 204. వెల : రు. 8, ప్రకాశకులు : శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు, కృష్ణాజిల్లా.
* ఒకడే దేవుడు (నద్వితీయోస్తి కశ్చన) రచయిత : శ్రీ కాశీ వజ్ఝల రామకోటి శాస్త్రి: పేజీలు : 86, మూల్యం : అమూల్యం : ప్రతులకు : రచయిత, మార్కాపురం, ప్రకాశం జిల్లా.
* భృగువంశము (హరికథ) రచన : శ్రీ గజ్జెల్లి శివరాజము, పేజీలు : 68. వెల : రు. 2 ప్రతులకు : రచయిత్రి, ఊటుపల్లి గ్రామము, పోస్టు భూషణరావు పేట, తా॥ మెట్పల్లి, జిల్లా కరీంనగరము.
* సనాతన భారతి (అర్ష విజ్ఞాన మాసపత్రిక) సంపాదకుడు: శ్రీ శివకోటి సత్యనారాయణమూర్తి, పేజీలు 16, విడి ప్రతి ; రు. 1—50. చిరునామా: సంపాదకుడు, సనాతన భారతి, మారుటేరు—534122. తణుకు తాలూకా, ప॥ గో॥ జిల్లా.
* నెలవంక, (ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల, తిలక్‌రోడ్డు, హైదరాబాదువారి సాహిత్య వార్షిక సంచిక) ఇందులో విద్యార్థుల, ఉపాధ్యాయుల వ్యాసాలు, కవితలు మొదలగునవి కలవు.
* శ్రీ నారాయణ తీర్థ యతీంద్ర సద్గురుస్వామి ఆరాధన మహోత్సవ సభ, హైదరాబాదు. (శ్రీకృష్ణలీలా తరంగ గాన సప్తాహ సంచిక 1975—76) ఇందులో ఉత్సవ సభల ఫోటోలు, ప్రముఖ రచయితల రచనలు కలవు.
* దత్తాత్రేయ సుప్రభాతమ్. రచయిత: శ్రీ తిరువరంగం సుధాకరాచార్యులు. పేజీలు: 8, వెల: తెలియదు:, ప్రకాశకులు: విశ్వజన మత ప్రచారణ సంస్థ; దత్తాత్రేయ ఆశ్రమము; పురాణీపేట; బీమ్‌గల్; ఆర్మూరు తాలూకా; నిజామాబాదు జిల్లా.

Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.